# ప్రకృతి ఒడిలో పరవశం మలేషియా సందర్శనం




మలేషియా మ్యాప్.

మలేషియా గురించి చెప్పుకోవాల్సి వస్తే ముందుగా ఆ దేశ భాష గురించి చెప్పుకోవాలి. ఒక్క పదాన్ని ఎన్నో రకాలుగా పలకచ్చు. పలకడంలో తేడాలో పూర్తి అర్థం మారిపోవడం కూడా మలేషియా భాష ప్రత్యేకత అని చెప్పచ్చు. స్నేహానికి ప్రాణం ఇస్తారు మలేషియా దేశస్థులు.

ప్రపంచంలో అతి ఎత్తైన భవనం మలేషియాలోనే ఉంది. దీనిని 'పెట్రొనాస్ టవర్స్' అంటారు. ఈ భవనం ఎత్తు 1,607 అడుగులు. ఈ దేశపు భూభాగంలో దాదాపు 50 శాతం వర్షాధారపు అడవులతో ఆక్రమించి ఉన్నాయి.

ఒక్కసారి మలేషియాలోకి అడుగు పెడితే

మలేషియాలో బీచ్‌లో సేదతీరుతున్న సందర్శకులు

అంతా వయసు మర్చిపోతారు. చిన్నపిల్లలై పోతారు. ఇక్కడి వాతావరణం అటు వేడి గానూ, ఉండదు, అలా అని చలి పుట్టిం చదు. మధ్యస్థంగా ఇంకా చెప్పాలంటే చాలా ఆహ్లాదకరంగా ఉంటుంది. టూరిస్టులు చూడదగిన ప్రదేశాలు కూడా ఇక్కడ ఎన్నో ఉన్నాయి.



రంగురంగుల గాలిపటాల వినోదం

ముందుగా మలేషియన్ కరెన్సీ గురించి తెలుసుకుందాం. ఇక్కడ ఉపయోగించే కరె న్సీని 'రింగిట్' అంటారు. దీనిని డాలర్ అని వ్యవహరిస్తారు. 'M$' అంటే మలేషి యన్ డాలర్ అని అర్థం. రింగిట్‌ను నూరు సెంట్స్‌గా విభజించారు.

**మలేషియన్ ఫుడ్!**

ఇక్కడ ఆహార పదార్థాలమీద ఎక్కువగా చైనీస్, ఇండియన్ ప్రభావం కన్పిస్తుంది. రెండింటి కలయికతో మలేషియాలో లభించే ఆహార పదార్థాలు నోట్లో నీళ్ళూ రేలా చేస్తాయి. వారు మసాలా దినుసులు ఎక్కువగా వాడి ఆహార పదార్థాలు తయారుచే స్తారు. ఎన్నోరకాల ఫుడ్ ఐటమ్స్ ఇక్కడ లభి స్తాయి.

ఇక్కడి రెస్టారెంట్స్‌లో చాలా సంప్రదాయ బద్ధంగా ఆహార పదార్థాలు తయారుచేస్తారు. మనదే శంలోలానే మలేషియాలో కూడా రోడ్డు పక్కన బండి పెట్టి ఆహారపదార్థాలు తయారుచేసి అమ్ముతారు. సాధారణంగా ఈ స్టాల్స్ సాయంత్రంపూట మాత్రమే దర్శనమిస్తుం టాయి. నిజానికి ఇలాంటి చోట్ల ఫుడ్ తినడానికి చాలామంది సందేహి స్తారు. శుభ్రంగా ఉండ దని, అనారోగ్యాలు వస్తా యని అనుకుంటారు. కానీ అలాంటి సందేహాలేమీ అవసరంలేదు. కారణం ఏమిటంటే పరిసరాలు, వండేవారూ, వంటపా త్రలు అంతా ఎంతో శుభ్రంగా ఉంటుంది. అంతేకాదు మనం ఆర్డర్ చేసిన పదార్థాలు మన కళ్ళముందు తయారుచేసి ఇస్తారు కాబట్టి డౌట్ పడకుండా ఆరగించేయచ్చు.

సాయంత్రాలు, చల్లటిగాలులు, చక్కటి సంగీతం మధ్య నూడుల్స్, చేపలకూర, తాజాపండ్ల రసం ఇలా చెప్పూపోతే అక్కడికి వెళ్ళి ఈ ఫుడ్ రుచిచూడాల్సిందేనన్పిస్తుంది.




మీరుకోరిన పండ్లరసం క్షణంలో మీముందు ఉంటుంది. పనసరసం . దగ్గరనుండి బొప్పాయి జ్యూస్‌దాకా మీకు కావాల్సింది లభిస్తుంది.

**వాతావరణం గురించి...**

మలేషియా టూరిస్టులకు చాలా అనువైన ప్రదేశం అని చెప్పుకున్నాంకదా... అందుకు ప్రధానంగా క్రెడిట్ అంతా ఇక్కడి వాతావరణానికే దక్కుతుంది.

ఇక్కడ ఉష్ణోగ్రత 20 డిగ్రీల సెల్సియస్ నుంచి 32 డిగ్రీల సెల్సియస్ వరకూ ఉంటుంది. సాధారణంగా సంవత్సరం అంతా ఇదే ఉష్ణోగ్రత కొనసాగుతుంది. పశ్చిమ పెనిన్సులాలో మే నుండి సెప్టెంబరుదాకా వర్షాలు పడతాయి. అవే తూర్పు పెనిన్సులాలో నవంబరునుండి ఫిబ్రవరి మధ్య వర్షాకాలం ప్రభావం ఉంటుంది. కానీ మలేషియా పరిస్థితి వేరు. ఇక్కడ వర్షాకాలం కూడా జనానికి ఆనందాన్ని తెచ్చిపెట్టేదిగా ఉంటుంది. జల్లులతో పుడమి పులకించిపోతుంది. వెనువెంటనే సూర్యకిరణాలు జగతిని పలకరిస్తాయి. దాంతో మలేషియన్లు వాటర్ స్పోర్ట్స్ ఆడడానికి బయలుదేరతారు. గోల్ఫ్ కూడా ఆడతారు.

మలేషియాలో ప్రయాణం చేయడం... అంటే ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి వెళ్ళడం చాలా తేలిక. కార్లు అద్దెకు తీసుకుని చూడాల్సినవన్నీ చూసి రావచ్చు రహదార్లు ఎంతో శుభ్రంగానూ, అనువుగానూ ఉంటాయి కాబట్టి జర్నీలో ఎలాంటి ఇబ్బందీ ఉండదు.

'న్యూ కౌలాలంపూర్ ఇంటర్నేషనల్ ఏయిర్‌పోర్ట్' అనే అంతర్జాతీయ విమానాశ్రయం సేపాంగ్‌లో ఉంది. పెనిన్సులా సింగపూర్‌నుంచి బ్యాంకాక్ వరకు రైళ్ళు నడుపుతుంది. కాబట్టి రైలు ప్రయాణం సరదా కూడా తీర్చుకోవచ్చు



పులావ్‌తెరిన్ గాన్యూలో ఫ్రెష్ సీ ఫుడ్ అందించడానికి సిద్ధంగా ఉన్న జాలర్లు

**భాషా సమస్య...**

మలేషియా వెళ్ళాలనుకునేవారు భాష గురించి మర్చిపోవచ్చు ఎందుకంటే ఇక్కడ అధికశాతం ఇంగ్లీషు మాట్లాడేవారే. కాబట్టి ఆంగ్లభాష వచ్చుంటే తేలికగా మేనేజ్ చేసేయవచ్చు అందువలన భాషా సమస్య తీరి



పోయినట్టే.

మలేషియాలో 62 శాతం మలేషియన్స్ ఉండగా, 27 శాతం చైనీస్ ఉన్నారు. భారతీయుల సంఖ్య కేవలం ఎనిమిదిశాతం మాత్రమే. ఇతర దేశాలవారు దాదాపు మూడుశాతం దాకా ఉంటారు. ఆ విధంగా మలేషియాలో బహుభాష, బహుదేశ, బహు సంస్కృతుల సమ్మేళనం మనకు కన్పిస్తుంది.

1857లో కౌలాలంపూర్ ఆవిర్భవించింది. ఖనిజాల అన్వేషణకోసం వెళ్ళినవారు రెండు నదులు సంగమించే చోట కౌలాలంపూర్ అని నామకరణం చేశారు.

ఇకపోతే మలేషియాను రెండు ప్రధాన భాగాలుగా విభజించవచ్చు. ఇందులో మొదటిది పెనిన్స్యులార్ మలేషియా. దీనిని పదకొండు రాష్ట్రాలుగా విభజించారు.

ఆ తర్వాత తూర్పు మలేషియా. సబా, సార్వాక్ రాష్ట్రాలు రెండూ తూర్పు మలేషియాకిందకే వస్తాయి. ఇక్కడి జనాభా ఆదిమ, జాతులవారే.

మలేషియాకు లభించే ఆదాయంలో ఎక్కువశాతం 'కార్ల తయారీ' నుంచే లభిస్తుంది.

అత్యంత ప్రసిద్ధి పొందిన 'తమన్ నెగారా' జాతీయ పార్కు పెనిన్స్యులాలో



ప్రపంచ ప్రసిద్ధి చెందిన పెట్రోనాస్ ట్విన్ టవర్స్

కౌలాలంపూర్ కొత్త రైల్ ట్రాన్సిట్ సిస్టమ్

ఉంది. ఇక్కడ దాదాపు రెండువందల రకాల క్షీరదాలను చూడచ్చు. ఏనుగులు, ఎలుగుబంట్లు కూడా ఉన్నాయి. ఈ పార్క్‌కు వెళ్ళాలంటే దాదాపు రెండుగంటల పాటు అడవిమార్గం గుండా ప్రయాణిం చాలి. ఈ ప్రయాణం చాలా థ్రిల్లింగ్‌గా ఉంటుంది.

**షాపింగ్...**

ఏదైనా ప్రాంతాన్ని సందర్శించడానికి వెళ్ళి నప్పుడు అక్కడ దొరికే వస్తువుల్ని సైతం కొనుగోలు చేస్తాంకదా...

మలేషియాలో షాపింగ్ అంటే మీరు ఖర్చుపెట్టే ప్రతి పైసా కూడా వినియోగం అయినట్టే. అందువల్లనే ఈ దేశం వెడితే చాలామంది షాపింగ్‌కోసం కొంచెం ఎక్కువ సమయాన్నే కేటాయిస్తారు.

ఎలక్ట్రానిక్ వస్తువులకు మలేషియా పెట్టింది పేరు. కంప్యూటర్లు, టెలిఫోన్లు, కెమేరాలు వంటివి ఇక్కడ కొనుగోలు చేస్తుంటారు. డిజైనర్ వస్తువులు కూడా లభిస్తాయి. అలాగే గడియారాలు కూడా కొనుక్కోవచ్చు.

పశ్చిమాన ఉన్న కోస్ట్ సిటీలు షాపింగ్‌కు పెట్టింది పేరు. ఎలక్ట్రానిక్ వస్తువులు, ఫ్యాషన్ వస్తువులు ఇక్కడ లభిస్తాయి.

**ఐస్‌లాండ్స్, బీచ్‌లు...**

మలేషియాలో పశ్చిమభాగం అంతా ఐస్ లాండ్స్‌తో నిండిఉంది. జార్జిటౌన్, కౌలాలం పూర్, ప్రాచీన ఓడరేవు వున్న మెలాకాలు.

'పులావ్ పినాంగ్'ను అరిస్టోక్రాట్స్ హాలిడే ఐలాండ్ అని అంటారు. బ్రిటిష్ కాలంనుంచీ పెద్దపెద్ద ఉద్యోగులను, అత్యు న్నత పదవులలో ఉన్నవారిని ఈ ప్రాంతా

ఆసక్తికరమైన వాటర్ స్పోర్ట్స్

నికి పంపేవారట. భారతదేశాన్ని ఆంగ్లేయులు పరిపాలిస్తున్న కాలంనుంచీ ఇలా జరుగుతుండేది. మనదేశంలోని వేడిని, దుమ్ము, ధూళి భరించినవారు ఈ పులావ్ పినాంగ్‌కి వెళ్ళి సేద తీరేవారట. ఆంగ్లేయ ప్రభుత్వ అధికారులు కూడా తమ ఉద్యోగులను ఇక్కడికి పంపితే వారు ఇక్కడి వాతావరణానికి చక్కగా కోలుకుంటారని, శక్తి పుంజుకుని రెట్టించిన ఉత్సాహంతో పనిచేస్తారని విశ్వసించేవారు. అందువల్లనే అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం అత్యున్నత పదవులలో వున్నవారు రిలాక్స్ అయ్యేందుకు పులావ్‌పినాంగ్ ప్రాంతాన్ని ఎన్నుకుంది. వ్యాపారస్తులు సైతం వారి బిజినెస్ టెన్షన్ తగ్గడానికి ఈ ప్రాంతానికి వచ్చి రిలాక్సవుతుంటారు. అందువల్లనే పులావ్‌పినాంగ్‌ను అరిస్టోక్రాట్స్ హాలిడే ఐలాండ్ అని ముద్దుగా పిలుచుకుంటారు. నిజంగా ఇక్కడి వాతావరణానికి మనసు, శరీరం ఎంతగానో





రిలాక్స్ అవుతాయి.

జార్జిటౌన్ వెడితే భిన్నజాతులు, సంస్కృతులను గురించి తెలుసుకోవచ్చు.

ఇకపోతే మలై గ్రామాలు, వాటర్ ఫాల్స్, స్నేక్ టెంపుల్స్ కూడా దర్శించి తీరాల్సిందే.

పినాంగ్‌కు ఉత్తరాన ఉన్నదే పులాంగ్ లాంగ్క్వి. ఇక్కడ దాదాపు 101 ఐలాండ్స్ ఉన్నాయి. అయితే ఇందుల్లో మూడు ఐలాండ్స్ మాత్రమే నివాసయోగ్యం కాగా మిగిలిన ఐలాండ్స్ అన్నీ చిక్కని అడవులు.

మలేషియా పశ్చిమభాగం అంతా ఐలాండ్స్‌తో, తూర్పుప్రాంతం అంతా బీచ్‌లతో నిండి ఉంది. అందుకే పశ్చిమ ప్రాంతాన్ని మలేషియా పాదాలు, ఊపిరితిత్తులు, గుండెగా అభివర్ణిస్తే తూర్పు ప్రాంతాన్ని మలేషియా ఆత్మగా చెప్తారు. ఈ బీచ్‌లు సందర్శించేవారు నిజంగా' చిన్నపిల్లలైపోతారు. రంగురంగుల షిప్పింగ్‌బోట్స్, నివాస యోగ్యమైన గ్రామాలు, ఆకాశాన్నంటే కొబ్బరిచెట్లు ఇక్కడి ప్రత్యేకత.

తూర్పుప్రాంతం సంస్కృతి, సంప్రదాయాలకు కూడా పెట్టిందిపేరని చెప్పచ్చు. ముఖ్యంగా ఇక్కడ నింగినంటేలా రంగురంగుల గాలిపటాలు ఎగురవేస్తారు. తోలుబొమ్మలాటలు ఆడతారు. దీనిని 'షాడో ప్లే పప్పెట్స్' అంటారు.

ఇక్కడి బీచ్‌లలో మనకి కన్పించే అద్భుతమైన దృశ్యం ఒకటుంది. ముఖ్యంగా మేనుండి సెప్టెంబరు మధ్య చీకటిపడ్డాక ఈ ప్రాంతాలు సందర్శిస్తే ఎన్నోరకాల తాబేళ్ళు ఒడ్డుకువచ్చి గుడ్లుపెట్టడం మనకి కన్పిస్తుంది. కౌలాతెరెన్‌గ్యాన్యుకు యాభై మైళ్ళ దూరంలో ఉన్న 'రాన్‌టౌ ఎబాంగ్ ప్రాంతంలో అతి పెద్ద తాబేళ్ళను చూడచ్చు. ఇవి ఎనిమిది అడుగుల పొడవు, ఏడువందల కిలోల బరువు వుంటాయి. వీటిని చూడడంకోసం మలేషియా ప్రభుత్వం 'టర్టిల్ వాచింగ్ హట్స్'ను ఏర్పాటు చేసింది.

ఇకపోతే పులావ్ టయోమన్ ప్రాంతం వెడితే ఇక్కడికి మెర్సింగ్‌నుంచి పడవలో ప్రయాణం చేయాల్సి ఉంటుంది. ఈ ప్రాంతంలో భారతీయ అల్పాహారం విందు చేస్తుంది. 'రోటీ' తినాలంటే తప్పనిసరిగా ఈ ప్రాంతానికి వెళ్ళాల్సిందే. ముఖ్యంగా వారాంతంలో ఈ ప్రాంతానికి టూరిస్ట్‌ల రద్దీ చాలా ఎక్కువగా ఉంటుంది. ఇన్ ల్యాండ్ ట్రెక్కింగ్ కూడా అందుబాటులో ఉండడంవలన ట్రెక్కింగ్ అభిమానులంతా ఇక్కడ చేరుతుంటారు.

**పర్వతాలు–అడవులు...**

1885లో ఓ ఆంగ్ల సర్వేయర్ దట్టమైన అడవులగుండా ప్రయాణించి ఈ 'కామెరాన్ హైలాండ్స్' ప్రాంతాన్ని కనుగొన్నారు. ఆయన పేరు 'విలియం కామెరాన్' చుట్టూతా కొండ ప్రాంతం ఉన్న ఈ కామెరాన్ హైలాండ్స్‌ను గార్డెన్ ఆఫ్ ఈడెన్ అని కూడా పిలుస్తారు. పచ్చికతో కార్పెట్ పరిచినట్టుగా ఈ ప్రాంతం ఎంతో పచ్చగా అందంగా ఉంటుంది. ఈ ప్రాంతాన్ని 'హిల్ స్టేషన్'గా తీర్చిదిద్దింది మలేషియా ప్రభుత్వం. రిలాక్స్ అవ్వాలనుకునేవారు, సరదాగా కుటుంబంతో గడపాలనుకునేవారు ఈ 'కామెరాన్ హైలాండ్స్'ను సందర్శిస్తుంటారు.

చక్కటిగాలి, ఆహ్లాదకర వాతావరణం ఇక్కడి ప్రత్యేకత. ఎండ, చెమటపోత ఇవన్నీ మనకిక్కడ ఎంతమాత్రం అనుభవంలోకి రావు.

మలేషియాలో దాదాపు 59 శాతం అటవీ ప్రాంతమే. ఇక్కడి 'తెమన్ నెగారా' పార్క్ గురించి చెప్పుకోవాలి. రెండువేల అయిదు వందల స్క్వేర్ మైల్స్ ఆక్రమించింది ఈ పార్క్. ఇక్కడికి వెళ్ళాలంటే పడవమీద వెళ్ళాల్సిందే. ఈ పార్క్‌కు వెళ్ళడం అంటే నిజంగా మనం ఓ అడవిలోకి వెడుతున్నట్టుగానే ఉంటుంది. పార్క్ హెడ్‌క్వార్టర్స్ 'కౌలాతహన్'లో ఉంది. ఓ రాత్రి నైట్ సఫారి దగ్గరినుంచి తొమ్మిదిరోజుల



*కౌలాలంపూర్‌లో ఆతిథ్యం ఇవ్వడానికి సిద్ధంగా ఉన్న 'న్యూ వరల్డ్' హోటల్*

ట్రెక్కింగ్ వరకూ వివిధ పద్ధతులు అందుబాటులో ఉన్నాయి. మనకు ఏవి అనుకూలమైతే ఆ విధంగా పార్క్‌ను దర్శించవచ్చు పెనిన్స్యులాలోని అత్యంత ఎత్తైన పర్వత శ్రేణి 'గునుంగ్ తహన్' దర్శించితే ఏనుగులు, పులులను చాలా దగ్గరగా చూడచ్చు

'తసిక్‌బెరా'... ఈ ప్రాంతం పహంగ్‌కు దక్షిణాన ఉంది. ఇక్కడ ఉన్న అతి పెద్ద సరస్సు నీటి మొక్కలతో నిండి ఉంటుంది.

ఆ తర్వాత వెట్‌ల్యాండ్స్ శాంచురీ గురించి చెప్పుకోవాలి. దీనిని 'పాయ ఇండా' అంటారు. సెలారిగార్‌కు పశ్చిమాన ఉంది. దాదాపు అయిదువేల హెక్టార్ల ప్రాంతం అంతా పక్షుల కిలకిలారావాలతో హోరెత్తిపోతుంది. ఇంకా ఎన్నోరకాల రెప్టైల్స్‌ను సైతం దర్శించవచ్చు. ఇకపోతే నీటిమొక్కలు కూడా ఇక్కడ ఓ ప్రత్యేకమైన ఆకర్షణ అని చెప్పచ్చు.

ఇక్కడి ప్రయాణసాధనాల విషయానికొస్తే సైకిల్ తొక్కడం వస్తే ఓ సమస్య తీరినట్టే. సైకిల్ మీదే ప్రయాణించాలి. లేదా హాయిగా పాటలు పాడుకుంటూ నడవాలి. గుర్రబ్బండి కూడా అందుబాటులో ఉంటుంది. ఈ శాంచురీ న్యూకౌలాలంపూర్ అంతర్జాతీయ విమానాశ్రయానికి దగ్గరలో ఉంది. అలాగే పుట్రాజ్యా గవర్నమెంట్ అడ్మినిస్ట్రేటివ్ సెంటర్ కూడా అత్యంత సమీపంలోనే ఉంది.

తూర్పు మలేషియా ప్రాంతంలో అందునా బోర్నియో ఐలాండ్‌కు ఉత్తరాన ఉన్న సార్వాక్ రాష్ట్రంలోని అడవులలోకి వెళితే ఆదిమ మానవుల్లాంటి జీవితం గడపచ్చు. ఈ రోజుకీ వారు చెక్కతో నిర్మించిన ఇండ్లలోనే నివసిస్తున్నారు. వారి జీవితవిధానం గురించి ఎన్నో ఆసక్తికరమైన విషయాలు తెలుసుకోవచ్చు

ఇకపోతే సార్వాక్‌లోని 'ములు జాతీయ పార్క్' కూడా సందర్శించాల్సిందే.

ఆ తర్వాత 'సాబ'కు వస్తే 'కినబాలు' పర్వతాన్ని అధిరోహించాలని చాలామంది సందర్శకులు అనుకుంటారు. పదమూడు వేల అయిదువందల అడుగుల ఎత్తు ఉన్న ఈ పర్వతశిఖరం సాహసకార్యాలు చేయాలనే అభిలాష కలవారికి మంచి అవకాశం.

సాబ, సార్వాక్, రాష్ట్రాలు రెండూ సందర్శిస్తే నిజంగా మనకు ప్రకృతి ఒడిలో ఉన్న అనుభూతి కలుగుతుంది.

మలేషియా అనగానే మనకి గుర్తుకు వచ్చేది 'పెట్రోనాస్ టవర్స్'. ఇది ప్రపంచంలోకెల్లా అత్యంత ఎత్తైన భవనం. ఇది కౌలాలంపూర్‌లో ఉంది. ఇకపోతే 'గోల్డెన్ ట్రయాంగిల్' వెడితే బోటిక్స్, హోటల్స్, రెస్టారెంట్స్ కనువిందు చేస్తాయి.

హృదయంగా భావిస్తారు.

ఇక కౌలాలంపూర్‌లో చెప్పుకోదగినవి మసీదులు, హిందూ, బుద్ధ దేవాలయాలు. ఆ తర్వాత బెస్ట్ షాపింగ్ సెంటర్స్ అన్నీ ఇక్కడే ఉన్నాయి.

పీనాంగ్ ఐలండ్ వెడితే జార్జిటౌన్ తప్పక వెళ్ళాలి. అక్కడ చైనీస్ షాప్‌లు ఎక్కువగా ఉంటాయి. ఇక్కడ దుకాణాలు ఎంత అందంగా ఉంటాయో వస్తువులు కూడా అంత అందంగా ఉంటాయి. అలాగే చైనీస్ దేవాలయాలు కూడా దర్శించవచ్చు ఈ ప్రాంతానికి వెళ్ళాలంటే నడిచి వెళ్ళచ్చు లేదా రిక్షాలు అందుబాటులో ఉంటాయి.

మొత్తంమీద జార్జిటౌన్‌లో పూర్తిగా చైనీస్ సంస్కృతి ఎక్కువగా కన్పిస్తుంది. చైనీస్



సార్వాక్‌లో ఓ ఆదిమజాతి మనిషి వేటాడుతున్న దృశ్యం

కౌలాలంపూర్‌లో ఉన్న 'ఫ్రీడమ్' స్క్వేర్‌లో జాతీయ పతాకాన్ని మొదటిసారి ఎగురవేశారు. 1957లో స్వాతంత్ర్య సముపార్జనకు చిహ్నంగా మొట్టమొదటిసారి జాతీయ పతాక ఆవిష్కరణ జరిగింది. అందుకే ఈ ప్రాంతాన్ని కౌలాలంపూర్‌కు

డ్యాన్సింగ్ డ్రాగన్, చైనీస్ ఒపేరా, చైనీస్ వస్తువుల షాపింగ్, చైనీస్ దేవాలయాల సందర్శనం, చైనీస్ భోజనం కావాలంటే జార్జిటౌన్ వెళ్ళాల్సిందే.



మలేషియాలోని ఐలాండ్స్, బీచ్‌లు, అడవులు, పర్వతాలు ఇవన్నీ తప్పకుండా దర్శించాల్సిందే. కొన్నిసార్లు అత్యాధునికమైన రైల్లో ప్రయాణం, అంతలోనే కాకులు దూరని కారడవిలోకి కాలినడకన ప్రయాణం. ఒకవైపు ఆకాశాన్నంటే భవనాలు, మరోవైపు ఇంకా చెట్ల మీద ఇళ్ళు కట్టుకుని ఆదిమవాసుల జీవితాన్ని గడుపుతున్నవారు... ఇలా ఈ దేశంలో ఎంతో వైవిధ్యం ఉంది.

దీంతోపాటు సేదతీరేందుకు ఎన్నో ప్రాంతాలున్నాయి. పరిశుభ్రమైన గాలి, పరిశుభ్రమైన భోజనం, ఒకేసారి వైవిధ్యభరితమైన జీవితం గడిపేందుకు అవకాశం. వీటికితోడుగా అద్భుతమైన షాపింగ్ మార్కెట్స్, ఎన్నోరకాల ఎలక్ట్రానిక్ వస్తువులు దొరుకుతాయి. అయితే మలేషియా వెళ్ళే ముందు ఒక విషయం గుర్తుంచుకోవాలి. మిగతా దేశాలలాగా చూసి వచ్చేయకూడదు. అక్కడి ప్రకృతిలో మమేకం కావాలి. మన ఆందోళనలు, ఒత్తిడిలు మర్చిపోవాలి. మలేషియా వెళ్ళి వచ్చినవారంతా వారి వయసుకన్నా చిన్నవారిగా కన్పించడానికి కారణం అక్కడి వాతావరణమే.



కౌలాలంపూర్‌లోని సుల్తాన్ అబ్దుల్ సమద్ భవనం

ఇంకా చెప్పాలంటే మలేషియాలో చూడాల్సిన ప్రదేశాలు చాలా ఉన్నాయి. మలేషియా వాసులు స్నేహమనస్కులు. అతిథిని దేవుడిగా చూస్తారు. ఒకవైపు సంస్కృతి, మరోవైపు ఆధునికత కలబోసుకుని ఉంటుంది.

ఇక్కడ కొన్నిరోజులుంటే మనం ఏ దేశంనుంచి మలేషియాకు వెళ్ళామనేది కూడా మర్చిపోయేలా చేస్తారు మలేషియా వాసులు.

మరో విషయం ఏమిటంటే మలేషియా వెళ్ళేటప్పుడు చేతినిండా డబ్బు గుండెనిండా ధైర్యం నింపుకుని వెళ్ళాలి.

– ఆదెళ్ళ శివకుమార్

# ఏరిన ముత్యాలు

★ గాయాల గురించి ఇసుకలోను, దయను గురించి చలువరాయి పైనా రాయాలి.

– ఫ్రాన్స్ సామెత

★ మహాత్ములను నిందించువాడు మహాపాపి.

– గాంధీజీ

★ ఆత్మవిశ్వాసము అనేది చాలా విలువైనది. అది మానవుడికి ధారపోసి దివాలా తీయకు.

– వివేకానంద

★ అగౌరవంతో చాలా ఏళ్లు బతికేకన్నా గౌరవంగా, ప్రేమతత్త్వంతో ఒక్కరోజు బతికినా చాలు.

– సత్యసాయిబాబా

★ తెలివైన జీవనానికి నిదర్శనం క్రమశిక్షణ

– షేక్స్పియర్

★ దేముడు నిన్ను ఎలా చూసినా ఆయన పట్ల విధేయుడుగా ఉండు

– సాయిసూక్తి

★ అమరత్వాన్ని ప్రతిధ్వనించే అమృతగానమే మధురజీవితం

– ఒకసూక్తి

★ నీవు సుఖంగా జీవించు, నీలాగే ఇతరులు కూడా జీవించాలని కోరుకో.

– జర్మన్‌సూక్తి

★ మానవుడు నిస్సహాయంగా ఏడుస్తూ పుడతాడు, ఆనందంగా నవ్వుతూ మరణిస్తాడు.

– బైబిల్‌సూక్తి

★ ప్రతిరోజూ ప్రేమతో నిండిన జీవితాన్ని గడుపు. అదే దేవుని చేరడానికి సరైన మార్గం.

– రామకృష్ణ పరమహంస

★ వినియోగించని విజ్ఞానం జీర్ణం కాని ఆహారం వంటిది.

– సి.నా.రె

★ కటువైన మాటలు వాడవద్దు. బాణాలకంటే ఈ మాటలే ఎక్కువగా గాయ పరుస్తాయి.

– ఇ. డేవిస్

★ ఈ ప్రపంచంలో అన్నీ నశించేవే. భావాలూ, ఆశయాలూ, కలలూ తప్ప.

– సుభాష్ చంద్రబోస్

సేకరణ: అనంత ప్రభాకర్ దత్తు

చతుర
సంపుటి:25 సంచిక:8
సెప్టెంబర్ : 2002
296వ సంచిక

కోకిలకి... శ్రావ్యమైన గొంతేకాదు రూపమూ, మనసూ... దానినిండా భావుకతా... అన్నీ పుష్కలంగా వున్నాయి. వసంతకాలంలో మాత్రమే కాదు, సర్వకాల సర్వావస్థల్లో గలగలపారే ఏరులా, తళతళలాడే వెన్నెలలా, పవన ప్రభావానికి పరవశించి ఊగే పచ్చని మొక్కలా... ఓ చైతన్య స్రవంతిలా వుండే కోకిల... హఠాత్తుగా అన్ని రుతువుల్నీ మర్చిపోయింది.

గ్రీష్మతాపానికి సోలిపోయిన మొక్కలా...
హిమ-శీతానికి గడ్డకట్టిన నీరులా...

చైతన్యాన్ని కోల్పోయి... తనదైన ప్రపంచంలోకి వెళ్ళిపోయింది. 18 సంవత్సరాలైనా నిండని ఆ ముగ్ధమోహన రూపంపై...మృదు దరహాసం చెదిరి, ఆమె అస్థిత్వమే అంతమయ్యే సమయంలో... ఏం జరిగింది?

తల్లితండ్రుల గారాబు బిడ్డగా హాయిగా గడపవలసిన ఆమె జీవితంలోకి అనూహ్యంగా ప్రవేశించిన పెను తుపాను... ఆమె జీవన నౌకని ఏ మజిలీకి చేర్చింది? హృదయపు లోతులను స్పృశించే... **కొలిశెట్టి వెంకటరమణా లక్ష్మయ్య** రచన **'కోకిల'** ఈ నెల చతుర సమగ్ర నవల.

# కోకిల

కొలిశెట్టి వెంకటరమణా లక్ష్మయ్య

"కో కిల అంతుచిక్కని జబ్బుతో బాధపడుతోంది. ఎన్ని మందులు ఇప్పించినా తగ్గడం లేదు. ప్రభూ నువ్వెక్కడున్నావో తెలీదు. ఈ టైమ్‌లో నువ్వు ఆమె దగ్గర వుంటే బావుంటుంది. జన్మ ఎత్తినందుకు దైవభక్తీ, పాపభీతీ కొద్దోగొప్పో వుంటే తప్పకుండా వస్తావు.

"నువ్వు వచ్చి తీరాలి. లేదంటే మనిషిలా పుట్టిన పశువులకోసం ఓ 'జూ' ఏర్పాటుచేస్తాను. అందులో నిన్నే మొదటివాడిగా చేర్చుకుంటాను. మూసీ నర్సింగ్ హోంలో వుంది కోకిల. ఆమెకి తోడుగా నేను..."

- మాధవ

"బావుంది" కోకిల ఆ ప్రకటన చదివి నీరసంగా చెప్పింది.

"కోకిలా! మందు తాగావా?"

"తాగాను"

"ఎవరిచ్చారు?"

"సిస్టర్ ఇచ్చారు"

"గాడ్", కళ్ళు మూసుకుని దండం పెట్టి, "ఈ పైసాని ఎలా సృష్టించావోగానీ ఎంతటి వాళ్ళనైనా వేలిమీద తిప్పుకుంటుంది. మనకా డబ్బు వుండడం ఎంత మంచి పనై పోయిందో" అన్నాడు మాధవ.

పడుకున్న కోకిల ఇటు తిరిగి కళ్ళు చిత్రంగా తిప్పింది.

"డబ్బు వుండడం మంచిపనికాదు అదృష్టం" ఆయాసపడుతూ అంది.

"కోకిలా! నాలుగేళ్ళనుంచీ ప్రయత్నిస్తున్నావు. నీకు ఇంకా నమ్మకం వుందా?"

"ఊ..."

"ఒకప్పుడు మధురానగరిలో భామవి నువ్వంటే ఎవరూ నమ్మరు"

"ప్చ్.."

"వ్యంగ్యం కూడా... ఊపిరి తీసుకునేందుకు ఓపిక లేకపోయినా 'ఈగో'కేం లోటు లేదు. 'ఇంచ్' అయినా తగ్గలేదు"

శబ్దం లేని నవ్వు నవ్వింది. రెండు చేతులూ కలిపింది దండం పెడుతూ.

"నో" మాధవ ఆ రెండు చేతుల్నీ విడదీశాడు.

"వుండనీ"

"ఇదిగో ఇదే నాకు నచ్చదు. కృతజ్ఞతలు, థాంక్సులూ, రుణపడి వుండడాలూ అస్సలు నచ్చవు నాకు"

కోకిల కంటినీరు తొణికిసలాడి తలగడ మీద పడింది "మాధవా! నా కొడుకుని నాకు తెచ్చి ఇవ్వు ప్లీజ్. వాడు నాకు కావాలి. ఇంకా ఇంకా ఎదురు చూడలేను"

"ఏడవకు కోకిలా! నువ్వు బాగుంటే నాకు అదే పదివేలు. నువ్వు లేచి తిరుగుతాననీ, ఓపిక తెచ్చుకుంటాననీ మాటివ్వు. తప్పకుండా నీ కొడుకు ఆచూకీ తెలుసుకుంటాను"

"వాడు నీకేమీ కాడా?"

"భలేదానివే. వాడు నా సర్వస్వం."

కోకిల కళ్ళు తుడుచుకుంది. మాధవ స్టూల్ మీంచి లేచి ఫ్లాస్కుతీసి గ్లాసులోకి ఒంపి ఆమె దగ్గరకి వచ్చాడు. కోకిల నెమ్మదిగా పైకి జరిగి తలగడకి ఆనుకుని గ్లాసుని అందుకోబోయింది.

"నువ్వు గ్లాసుని పట్టుకోగలవా?"

"ప్రయత్నం చేస్తాను"

"మరో వారంరోజులు ఓపిక పట్టు. ఆపైన నువ్వే కలుపుకుని తాగుదువుగాని"

"మాధవా నాకు బాధేస్తోంది"

"అవన్నీ ఇంటికి వెళ్ళాక"

"ఎప్పుడు వెడతాం మాధవా"

"నీకు బాగున్నాక"

"ఎప్పుడు బాగుంటాను"

"ఎవరికివారే యమునాతీరే. చావు పుట్టుకలు మన చేతిలో లేవు. ఈ బంధాలు పెంచుకుంటే పెరిగేవీ, తెంచుకుంటే తెగేవీ అనుకున్నప్పుడు, జీవితం తామరాకుమీద నీటిబొట్టులాంటిదని గ్రహించి నవ్వునీ, ఏడుపునీ, సంతోషాన్నీ, దుఃఖాన్నీ ఇంకా ఇలాంటివే... వీటిని సమానంగా చూసినప్పుడు సరేనా!" చేతులు దులుపుకున్నాడు.




"మాధవా" గట్టిగా అరిచింది కోకిల.

ఆమె అరుపుకి గదిగోడలు కదిలినట్లు భ్రమపడ్డాడు అతను. తల తిప్పి "నువ్వేనా కోకీ" అన్నాడు ఆశ్చర్యంగా.

"కోకీ ఏమిటి? కాకీ అనో, కోకా అనో పిలిచినట్లు కోకిల... సరేనా ఇప్పుడు నేను అరవలేదు. 'కూ... కూ' అన్నాను" అంది.

"ఎందుకు? "

"నువ్వు చెప్పే వేదాంతం నా బుర్రలోకి ఎక్కగానే కళ్ళు బైర్లు కమ్మాయి. జీవితం అంటే విరక్తి అనిపించేట్లు ఉపన్యాసం ఇచ్చావు. ఇవాళంటే ఆరోగ్యం బాగోలేక ఇలా మంచంమీదుండి పోయాను. నా బాధలో భాగం పంచుకోమంటే మెట్ట వేదాంతం చెబుతున్నావు. మాధవా నేన్నీకు... ఇదిగో ఇటుచూడు ఇంత... ఇంతప్పటినుంచీ తెలుసు" అని చేతిని కొంచెం పైకెత్తి చూపించింది.

"నా దగ్గరిలాంటి కబుర్లు చెప్పకు"

ఉన్నట్లుండి ఘొల్లుమంది.

మాధవ హడలిపోయాడు. చప్పున ఆమె దగ్గరకి వెళ్ళి ఆమె తలని పొట్టమీదకి తీసుకుని నిమురుతూ నిశ్శబ్దంగా వుండిపోయాడు. ఆ స్పర్శ అచ్చం అమ్మలాగే...

తోటకూర కాడల్లా వున్న చేతుల్ని అతని వీపుచుట్టూ వేసుకుని నిశ్చింతగా కళ్ళు మూసుకుంది.

మాధవ కొంచెం ఆగి నెమ్మదిగా దూరం జరిగాడు.

కోకిల మంచంమీదకి వాలి అతని చేతిని పట్టుకుని "కూర్చో" అంది.

అతను కూర్చున్నాడు. క్షణంలో నిద్రపోయింది కోకిల.

మిట్టమధ్యాహ్నం పన్నెండుగంటలు దాటింది. మాధవక్కూడా నిద్ర వస్తోంది. వాలుకుర్చీలో వొదిగి పడుకున్నాడు. కళ్ళు మూతలు పడుతున్నాయి. కన్నీళ్ళు రావాలో వద్దో తికమకపడుతుంటే అతనూ నిద్రలోకి జారుకున్నాడు.

ఫోన్ మోగుతుంటే చప్పున లేచాడు మాధవ. ఫోన్ అందుకుని "హలో" అన్నాడు.

"ఇల్లూ వాకిలీ గుర్తుందా? ఎంతకాలం రాత్రీపగలూ అక్కడే వుంటావు. ఓ నర్సుని పెట్టు. చాకిరీ చేసేందుకో పనిమనిషిని చూడు. అంతేగానీ నువ్వా హాస్పిటల్‌కి అంకితం అయిపోతే మాకు బాగుండడం లేదు"

"అమ్మా..."

"నువ్వు వచ్చేయి మాధవా"

"కోకిల పరిస్థితి బాగోలేదమ్మా"

"దానికి మమ్మల్ని బాధపెడితే ఎలా మాధవా? "

"మిమ్మల్ని బాధపెడుతున్నానా? "

"కాదా మరి? రెండు నెలల్నించీ హాస్పిటల్‌లో వున్న కోకిలతోటే నీ ప్రపంచం అయిపోయింది. ఇంత ఇంట్లో మేం ఇద్దరమే వుంటున్నాం. అర్ధరాత్రి, అపరాత్రీ మా ఇద్దరికీ ఏమైనా అయితే చూసే దిక్కులేదు. మమ్మల్ని చూసేవాళ్ళేర్రా? "

"రోజూ ఇంటికి వస్తూనే వున్నాను కదమ్మా"

ఆవిడ ఏడుస్తోంది. ఆ గొంతుని పసిగట్టాడు. "ఏడవకమ్మా మన కోకిలని తీసుకుని మనింటికి రావద్దా నేను"

ఆవిడ నిట్టూర్చి ఫోన్ పెట్టేసింది.

అతను అక్కడినుంచి లేచి కిటికీ దగ్గరకి వచ్చాడు. కిటికీ అవతల విశాల ప్రపంచంలో జనం చిందులు వేస్తూ, పరుగులు తీస్తూ హాయిని అనుభవిస్తూ, కార్లలో, బస్సుల్లో స్కూటర్లమీద పరుగెత్తుతున్నారు.

మాధవ కన్నార్పకుండా చూస్తున్నాడు.

'పెట్టిపుట్టారు'

'అదృష్టవంతులు'

'చీకూ చింతాలేదు'

వెంటనే నవ్వు వచ్చింది.

తను వాళ్ళ జీవితాల్లోకి తొంగి చూశాడా?

# సచిత్ర విచిత్రం




## మార్జాల మూషిక న్యాయం

పిల్లి, ఎలుక బద్ధ శత్రువులని మనకి తెలుసు. పిల్లిని చూడగానే ఎలుక ప్రాణభీతితో కలుగులోకి ఉడాయిస్తుంది.

అయితే స్క్వావుడ్ అనే ఓ యువకుడు బెట్టీ అనే ఓ ముద్దులొలికే పిల్లినీ, బ్రూనో అనే ఓ చిన్నారి ఎలుకనీ తన ఇంట్లో పెంచి ఇద్దరి మధ్యా స్నేహాన్ని కుదిర్చాడు. స్క్వావుడ్ సినిమాలు, టీవీ లలో నటించడానికి అవసరమైన కొన్ని జంతువులకు ట్రెయినింగ్ ఇస్తూ ఉంటాడు. తన స్వంత పిల్లల్లా పెరిగే ఆ పిల్లీ, ఎలుకా కలిసి టీవీలలో, సినిమాలలో నటిస్తూ, అతడికి బోల్డంత డబ్బు గడించిపెడుతున్నాయి.

"మాధవా" కోకిల స్వరం సన్నగా విని పించి ఇటు తిరిగాడు.

కోకిల మంచంమీద మధ్యలో కూర్చుంది.

"నన్నూ ఆ కిటికీ దగ్గరకి తీసుకువెళ్ళు"

"వద్దు కోకీ... పడిపోతావు"

"ప్లీజ్"

మాధవ ఆమెను వీల్‌ఛెయిర్‌లో కూర్చో బెట్టి కిటికీ దగ్గరకి తీసుకువచ్చాడు.

అందమైన సాయంత్రం రంగురంగుల సీతాకోకచిలుకల్ని తరిమేస్తున్నట్లు ఆహ్లా దంగా వుంది వాతావరణం. క్షణం క్రితం వున్న వాహనాలేవీ లేవు ఇప్పుడు. సంధ్యారం గులతో బాటు జనసంచారంలో మార్పు కని పిస్తోంది.

కోకిల కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తోంది.

"మాధవా... ఆ మెట్లమీంచి మనం పరు గెత్తి బిర్లామందిర్ చేరుకునేవాళ్ళం గుర్తుందా"

"ఎందుకులేదూ?"

"హుస్సేన్‌సాగర్ ఎంత ప్రశాంతంగా వుండేదో అవునా"

"ఇంకా కొంచెం ముందుకు వెళ్ళు కోకిలా" అన్నాడతను.

"వెడుతున్నా... నాతోబాటు నిన్నూ తోల్కపోనా"

"అదిగో మాండలికం!" అతని చిరునవ్వు ఆమెకి పెద్ద రిలీఫ్.

"తీసుకెళ్ళనా" అతనే అడిగాడు.

"వస్తున్నానోయ్" అంటూ నవ్వింది.

★ ★ ★

ఊహల లోనికి ప్రయాణం... భలే పాట... మాధవ ఆమెతో పరుగు. కొంచెం ముందుకు వెళ్ళి కుడివైపుకు తిరిగితే కల్లు కాంపౌండ్ వస్తుంది. అది దాటాక శంక రయ్యా మఠం అనే ఈశ్వరుడి గుడి ఆ పైన నడకే.

ముందు ప్రభూ, తర్వాత కోకిలా, మాధవా ఒక్కోసారి ముగ్గురూ ఒకే వరు సలో. పెద్ద కాంపౌండ్‌లో మూడిళ్ళు వరు సగా వున్నాయి. అవికాక మరో పదో, ఇర వయ్యో యిళ్ళున్నాయి.

కాంపౌండు గేటు దగ్గర కోకిల ఆగి ప్రభు చెయ్యి పట్టుకుంది.

"ఏమిటి?" అని అడిగాడు అతను.

"ఏంలేదు. మీ నాన్న జీప్ వస్తోంది"

ప్రభు చప్పున చేతిని లాక్కున్నాడు.

ఫక్కున నవ్వింది కోకిల. "ప్రభూ! భయ పడతావేం? మీ నాన్న వస్తే ఏం? తాత వస్తే ఏం? ఒకే ఉయ్యాల్లో పడుకుని, ఒకే ఉగ్గుగిన్నెలో పాలు తాగాం..."

ప్రభు చుట్టూ చూశాడు. ఊపిరి పీల్చు కుని, "అబ్బ హడలగొట్టి చంపేశావు కోకీ! అయినా మాధవా నీకీ మాట ఎవరు చెప్పారు?" అనడిగాడు.

"ఏ మాట?"

"ఒక ఉయ్యాల్లో పడుకుని ఒక ఉగ్గు గి న్నెలో పాలు తాగడం"

"మా అమ్మ చెప్పింది. ముందు నేను పుట్టినప్పుడు మా నాన్నగారు నాకోసం కొన్నారు. నేను ఆరోగ్యంగా బాగానే వున్నా నని నమ్మకంతో ఆ ఉయ్యాలా, ఉగ్గుగిన్నె మీ అమ్మకిచ్చేశారు. నువ్వు ఏడాది పిల్లవా డివి కాగానే కోకిల పుట్టింది. అలా ఉయ్యాలా, ఉగ్గుగిన్నె చరిత్ర సార్థకం అయిందన్నమాట"

"బావుంది" నవ్వాడు ప్రభు.

"నేను మంగుళూర్ వెళ్ళిపోతున్నాను. మీ ఇద్దరి సంగతీ చెప్పలేదు"

నడుస్తున్న ముగ్గురూ సాలె క్రిష్టయ్య కార్ఖానా పక్కనుంచి చిత్రాల నర్సింలు ఇంటి అరుగుమీద కూర్చున్నారు.

"నేను మెద్రాసు వెళ్ళిపోతాను. మా అక్క దగ్గరుండి ఇంజనీరింగ్ చదువుతాను. కోకిలా నువ్వూ?" అడిగాడు మాధవ.

"నాకు సీటు ఇక్కడే వస్తుంది"

"గొప్పే, నీకు మంచి మార్కులు వచ్చా యని చెప్పడమా?"

"ప్రభూ నువ్వు భుజాలు తడుముకుం

టావేం? "

ప్రభు ముళ్ళమీద వున్నట్లు లేచి వాచీ చూసుకున్నాడు.

"మాధవా పోదాం పద" కోకిల దారితీసింది.



ఓ అర్ధరాత్రి ఇంట్లోకి వచ్చేసిన కోకిలని చూసి నిశ్చేష్టుడయ్యాడు ప్రభు. ఖంగారుగా కుర్చీలోంచి లేచి నిల్చున్నాడు. "కోకిలా! ఆరుబయట చాలామందే పడుకున్నారు. నిన్నెవరైనా చూశారా? "

కోకిల నవ్వేసింది. "దేవదాసులో పార్వతి చెప్పినట్లు చెప్పనా? 'ప్చ్..' చీర కట్టుకోలేదు. 'పోనీ' అని, "చున్నీనే తలమీంచి వేసుకున్నాను. సరే పార్వతిలా చెప్పనా చాలామందికి నేను తెలుసు. చూస్తే చూసి వుంటారు" అంది గంభీరంగా.

"నీకు సిగ్గుగాలేదూ? "

"సిగ్గా... దేనికీ? "

"ఛీ... రేప్పొద్దున అందరికీ మొహం ఎలా చూపిస్తాం"

"చూడు ప్రభూ... మనిద్దరం పోటీపడి దేవదాసు నవల బట్టీ పట్టాం, అలాగే బోల్డు సార్లు సినిమా చూశాం. ఈ డైలాగులు నా దగ్గర చెప్పకు"

"నీకు దండం పెడతాను కోకీ. రేపు మాట్లాడుకుందాం. నాన్నగారు లేస్తారు. పిన్నీ బాబాయ్‌లు ఇంకా నిద్రపోయారో లేదో"

కోకిల తలుపు బార్లా తెరిచింది. ఆరుబయట వీధిలో ఎవరింటికి ఎదురుగా వాళ్ళు పక్కలు వేసుకుని పడుకున్నారు.

ప్రభు భయంతో "ప్లీజ్ కోకిలా వెళ్ళిపో" అన్నాడు ప్రాధేయపడుతూ.

కోకిల దిగ్గున లేచింది. అతనివైపు ఓసారి చూసి "ఛీ..." అని బయటికి వచ్చేసింది.

వాకిట్లో చాలామంది గాఢనిద్రలో వున్నారు. అంతవరకూ మసక వెలుగుల వెన్నెల చీకటి దుప్పట్లోకి దూరిపోయింది. మాధవ మంచంమీద ఇటునుంచి అటు తిరిగి పడుకున్నాడు. "తను ఇంకా నిద్రపోలేదన్నట్లు" చెప్పడం.

కోకిల తన మంచం దగ్గరకి వెళ్ళి ఆ మంచంమీద కూర్చుంది.

సూర్యనారాయణగారు దగ్గుతున్నాడు. ఆయనవి డేగకళ్ళు అందరి మంచీ కోరుకునే పెద్దమనిషే. కానీ మిలట్రీ డిసిప్లిన్‌లా వుంటుంది. కోకిల గుండె ఓసారి కొట్టుకుంది. అంతలోనే ధైర్యం తెచ్చుకుంది. 'హూ...' అంటూ నవ్వుకుంది. తాటాకు చప్పుళ్ళకి కుందేళ్ళు బెదరవు.

పోచమ్మ గుడి అరుగు విశాలంగా ఓ వందమంది హాయిగా పడుకునేంత వుంటుంది. అక్కడ జీవన్‌సింగ్ తన మొత్తం కుటుంబ సభ్యులతో కాలక్షేపం చేస్తాడు. ఇల్లు పేరుకేగానీ రాత్రీపగలూ ఇంటిల్లిపాదీ 'అమ్మ' నీడలోనే వుంటారు

అతనూ 'వాహే గురూ' అని గట్టిగా దండం పెట్టుకుంటున్నాడు. బహుశా 'కోకిలమ్మా, నేనూ చూశా'నని చెప్పడంలాంటిదై వుంటుంది. కోకిల ఉలిక్కిపడి సర్దుకుంది. 'స్టుపిడ్‌ని'. తననితను తిట్టుకోవడం ఆ పిల్ల అలవాటు. 'పిరికివాళ్ళు తొంభైసార్లు

చస్తారు. తను ధైర్యవంతురాలు.

"కోకిలా నిద్రపోలేదా?" తల్లి అడిగింది. కోకిల ఈ లోకంలోకి వచ్చింది. గొంతుక డ్డంగా దగ్గు వస్తోంది.

"లేదమ్మా"

"నిద్ర రావడంలేదా?" మహేశ్వరి కూతు రివైపు తిరిగింది.

"ఊ..."

"పోనీ కొంచెం నల్లమందు ఇవ్వనా?" తండ్రి శ్రీనివాసమూర్తి అడిగాడు.

మందులా ఇస్తే పనిచేస్తుందని అతని నమ్మకం.

"ఇవ్వు నాన్నా" కోకిల చేయి చాపింది.

మహేశ్వరి విసుక్కుంది. 'తాచెడ్డ కోతి వనమంతా చెరిచిందిట'.

భార్యమీద చెడ్డ కోపం వచ్చిందతనికి. "మహేశ్వరీ... నల్లమందంటే అదేదో వ్యసనం అనుకుంటున్నారు. నేను రోజూ తింటాను. నన్ను అను... ఓ.కే... ఇది కేవలం మందు మాత్రమే"

"మీ ఇష్టం" ఆవిడ తలగడ సరిగా వేసు కుని పడుకుంది.

వేసవి వల్ల గదిలో ఉక్కపోస్తుంటే బయట పడుకున్నాడు శ్రీధర్.

తల్లీతండ్రీ మాటలు విని అతను లేచి కూర్చున్నాడు. చెల్లెల్ని తండ్రి అతి గారాబం చేస్తున్నందుకు మనసులో తెగ బాధప డ్డాడు. పైకి చెప్పలేదు. ఆయన బాధపడతా డని రోజురోజుకీ తండ్రి ఆ పిల్లని చెడగొట్టే స్తున్నాడని భయం. శ్రీధర్ మరి నోరు మూసుకోలేక "ఈ అలవాటు మీవరకూ చాలు. దానికివ్వకండి" అన్నాడు.

కోకిల మూడంకె వేసి నిద్రలోకి జారిపో యింది.

★ ★ ★

మర్నాడు ఉదయం ఏడున్నర గంట లకి...

మాధవ గదిలో చిరాకుగా తెగ తిరుగుతు న్నాడు. ఒళ్ళు మండుతోంది. దూరంనుంచి సన్నగా ఉత్సాహంగా పాట వినిపిస్తోంది. అటు తరువాత "చయ్యా... చయ్యా... చయ్యా" మరో పాట స్పష్టంగా వినిపిం చింది. కాలు బలంగా వేసి తీస్తున్న శబ్దం... మగరాయుడులాంటి ఆడపిల్ల కోకిల.

చెబితే వినదు. వింటే చేయదు. చేస్తే అవతలి వాళ్ళకి పిచ్చెక్కుతుంది. భగవం తుడు చిరాకుగా వున్నప్పుడు తయారుచేసిన తిక్కబొమ్మ ఈ కోకిల. కాంపౌండులో ఎవ రికి ఏ కష్టం వచ్చినా హాజర్. 'లైఫ్‌బాయ్ ఎక్కడ'లాంటి స్లోగన్. ఎక్కడ ఆపద వస్తే అక్కడ ఆమె వుండాల్సిందే.

చిన్నప్పటినుంచీ ఒకచోట పెరిగినందుకు ఈ బాధ. నలుగురూ నాలుగు మాటలంటే బాధ. ఎన్నిసార్లు చెప్పినా వినిపించుకోదు. వద్దన్న పని ముద్దుగా చేస్తుంది.

వచ్చేసింది. కోకిల వస్తూనే "అత్తయ్యా కాఫీ" అని కేకేసింది. కాఫీ తెచ్చి ఇస్తూ "ఈ అరవ చాకిరీ ఇంకా ఎన్నాళ్ళు తల్లీ. నన్ను సుఖపెట్టాల్సిందిపోయి నా చేత చేయించు కుంటున్నావు" అంది నవ్వుతూ.

మాధవ తల్లివైపు కోపంగా చూశాడు. ఆవిడ పట్టించుకోనట్లు "కోకిలా! పెళ్ళిగు రించి ఏమనుకుంటున్నారు?" అనడిగింది.

"అమ్మా" మాధవ అరిచాడు.

కోకిల నవ్వి, "అత్తయ్య తమాషా చేస్తుంది మాధవా. మా ఇద్దరికీ ఇది అల వాటే... పోనీయ్" అని, "చెప్పు" అంది.

భానుమతి ఓ నవ్వు విసిరి వెళ్ళిపో యింది.

మాధవ సోఫాలో కూర్చున్నాడు. కోకిల మరో సోఫాలో కూర్చుంది.

"ఇప్పుడు చెప్పు... చెప్పమన్నాగా?"

"నీ పీక పిసికి చంపేయాలని వుంది"

"నేను భయపడాలా"

"అక్కర్లేదు. రాత్రి ప్రభు ఇంట్లోకి వెళ్ళడం అందరూ చూశారు. నీకు బుద్ధీ జ్ఞానం వుందా? ఓ ఆడపిల్ల తెగించి ఓ

మగాడి గదిలోకి, అదీ రాత్రిపూట వెళ్ళడం, సిగ్గుపడాలి ఛీ... ఎవరైనా చూస్తే"

"చూస్తే చూడనీ. ఎవరికివాళ్ళే బెదిరించా లనుకుంటున్నారు. నేను ప్రభ గదిలోకి నిన్న రాత్రే కొత్తగా వెళ్ళలేదు. ఇదివరకు కూడా వెళ్ళాను. కాంపౌండ్‌లో ఇన్ని ఇళ్ళు న్నాయి. ఇంతమంది జనం వున్నారు. ఎవ రైనా చూసే వుంటారు. మాధవా! నన్నెం దుకు భయపెడుతున్నారు"

"అందరిలా నువ్వూ వుంటే నిన్నెవరూ



ఏమీ బెదిరించరు. నువ్వు చేసింది తప్పు. సమర్థించుకోకు. నీ మనసుకి కష్టం తోస్తే, నిన్నెవరైనా ఏదైనా అంటే ముందు నేను భరించలేను"

"నీలాగే ప్రభు కూడా. వెళ్ళి మాట్లాడాను. తప్పేమిటి? "

"నాలాగే ప్రభూ... అంటే, నేనూ ప్రభూ ఒకటేనా? "

"ఆ... అంతే..."

"వాడేమన్నాడో తెలుసా"

విలాసంగా కాళ్ళూపుతూ చేతిగోళ్ళని కొరుకుతూ "ప్రభు మంచివాడు మాధవా...



భయపడతాడు అంతే. టైమ్ వస్తే అన్నీ సర్దుకుంటాయి" అంది.

"పూర్తిగా వినవేం"

"చెప్పు"

"ప్రభ తనకి తలవంపులుగా వుందని చెప్పాడు"

"ఎప్పుడు?"

"తెల్లవారుఝామున"

"అయినా మాధవా! నువ్వూ, అన్నయ్యా, పక్కింటివాళ్ళూ, ఎదురింటివాళ్ళూ మీ అందరికీ నేను 'జూ'లో జంతువులా కనిపిస్తున్నానా?"

మాధవ నవ్వి "నువ్వో వింత ప్రాణివి" అన్నాడు.

"మాధవా ఇవాళా, రేపూ కూడా వెడతాను"

"ఎక్కడికి?"

"ప్రభ దగ్గరకి"

మాధవ ముఖం చిట్లించాడు. "చెబితే వినకుంటే చెడతావు" అని "నీ ఖర్మ" అన్నాడు.

"నో ప్రాబ్లం" కోకిల జడ ఊపుకుంటూ 'బై' చెప్పి వెళ్ళిపోయింది.

ఏదీ ఆ పిల్ల...

★ ★ ★

"మాధవా నువ్విప్పుడు 'ఎలా వున్న వస్తువులు అలా' అన్నట్లు వున్నపాటున బయలుదేరి వచ్చేసెయ్. ఈ ప్రపంచంలో నువ్వు తప్ప నాకెవరూలేరు. మిగిలిన విషయాలు తీరికగా మాట్లాడుకుందాం"

మాధవ దారిపొడవునా ఆ ఉత్తరం చదువుతూనే వున్నాడు.

రైలు ఎక్కినప్పటినుంచీ వందసార్లు చేతి వాచీని చూసుకున్నాడు. రైలు కదలకుండా పట్టాలమీద భీష్మించుకుని కూర్చున్నట్టూ, ఎంతకీ ఖాజీపేట రానట్లూ అనిపిస్తోంది. పరిగెత్తితే భ్రమ... రైలుకంటే ముందే వెళ్ళచ్చునన్నట్లు. తను రైలు కిటికీలోంచి చూస్తుంటే రైలు ముందుకు వెడుతోందో, వెనక్కి వస్తోందో అర్థంకావడం లేదు.

ఆరేడు నెలల క్రితం జీవితం రంగుల చిత్రంలా అనిపించేది. ఇప్పుడు ఎంతో బాధ్యత కాళ్ళకి చుట్టుకుంటోంది. ఈ మధ్య కాలంలో ఎన్నిసార్లు కోకిలను తలుచుకున్నాడో ఆ దేవుడికే తెలుసు. ఎవరికీ లేని బెంగా, బాధా తనకే ఎందుకు? తనకేమైనా చుట్టమా... కనీసం తనక్కూడా చెప్పకుండా వెళ్ళిపోయింది.

తనూ...

లేడికి లేచిందే ప్రయాణంలా చిన్న బ్రీఫ్ కేస్‌లో రెండు జతల బట్టలు, ఓ ఐదువేలు బాంకులోంచి డ్రా చేసిన డబ్బూ పట్టుకుని బయలుదేరాడు.

దూరంగా లైట్లు వెలుగుతున్నాయి. అల్లంత దూరంనుంచి స్టేషన్ వస్తున్న సంకేతం తెలుస్తుంది. క్రమంగా దగ్గరౌతుంటే పట్టణంలోకి అడుగుపెట్టాం అన్న సంతోషం వేస్తుంది. స్టేషన్ వస్తుంటే బండి స్పీడ్ తగ్గింది. ముందు ప్లాట్‌ఫాం మొదలైంది. బండి కీచుమంటూ ఆగగానే చప్పున లేచి జాగ్రత్తగా దిగేశాడు.

స్టేషన్ దాటి బయటికి రాగానే ఆటో వాళ్ళు చుట్టూ మూగారు. ఆటో మాట్లాడుకుని డీజిల్‌కాలనీ చేరుకున్నాడు. తన దగ్గరున్న అడ్రస్‌తో ఆ ఇల్లుని ఆట్టే శ్రమపడకుండా పోల్చుకున్నాడు. సరిపోయింది. అక్కడెక్కడో 'గూడ్స్' బండి బొయ్యిమనగానే కాలిన బొగ్గువాసనా, ఆకాశంనిండా అలుముకున్న పొగా అతన్ని చుట్టేశాయి.

గేటుమీద చెయ్యివేశాడు అతను.

టర్ర్‌ర్... గమ్మత్తు శబ్దం.

ఆ శబ్దానికి అతనే ఉలిక్కిపడ్డాడు.

ఇరవై అడుగులపైనే దూరంగా వున్న తలుపు తెరుచుకుంది. లైటు వెలగ్గానే చీకటి చీల్చుకుంది. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ మొహంనిండా నవ్వు పులుముకుని చిన్నగేటు తలుపుతీసి "రా" అంది

కోకిల.

మాధవ కాళ్ళు తడబడ్డాయి. అడుగుముందుకు వేయలేకపోతున్నాడు.

"రా లోపలికి" వెనక్కి తిరిగింది.

"నా కాళ్లు అతుక్కుపోయాయి కోకిలా"

"ఫరవాలేదు. అవే వస్తాయి"

అతికష్టంమీద కదిలాడు. ఆమె ముందూ, అతను వెనుకా...

ఆ చిన్న గదిలో రెండుకుర్చీలు, ఓ సోఫా, టీపాయి వున్నాయి.

మాధవకి అయోమయంగా ఉంది. ఇల్లు దాటగానే కోకిల మరీ పరాయిదైపోయినట్లు తోచింది. చేతిలో బ్రీఫ్‌కేస్ ఎక్కడ పెట్టాలో... ఇబ్బందిగా వుంది.

కోకిల ఆ బ్రీఫ్‌కేస్‌ని అందుకుని ఓ వారగా పెట్టి "మంచినీళ్ళు తెస్తానుండు" అంది.

అతను అలాగే నిల్చున్నాడు.

"కూర్చో మాధవా" అంది చిన్నగా నవ్వి.

అతను సోఫాలో కూర్చున్నాడు. అక్కడున్న లైట్ తీసేసి ట్యూబ్ వేసింది. మంచి వెలుగు రాగానే చికాకు లోంచి బయటపడ్డట్లయింది. పది నిమిషాల్లో కాఫీ కూడా చేసి మంచినీళ్ళతోపాటు అతనికి ఇచ్చింది. ఆ వాతావరణం చూడగానే 'ఎందుకు వచ్చాన్రా దేవుడా' అనిపించింది మాధవకి.

తను ఊహించింది వేరు. ఇక్కడ కనిపిస్తున్నది వేరు.

"ఎప్పుడు బయలుదేరావు? "

"ఏడు గంటలై వుంటుంది"

"ఎలా వచ్చావు? "

"రైల్లో"

"వస్తున్నట్లు ఫోన్ చేయలేదేం? "

"ఉన్నపాటున వచ్చేశాను"

"థాంక్స్" అంది కోకిల

"ఎందుకు? "

"ఎందుకేవిటి? ఈ కోకిల కోసం వచ్చినందుకు"

నవ్వాడు అతను. లేవబోతుంటే "వేన్నీళ్లు పెడతాను. స్నానం చేస్తే చికాకుపోతుంది. అప్పుడు ఇద్దరం కలిసి భోజనం చేద్దాం"

"వేన్నీళ్లు వద్దు. చన్నీళ్లు నాకు అలవాటే కోకీ! నువ్వన్నం తినలేదా? "

"వుహు"

"ఎందుకనీ"

"ప్రశ్నలు వేయద్దు. ప్లీజ్ మాధవా... నువ్వే చూద్దువుగాని సమాధానాలు అవే దొరుకుతాయి"

అతనేమీ మాట్లాడలేదు. కోకిల వెంటే వంటింట్లోకీ, పెరట్లోకీ, వీధి వాకిట్లోకీ తిరుగుతున్నాడు.

ప్రశ్నలూ జవాబులూ

భోజనం కూడా అయింది.

"మాధవా! హాల్లో పడుకో. ఉయ్యాలబల్ల వుంది"

"నువ్వో నిద్రపో"

"అలాగే"!

"నేను ముందు గదిలో పడుకుంటా. అక్కడ టీవీ వుంది" మాధవ తలగడ తీసుకువెళ్లి ఉయ్యాలబల్ల మీద వేసుకున్నాడు. క్షణంలో నిద్రపట్టింది. నిద్రలో కూడా అతను లెక్కపెట్టడం మరిచిపోలేదు. ఐదు, ఆరు, ఏడు, తొమ్మిది. గడియారం ఠంగుఠంగుమంటోంది. రైలు ఇంజన్‌లు పెట్టే పొలికేకలతో స్టేషన్‌లో చప్పుడు స్పష్టంగా వినిపిస్తోంది. గోల, రొద, తోపుడు బళ్లు బర్రుమని శబ్దం చేస్తూ ప్లాట్‌ఫామ్ మీద పరిగెడుతున్నాయి.

ఇడ్లీ, వడ, చాయ్, కాఫీ.

జీవితం నిశ్శబ్దంలో ఎంత ఆనందంగా, అందంగా వుంటుందో చప్పుళ్ల రొదతో కూడా అంతే అందంగా, ఆనందంగా వుంటుంది. ఈ కేకలూ, అల్లర్లూ మనసులో పేరుకుపోయిన నిరుత్సాహాన్ని వెళ్లగొట్టేస్తాయి. ఈ గోలే వినిపించకపోతే ఎంత ఆరాటం. ఎన్నెన్ని సందేహాలు, జవాబులేని ప్రశ్నలకి పిచ్చివాడైపోయాడు.

ఈ ఇల్లు పెద్దగా వుంది. ఎవరో చార్జి

మన్ కట్టించారు. రైల్వేక్వార్టర్స్‌లాగే వుంది. నిద్రలో వూగుతున్న వుయ్యాల జోల పాడు తోంది.

★ ★ ★

ఒక్కసారి వులిక్కిపడ్డాడు మాధవ. ఇంకా రైల్లోనే పడుకున్నట్లు అనిపిస్తోంది. తెలతెల వారుతోంది. పక్కనే హైవే. హైద్రాబాద్-వరంగల్ వెళ్లే మార్గం. ఇంకా బస్సులూ, ఆటోలూ, రిక్షాలూ సైకిళ్లూ రోడ్డుమీదకి రావడంలేదు. అందుకే చెవిలో కాఫీ, టీ కేకలు వినిపిస్తున్నాయి.

మధ్యమధ్య అనౌన్స్‌మెంట్లు కూడా. ఉయ్యాలబల్ల వూగుతోందనుకోలేదు. మాధవ రైలు జోలపాడుతోందనుకుంటున్నాడు. ఉయ్యాల బల్లకి వున్న గొలుసులు చేస్తున్న శబ్దం విన్న కోకిల "హలో! గుడ్ మార్నింగ్" అంది.

కళ్లు తెరిచిన మాధవ "గుడ్‌మార్నింగ్" అని జవాబిచ్చాడు. "లేచి మొహం కడుక్కో. కాఫీ రెడీ"

మాధవ లేచి కాలు కిందపెట్టాడు. దడదడదడ శబ్దం. ప్లాట్‌ఫామ్‌మీదా, రైలుపట్టాలమీదా ప్రకంపనాలకి భూమి జలదరిస్తున్నట్లు వులిక్కిపడ్డాడు.

"వేన్నీళ్లు పెట్టనా"

మాధవ కసురుకున్నాడు. "నేనేమైనా వి.ఐ.పినా సేవలు చేయించుకోడానికి. నాకు కావాలనిపిస్తే నేను పెట్టుకోగలను. చీటికీ మాటికీ వేణ్ణీళ్లంటూ చంపకు"

కోకిల నవ్వి వూరుకుంది.

అతను టవల్ తీసుకుని బ్రష్, పేస్ట్‌తో బాత్‌రూమ్‌లోకి దూరాడు.

బయట చీపురు చప్పుడు వినిపిస్తోంది. శమంత వాకిలి తుడుస్తోంది. అప్పుడే వచ్చేసింది. నీళ్లు చల్లుతూ పాట పాడుతోంది. అనగనగా ఆకాశం... నవ్వొచ్చింది కోకిలకి. శమంతకి యాభై ఏళ్లుంటాయి.

కొత్త పాటలు పాడుతుంది. సినిమా ప్రియురాలు... నెలంతా ఇళ్లల్లో పాచి పనులు చేసే శమంత సినిమాకోసం ఓ వంద రూపాయలకి అదనంగా పని చేస్తూ ఖర్చు పెడుతుంది.

సుఖమైన ప్రాణి

"శమంతా ఇంట్లోకి రా! టీ పోస్తాను"

"అత్తన్నమ్మా"

ఆమెకి టీ ఇచ్చింది. రెండు కప్పుల్తో కాఫీ తీసుకువచ్చి మాధవకి ఇచ్చి తనూ తీసుకుంది. వాకిట్లో కుర్చీలు వేశాడు. కోకిలతో బాటు మాధవ కూర్చున్నాడు. ఉదయిస్తున్న సూర్యుడు వెచ్చగా తగులుతుంటే హాయిగా వుంది. ఎలా వుంది ఇన్నాళ్లూ? ఎలా వుంటుంది ఇక పైన? ఏదీ అర్థంకాదు. అసలు తనని ఎందుకు పిలిచినట్లు?

చూస్తే పంథొమ్మిదీ, ఇరవైల మధ్యలో వున్నారు. ఈ పిల్లకి బొత్తిగా భయభక్తులు లేవు. చెబితే వినదు, తనకు తోచదు.

ఇంట్లో వాళ్లు మొహం ఎత్తుకోలేకుండా వున్నారు.

"ఏవిటి మాధవా ఆలోచిస్తున్నావు? " టీ అందిస్తూ అడిగింది కోకిల.

"అప్పుడే టీ! ఇంకా కాఫీ గొంతు దిగలేదు"

"టైమ్ పాస్‌కి. అది సరే ఏవిటి ఆలోచిస్తున్నావు? అంటే జవాబు ఇవ్వవేం? "

"నీకు సిగ్గూ, భయం లేవూ"

కోకిల సర్దుకుని కూర్చుంది. కొంచెం ఆగి చెప్పింది "నిజమే భయం వేసింది. కొన్ని రోజులు వణికిపోయాను. ఏం చేయాలో తోచలేదు. లక్కడికీ నా పరిస్థితి గురించి అడిగాను"

"ఏమైంది" కొంచెం ముందుకు జరిగి ఆత్రంగా అడిగాడు.

"ఇంకేమౌతుంది? 'ఇది తప్పే అయితే ఇందులో నీ ప్రమేయం కూడా వుంది' అని చెప్పాడు"

"రాస్కెల్"

"తిట్టద్దు"

"నరికి పాతేయాలి"





"ఒద్దు, వద్దని చెప్పానా? "

"కోకిలా... నువ్వు... నువ్వు బంగారు తల్లివి. నిన్నా ఇలా చేయడం"

"మాధవా! నాకు ప్రభు అంటే పంచప్రాణాలు. అతనికోసం నా ప్రాణాన్నే ఇస్తాను"

"మరి ఇలా ఎందుకు చేశావు? ప్రాణాన్నే ఇవ్వాల్సింది"

"ఎక్కడా నీతో సంప్రదించి నీ సలహా తీసుకునే స్థితిలో వుంటేగా"

"నగలతో పారిపోయి వచ్చేయడం అన్యాయం కాదూ!"

కోకిల పిచ్చి నవ్వు నవ్వింది. "పారిపోయి రాలేదు. 'నేను తల్లిని కాబోతున్నాను. నా కోసం వెతక్కండి. డబ్బు అవసరం కనుక నా వాటా నగలు పట్టుకు వెడుతున్నాను. ఓ రెండు వేలు అన్నయ్య ఇంటి ఖర్చుల కోసం దాచిపెట్టమని ఇచ్చిన డబ్బులోంచి తీసుకున్నాను. మీకు ఇబ్బంది కలిగిస్తున్నాను. సో సారీ డాడీ! నన్ను క్షమించండి. అమ్మా నువ్వు కూడా. ఒరేయ్ అన్నయ్యా, నిన్ను వదిలి ఎన్నాళ్లుండాలో తెలీదురా. కానీ తప్పదు. తిట్టుకోకు...' అని ఓ ఉత్తరం రాసిపెట్టి వచ్చేశాను. తెలిసిందా"

"ప్రభుని పిలిపించి మాట్లాడతాను"

కోకిల టీ కప్పు కిందపెట్టబోతుంటే మాధవ చప్పున అందుకున్నాడు.

"మాధవా నువ్వూ క్షమించు"

"అబ్బ ఈ పదం వినివిని విసుగు వస్తోంది" మాధవకి కోపం వస్తోంది. కోకిల గోళ్లు కొరుక్కుంటూంటే మాధవకి వళ్లు మండింది. "అంత పీకల్దాకా ప్రేమలో ఎలా మునిగిపోయావు కోకీ!"

కోకిల నుదురు కొట్టుకుంది. "ఖర్మ, ఖర్మ' అంటూ.

"నీకు బాధగా లేదూ"

"దేనికి? "

"ఆ ఇంట్లోంచి, పుట్టిల్లులాంటి ఆ కాంపౌండ్లోంచి ఇలా వచ్చేసి ఒంటరిగా ఇన్ని నెలలు ఎలా గడిపావు? "

"విధి"

"మెట్ట వేదాంతం చెప్పకు. దేవుడు మనకి మెదడు ఇచ్చాడు. ఆలోచించే శక్తి ఇచ్చాడు. గుడ్డెద్దు చేలో పడ్డట్టు ప్రవర్తించమని చెప్పలేదు"

"అంతేకాదు మాధవా! గుండె ఇచ్చాడు. ఆ గుండె నిండా ప్రేమ, కరుణ, దయ, జాలి ఇవన్నీ ఇచ్చాడు"

"స్టాప్! ఆపేయ్. డాక్టర్లేమన్నారు? "

"పురిటి రోజులు వచ్చేశాయి. రేపో మాపో పురుడొస్తుందని చెప్పారు"

మాధవకి కళ్లల్లో నీళ్లు నిండాయి. లేచి వెళ్లి కోకిల వెనకాల నిల్చుని తలమీద ఆప్యాయంగా నిమిరాడు. "నీకీ పైత్యం తలకెలా ఎక్కింది"

కోకిల శబ్దం చేస్తూ నవ్వింది.

"మాధవా మనం ఎన్నో నవలలు చదివాం. పాటల్లో సాహిత్యానికి ఆనందించాం. వీటిని చదివినందుకు కాదు. మనిషిలో ఎన్ని రకాల కదలికలు, గుండె కింద తడి, మనసూ అది పరిగెత్తే విధం... ఇవన్నీ చదవలేదూ"

మాధవ ఆమె ఎదురుగా వచ్చి కూర్చుని చెప్పాడు, "అంటే నవలలు చదవమని చెప్పాగాని ఆ పాత్రల్లో లీనం అయిపోమని నేను చెప్పలేదే"

"నేనన్నది వేరు. ఎవరు నేర్పేరమ్మ ఈ కొమ్మకు... కోకిలని పాడమనీ, చిలకని పలకమనీ... ఇలా కవులు చెప్పారు. ఇదీ అంతే. నా ప్రేమ అంత గొప్పది. ప్రభూ నేనూ ఒకే ఉయ్యాల్లో..."

మాధవకి జాలేసింది "నీ గురించి చాలా దిగులుగా వుంది. నువ్వింత కష్టపడుతుంటే వాడికి చీమకుట్టినట్లయినా వుందా? మంగళూరు వెళ్లిపోయాడు తెలుసా"

"తెలుసుకోవాలని లేదు మాధవా"

"వాడి చొక్కా పట్టుకు లాక్కొస్తాను"

"హు" కోకిల నిట్టూర్చింది. "బలవంతంగా ఎవరిచేతా ఏ పనీ చేయించలేం

మాధవా"

మాధవ తలపైకెత్తాడు. ఎండ కొద్దికొద్దిగా చుర్రుమంటోంది. బంగారం రంగులో వుండే కోకిల వన్నె తగ్గినట్లుంది. వీపు మీద చేయి పెట్టుకుని నడుస్తోంది. మాధవకి పాలుపోవడంలేదు. తను ఇంటికి వెళ్లిపోవాలి. తనూ వెళ్లిపోతే కోకిలని ఎవరు చూస్తారు. అనవసరం అయిన రొంపిలో పడ్డాను... ఓ క్షణం అనుకున్నాడు. వెంటనే తననితానే తిట్టుకున్నాడు.

నిశ్శబ్దం..

ఉన్నట్లుండి ప్రకృతి స్తంభించినట్లు. మాధవ దీర్ఘంగా నిట్టూర్చాడు. "నీకు తోడూ నీడగా వుండాల్సిన వెధవ వెళ్లే రోజున మొహం తిప్పుకుని వెడుతున్నానని చెప్పాడే గానీ మీ ఇద్దరి విషయం ఒక్క మాట కూడా చెప్పలేదు"

కొందరైతే ఏదీ పట్టనట్లు, ఏ విషయాన్నీ సీరియస్‌గా . తీసుకోనట్లూ ప్రవర్తిస్తారు. మరి కొంతమందైతే రహస్యంగా వుండిపోతారు. ప్రాణ స్నేహితుల్తో కూడా కష్టసుఖాల్ని పంచుకోరు. వాళ్ల స్వభావం అది.

ఇంతసేపటి నుంచీ మాట్లాడుతుంటే మాధవకి ఆకలి వేస్తున్నట్లు అనిపించింది.

"కోకిలా! వంట ఎవరు చేస్తారు? "

"నేనే"

"మహా గొప్పదానివి. ఎవర్నైనా పెట్టలేక పోయావా"

"అంత షోకేంలేదు. డబ్బు కావాలికదా! తెచ్చిన డబ్బు అయిపోతుంటే పొదుపు చేయడం నేర్చుకున్నాను"

"మనం టిఫిన్ చేద్దాం. వంటిల్లు చూపిస్తావా? "

"నేను చేస్తాలే"

"ఇవాళ నేనే చేస్తాను" అన్నాడు మాధవ.

మెల్లగా లేచింది కోకిల. మాధవ ఆమె వెనుకే వెళ్లాడు.

"నువ్వు కూర్చో కోకిలా! నాకు చెప్పు ఉప్మా చేస్తాను"

"అంత ప్రమాదం ఏమీలేదు. నేను చేస్తాను"

మాధవ కూర్చున్నాడు.

పదిహేను నిమిషాల్లో టీ, టిఫిన్ అయాయి. గాస్‌స్టౌ మీద పప్పు పడేసింది.

"హాల్లో వుయ్యాలబల్ల మీద పడుకుంటాను మాధవా! నువ్విలా కూర్చుని అప్పుడప్పుడు వంటింట్లో పప్పు సంగతి చూస్తుండు"

"సంతోషం!" అన్నాడు మాధవ. "ఇంతకీ ఇన్నాళ్లూ ఏం చేశావు? అప్పుడే నాకు ఉత్తరం ఎందుకు రాయలేదు"

కోకిల ఆవలింతకు చిటికవేస్తూ "అదంతా ఓ పెద్ద కథ" అంది.

"చెప్పు"

"నిన్ను కష్టపెట్టడం ఇష్టంలేక"

"ఇప్పుడూ"

"నేను కష్టపడ్డం నచ్చక"

"కోకిలా తిక్కతిక్కగా మాట్లాడకు. అమ్మా నాన్నా ఎక్కడికి అని అడిగారు. ఇంట ర్వ్యూకి మెడ్రాసు వెడుతున్నానని అబద్ధం చెప్పాను. మా నాన్నగారే నా మొహంలోకి చూసివుంటే పట్టుబడిపోయేవాడిని. తల పగలకొట్టుకుని సిగ్గుతో చావాల్సి వచ్చేది"

కోకిల నవ్వుతూ చూసింది.

"ఛఛ! నీకు నవ్వెలా వస్తోంది? " విసుక్కున్నాడు మాధవ.

"నువ్వు చదవలేదూ కొన్ని పరిమితులు దాటాక ఏడుపే నవ్వు అవుతుందిట. అప్పుడు నవ్వినా ఏడ్చినా అర్థం ఒకటే అని ఓ పెద్దాయన రాశారు"

"కోకీ! నీకు పురుడు వచ్చేవరకూ వుంటాను. ఆపైన? "

"చాలు మహా ప్రభూ, నాకీ బరువు తగ్గితే"

"బరువా? "

కోకిల రెండు చేతుల్లో మొహం దాచుకుంది. ఆ చేతుల్లో ఇమిడిన మొహం ఆకు చాటు చందమామలా కనిపిస్తోంది. అందం, ఆకర్షణా రెండూ ఒకే చోట వుండి

కోకిల అదృష్టాన్ని లాక్కున్నాయి.

మాధవ ఆమెను చూస్తూండిపోయాడు.



పతంగులు ఆకాశంలోకి తరిమే సేవాళ్లు. కాంపౌండులో ఇంకా చాలామంది అబ్బాయిలూ, అమ్మాయిలూ వున్నా మిగిలిన వాళ్ల గురించి పట్టించుకోవాలని ఎవరూ అనుకోలేదు. సైకిలుమీద కోకిల స్కూలుకెళ్లేది.

శ్రీనివాసమూర్తిగారమ్మాయి సైకిలు తొక్కుతుంది.

పతంగులు ఎగరేసి గిల్లీ దండా ఆడుతుంది.

అదేమైనా నేరమా?

మాధవకి మాత్రం చాలా నచ్చేది.

ప్రభు వెనకాలే వుండేవాడు.

ఎందుకిలా చేశాడు?

"కోకిలా" మాధవ ఆలోచనలు తెగిపోయాయి.

కోకిల ఏడుస్తోంది.

కోకిల కళ్లు ప్రపంచంలో అందచందాలు చూసి ఆనందించేందుకే. ఆల్చిప్పల్లాంటి ఆ కళ్లు ధైర్యంతో దూసుకుపోతాయి. అటువంటిది నమ్మలేకపోతున్నాడు.

"ఏడవకు కోకీ ప్లీజ్! నీకు గుర్తుందా? గుడిమీంచి కిందపడగానే చెయ్యి విరిగింది. నిమిషంలో వుబ్బిపోయింది. అప్పుడు ఏడవలేదు... టాంక్‌బండ్‌మీద ధడేల్‌మని టాంగాలోంచి పడ్డావు. హుసేన్‌సాగర్‌కి సాష్టాంగం చేస్తున్నావని మేమంతా ఏడిపించాం. అప్పుడూ ఏడవలేదు... అరే, ముఖ్యమైన విషయాన్నే మరిచిపోయాను. డాక్టర్ అనంతాచారిని కలుసుకుని పరిగెత్తుకు వస్తూ చీకట్లో తేలుని తొక్కావు. అప్పుడు కూడా ఏడవలేదు. ఇప్పుడెందుకమ్మా ఏడుస్తున్నావు? "

కోకిల జవాబు చెప్పలేదు. కాజీపేట జంక్షన్‌లో రైళ్లు వస్తూ పోతూ హలో అంటూనే వుంటాయి. ఆ కేకల మధ్య కోకిల గొంతులోంచి వచ్చే శబ్దం వినిపించడం లేదు. మాధవ లేచి వంటింట్లోకి వెళ్లి చల్లని నీళ్ల గ్లాసుతో తీసుకు వచ్చాడు. కోకిల మొహం దాచుకునే వుంది. అతనే బుజ్జగిస్తూ చేతుల్ని విడదీశాడు. ఆమె అతని వైపు చూసి చిన్నగా నవ్వి మంచినీళ్లు తాగింది.

పనిమనిషి రుక్కు గేటు తెరుచుకుని లోపలికి వస్తూ ఓ అడుగు వెనక్కివేసింది.

"మాధవా! వీళ్లమ్మే శమంత. వీళ్లమ్మ రానప్పుడు వస్తుంది రుక్మిణి! రుక్కు అనిపిలుస్తాం"

"ఓ!" మాధవ విన్నాడు.

"ఎస్.ఎస్.సి చదువుతోంది"

"గుడ్"

కోకిల ఆ అమ్మాయికి చెప్పింది. "రుక్కూ బట్టలు రేపు వుతుకు. మిగతా పనులు చేసి వెళ్లు"

"అయ్యొచ్చిండని అమ్మకి చెప్పాల్నా"

"రుక్కూ"

రుక్కూ నవ్వింది "సారీ! అమ్మకి చెప్పనాండీ" సరిదిద్దుకుంది. మాధవ గమనించి "మాండలికాన్ని సరిచేయక్కర్లేదు కోకీ" అన్నాడు.

"రుక్కు ఇలా కూడా మాట్లాడగలదు"

రుక్మిణి మళ్లీ అడిగింది "అయితే అమ్మ రాత్రి రానవసరంలేదా మేడం"

"వద్దని చెప్పు"

మాధవకి అర్థం అయింది. రాత్రీపగలూ పని వాళ్లు కోకిలని చూసుకునే వాళ్లని. చీకటి పడడం, లైట్లు వెలగడం కూడా తెలీ లేదు. మాధవ ఆమెవైపు చూశాడు "వంట నేను చేయనా? "

"నేను చేస్తాను"

"ఒద్దు నాకు చేతనౌను. ఈ రెండు రోజులూ నన్ను చేయనీ"

"ఎందుకూ? " కోకిల అతనివైపు జాలిగా చూసింది. "మాధవా" అని ఆపేసింది.

"ఏడో నెలనుంచీ అమ్మ చేయాల్సిన పనులు ఇవి. ఏం చేస్తాం. నువ్వు రెస్ట్ తీసుకో. లేకపోతే వంటింట్లో కుర్చీ వేస్తాను కూర్చో! అంతేగానీ వంటాగింటా జాన్తానై" అన్నాడు.

"నీ ఇష్టం" కోకిల ప్రాణానికి హాయిగా వుంది. అతని వెనకే వంటింట్లోకి వెళ్లింది.

మాధవ వెనక్కి వచ్చి కుర్చీ తీసుకుని కోకిల వైపు చూస్తూ "కూర్చో" అన్నాడు. ఆ తరువాత వంకాయలు నాలుగు ముక్కలుగా చీరి అందులో వుల్లిముద్ద, కారం, ఉప్పు కూరాడు. వాటిని మూకుడులో వేసి మూత పెట్టాడు.

"అదేం కూర మాధవా" కోకిల మెడ పైకెత్తి మూకుడులోకి చూసింది.

"వంకాయ, ఉల్లికారం"

"నీకు చాలావొచ్చు అయితే"

"ఏయ్! వేళాకోళమా! మా ఇంట్లో నేనే చేసేవాడిని... మా అమ్మా అక్కా మడికట్టు కున్నపుడు"

కోకిలకా విషయం తెలుసు. నవ్వింది.

రుక్కు అరగంటలో ఇల్లు వూడ్చి సర్దేసింది. ప్రొద్దున వండిన వంటలు తీసుకెడుతూ "అమ్మని పంపనా మేడం" అని అడిగింది.

కోకిల నోరు విప్పబోయేంతలో మాధవ కల్పించుకున్నాడు. "మీ అమ్మని రమ్మని చెప్పమ్మా"

"మంచిది సర్" రుక్కు వెళ్లిపోయింది.

కోకిల విశ్రాంతిగా గోడకి చేరగిలబడి మంచంమీద కూర్చుంది. ఇల్లంతా సందడి. మాధవ కంచాలు మరోసారి కడిగి డైనింగ్ టేబిల్ మీద పదార్థాలన్నిటినీ చేరేసి కోకిలకి చేతికి ఆసరా ఇచ్చాడు. బరువైన పొట్టమీద చేతిని జాగ్రత్తగావుంచి మెల్లగా దిగింది. నేను ఇటూఅటూ కదిలినా నువ్వు దొర్లిపోతావు, కానీ పడవురా కన్నతండ్రీ. నేనున్నానుగా ఇంత ఆలోచిస్తుందా తల్లి? ఆ విషయం ఆమెక్కూడా తెలీదు. ప్రతిసారీ పొట్టమీద చేతిని వుంచడం కడుపులో వున్న వాడికి ధైర్యం నూరిపోయడమే అని.

"ప్రభు తల్లి వాడికి ధైర్యం చెప్పలేదా? " మాధవ అనుకున్నాడు. ఆ మాటే పైకి అనేశాడు.

కోకిల బిత్తరపోయింది. కొంచెం సిగ్గుపడింది. అతను వీటిని పట్టించుకోలేదు.

"ఎన్నోసార్లు ఇలా నిండు గర్భిణీ స్త్రీలను చూశాను కోకిలా. ఏమాత్రం తేడా వచ్చినా వాళ్లు పొట్టమీద చేతులుంచుకుంటారు"

"అదేం కాదు మాధవా"

మాధవ రెండు చేతులూ జోడించి నమస్కారం చేశాడు. "స్త్రీ అంటే నాకు గౌరవం, ఇష్టం, భక్తి. ఇలా ఎన్నో రకాల భావాలున్నాయి. ఓ స్త్రీ కంటతడి పెడితే అది బాధ పెట్టిన వాడి పాలిట శాపం అవుతుందిట. ఎక్కడ స్త్రీలు పూజింపబడుదురో..."

"మాధవా" కోకిల అడ్డుపడింది.

"నన్ను చెప్పనీ కోకిలా. మీ మధ్య ప్రేమ వుందని నాకు తెలుసు. టైమ్ వచ్చినపుడు మీరే చెబుతారనుకున్నాను. వాడు ఆ ప్రభుగాడు ఇంత గుండెలు తీసిన బంటని అనుకోలేదు"

"మాధవా తప్పంతా నాదే"

"అసలు నువ్విలా చేయాల్సింది కాదు"



కోకిల కంచంలో అన్నం పెట్టుకుని అతనికీ వడ్డించింది.

"ఈ విషయం పెద్దవాళ్లకి చెప్పాల్సింది"

"ఏం చెప్పను? ఈ విషయం నలుగురికీ చెబితే నేను ఈ రాత్రికి రాత్రే పారిపోతానని భయపెట్టాడు ప్రభు. బెదిరిపోయాను"

"ఎలానమ్మావు కోకీ"

"నన్ను ప్రేమించానని చెప్పాడు మాధవా"

"ఛీ! ప్రేమకి అర్థం తెలుసా వాడికి?"

"మాధవా! ఒకళ్లనొకళ్లు చూసుకోకుండా వుండేవాళ్లం కాదు. మనం కలిసి వెళ్లేప్పుడు నిన్ను వెనక్కి తోసేసేవాళ్లం. మేము ఎన్నెన్ని సినిమాలు చూసే వాళ్లమో మాధవా! ఇప్పటి పాటలు అదరగొట్టడం లేదూ"

మాధవ తెల్లబోయాడు. కనుబొమ్మలు ముడిపడిపోయాయి. "పాటలు అదరగొడుతున్నాయా? నీకు పిచ్చెక్కింది"

"ఎద్దుకేం తెలుసు అటుకుల రుచి అని ఓ సామెత వుందిలే. ఆ పాటలూ ఆ డాన్సులూ ఆకాశంలో ఎగిరిపోతూ ఓహ్ జీవితం ఇంత బావుంటుందా అనుకునేదాన్ని"

"ఛీ" మాధవకి కోపం వచ్చింది. "సినిమాలు జీవితాల్ని శాసించేవి కావు కోకిలా. అదో బిజినెస్. వ్యాపారం. చూసి వదిలేయాలేగానీ అవే జీవిత పరమార్థాలనుకోకూడదని తెలీదా! మూడు గంటల థైటెక్కులతో ఒళ్లూపై మరిచిపోతే ఇదిగో ఇలాగే బతుకు బండలైపోతుంది. కొంచెం అయినా కామన్ సెన్స్‌ని ఉపయోగించావా.

" 'ఆడది', ఆ మాట అంటేనే ఇబ్బంది పడతాను. అటువంటిది ఓ పవిత్రమైన పదాన్ని విరిచేయకుండా 'స్త్రీ' అంటే ఏమయ్యేది? ఆ స్త్రీకి నిండా బట్టలే కరువయ్యాయి. లంగోటీ కట్టుకున్నా చెల్లిపోయే మగాడికి తాన్ల కొద్దీ బట్టలు కట్టబెడుతున్నారు. రిబ్బను ముక్కల్లాంటి బట్టల్లో హీరోయిన్‌కి నీరాజనాలు ఇస్తున్నారు. వళ్లు వేడెక్కి, చుట్టూ పరిసరాలు మరిచిపోయి రంగుల ప్రపంచంలోకి ఈ యువతిని లాక్కెళ్లిపోతున్నారు కోకిలా. ఈ మైకంలోపడి నువ్వు దిద్దుకోలేనంత తప్పు చేశావు. నువ్వు ఉత్తరంలో ఏం రాశావో గుర్తుందా?"

కోకిల బుర్రని అడ్డంగా ఊపింది.

"ప్రపంచంలో నువ్వు తప్ప నాకెవరూ లేరన్నావు. నిన్ను ప్రభు నీ కర్మానికి వదిలేసి వెళ్లకముందు నాకు చెప్పాలనిపించలేదా? ఎలా బతుకుతావు కోకిలా? నీకప్పుడు భయం వేయలేదూ"

"ప్రేమ మత్తులో నాకేం భయం అనిపించలేదు. అయినా ప్రేమని రహస్యంగా వుంచడమే ప్రేమికుల లక్ష్యం అని ప్రభు చెప్పాడు. ఈ విషయం నీకు తెలుస్తే వాళ్ల నాన్నకి తెలిసి ఆయన నల్గొండ తీసుకెళ్లిపోతారని కూడా అనేవాడు"

మాధవ ఆ విషయాన్ని అక్కడికి ఆపేశాడు. "భోజనం చేసి ఆరుబయట కూర్చుందాం?"

కోకిల చేయి కడుక్కుంటూ "ఇంటి దగ్గర అంతా ఎలా వున్నారు" అని అడిగింది. చూడీదార్ పైజామా వేసుకుంది. తల చుట్టూ చున్నీ వేసుకుంది. ఇంత కష్టంలో వున్నా ఏమీ జరగనట్లే సోఫాలో కూర్చుని కాలిగోళ్లకీ, చేతిగోళ్లకీ నెయిల్‌పాలిష్ చేసుకుంటోంది. నుదురు మీద పడిన జుట్టు వెనక్కి తోసుకుంటూ "చెప్పు" అంది మళ్లీ.

ప్రొద్దున్నుంచీ మాటలు మూటలౌతున్నాయి. ఓసారి నిద్రపోవాలనిపిస్తోంది మాధవకి. నమ్మశక్యం కాని విషయం. కానీ నమ్మక తప్పదు. కోకిలకి నెలలు నిండి పూచిన తంగేడులా వుంది.

కోకిల అతనితో చెప్పింది "ఆరుబయట మంచాలు వేసుకుందాం మాధవా!"

"భయంలేదా?"

"ఈ కాజీపేటలో హాయిగా గుండెలమీద చేయివేసుకుని పడుకోవచ్చు మనిషి భయాలూ లేవు. జంతు భయాలూ లేవు"

మాధవ గేటు లోపలున్న స్థలంలో చిన్న

# రచయితలకు మనవి



- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రను మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రనుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

సెప్టెంబర్ చతుర నవల కోకిల ..............

సమీక్షకుని పేరు: ..............

చిరునామా: ..............

..............

..............

..............

మంచం వేశాడు. వేసి అరుగు మీద తువ్వాలుతో దులిపి తనూ ఓ తలగడ వేసుకున్నాడు. కోకిలకి చాలా సంతోషంగా వుంది. తనకోసం, తన సుఖంకోసం మరో మనిషి ఆత్మీయంగా తపిస్తున్నాడు. ఎంత హాయి. చల్లని వెన్నెలలో... కోకిలకి మనసు కలుక్కుమంది తుమ్మముల్లు కస్సున దిగినట్లు.

"ప్రభు ఏడీ? "

సన్నని నీటిపొర కళ్లమీద పరదా పరిచింది.

ఒంటరిగా నా అనేవాళ్లు లేకుండా ఎలా గడుపుతోంది?

తన పొట్టలోవున్న పాప గురించి ప్రభు ఆలోచించడా? ఎవరైనా నమ్మగలరా? అసలెందుకిలా అర్థాంతరంగా తన కర్మకి తనని వదిలేసి వెళ్లిపోయాడు?

ఓ అప్కారీ ఇన్‌స్పెక్టర్ కొడుకు, మందీ మార్బలం, డబ్బూ దస్కం... వాళ్ల నాన్న రెండు చేతుల్తో సంపాదిస్తున్నాడు. ఇంటి ముందు వరుసగా జీపులూ, కార్లూ నల్లమందు మహిమతో నల్లధనం కూడబెట్టాడు. అన్నీ చీకటి పనులే! ఆ తండ్రికి కొడుకా? పేరు, ప్రతిష్ట ఇంకా ఏదేదో అన్నాడు ప్రభు.

వెల్లకిలా పడుకుని సన్నగా కనిపిస్తున్న చందమామని చూస్తున్నాడు మాధవ.

"ఇంటిదగ్గర ఎలా వున్నారని అడిగితే జవాబు చెప్పడంలేదేవిటి మాధవా? "

అతను ఇటు తిరిగాడు. కొంచెం దూరంలో కోకిల ఇటువైపు తిరిగి అతన్ని అడుగుతోంది.

మాధవ మరచెంబులో నీళ్లు గ్లాసులో పోసుకుని తాగేశాడు. "ఇల్లు... ఇంటి దగ్గర ఎవరున్నారని? నువ్వు వెళ్లిపోగానే ఈ విషయం నాకు తెలుసు అనుకుని అందరూ నా మీద యుద్ధం చేశారు. ప్రభు మంగళూర్ వెళ్లిపోయాడు. మీ అన్నయ్య జీరాలో ఇల్లు తీసుకున్నాడు"

"కరంసింగ్, జీవన్‌సింగ్ నాందేడ, గురుద్వారా చూసి ఆర్నెల్లు వాళ్ల బంధువులతో కాలక్షేపం చేసుకుని వస్తారు"

"అన్నయ్య, నాన్నా వీళ్లేమన్నారు మాధవా? "

"వాళ్లు నీ పేరే ఎత్తడంలేదు"

"నువ్వు జీరా వెళ్లావా? "

నవ్వాడు మాధవ. "అప్పుడప్పుడు వెడుతుంటాను. మొదట్లో ఎందుకొచ్చావ్ అన్నట్లు చూసేవాళ్లు. క్రమంగా అలవాటైపోయింది. ఆ ఇంట్లో నువ్వు కనిపిస్తావేమో అని ఆశ"

"అక్కడ నేనెలా వుంటాను మాధవా"

"నువ్వు వుంటావని కాదు. ఆ మనుషుల్లో నీ నీడ కనిపిస్తుంది. నీ పోలికలు... నిన్ను గుర్తుకుతెచ్చేవి"

"నా ఉత్తరం చూసి ఏమనుకున్నావు? "

"ఎప్పుడో ఒకప్పుడు నువ్వు నాకు కనిపిస్తావని లేదంటే ఏ ఇ-మెయిల్‌లోనో, ఉత్తరంలోనో నీ క్షేమం తెలుస్తుందనీ అనుకునేవాడిని. అలాగే జరిగింది. ఆశ్చర్యపోలేదు గానీ సంతోషపడ్డాను"

ఇంతలో గేటు చప్పుడైంది. శమంత గేటు మూసి కోకిల దగ్గరకి వెళ్లింది. "ఎట్లుందమ్మా" అని అడిగింది మంచానికి దగ్గరగా కూర్చుంటూ. "బావున్నాను శమంతా"

"రుక్కుంబాయి చెప్పిందమ్మ అయ్యొచ్చిందని"

కోకిల అటునుంచి ఇటువైపు తిరిగింది. శమంత మొహం కనిపిస్తోంది.

మాధవ లేచి లోపలికి వెళ్లాడు. హాల్లో వంటింట్లో పెద్ద లైటు వెలిగించాడు. మరచెంబుతో నీళ్లు తెచ్చి గ్లాసులో పోసి కోకిలకి ఇచ్చాడు "తీసుకో" అంటూ.

"మా మాధవ... మాధవరావు. ఈవిడని పొద్దున చూశావా! లేదేమో శమంత..." ఇద్దర్నీ ఒకరితో మరొకరిని పరిచయం చేసింది.

శమంత మసక చికట్లో మాధవని ఎగా

దిగా చూసింది.

"శమంతా నువ్వు ఇటువైపు అరుగుమీద పడుకో! అమ్మకి దగ్గరగా వుంటావు" మాధవ కల్పించుకున్నాడు.

"అర్ధరాత్రి చలి ఎక్కువగా వుంటుంది మాధవా! మంచిదికాదేమో"

"ఏం కాదులేమ్మా" శమంత చెప్పింది.

చల్లనిగాలి తీయని జ్ఞాపకాల పరిమళాల్ని మోసుకు వస్తోంది. కోకిల ప్రేమకి నిర్వచనంలేదు. తూకం వేయాలంటే శ్రీకృష్ణతులాభారంలో తులసిదళం కావాలి. 'ప్రేమ' ఈ రెండు అక్షరాలూ జీవితాన్నీ, జీవిత విధానాన్నీ మార్చేస్తాయి. కోకిల కళ్లల్లో పెదవుల్లో మనసు పొరల్లో గుండె గోడల్లో భగవత్స్వరూపం అయి ప్రభుని స్మరించేట్లు చేస్తోంది.

కొంచెం వెల్లకిలా పడుకునే ప్రయత్నం చేసింది. కష్టంమీద ఆకాశంవైపు చూడగల్గింది.

"చుక్కల్లో చంద్రుడవు నీవు, చక్కనైన చుక్కని నేను" కేవలం ప్రేమకోసమే ఈ పాటలో పదాల్ని గుండె గుళ్లో దాచుకుంది. మేఘాల్లోంచి నెమ్మదిగా ఆపైన పరిగెడుతూ, మేఘాల్ని దాటేసుకుంటూ తారకల్ని కలుసుకుందుకు.

ప్రేమంటే... తీయగా... నిజమే... మధురంగా, అద్భుతంగా ప్రపంచ విజేతగా ఎంత ఆనందాన్నిస్తుంది. అంతటి ప్రేమకీ చివరికి మిగిలేది చిత్తుగా ఓడిపోవడమో, దారుణం అయిన దెబ్బ తగలడమో ఇంతేనా?

"కోకిలా నిద్రపట్టడం లేదూ" అటూ ఇటూ కదులుతున్న ఆమెని అడిగాడు మాధవ.

"ఎందుకో నిద్ర రావడంలేదు"

ఆడవాళ్లకేనా ఈ కష్టాలు. ఈ సమయంలో పక్కనే ప్రభువుంటే ఎంత బావుండేది? ఇంకా డెలివరీకి టైముందని చెప్పివుంటే ఎక్కడున్నా చెవి పట్టుకుని లాక్కువచ్చేవాడు. ఈ సమయంలో తనూ వెళ్లిపోతే పాపం కోకిల?

"మాధవా!"

"ఆ" ఉలిక్కిపడి జవాబిచ్చాడు. శమంత భూమీ ఆకాశం ఏకం అయి గర్జించినట్లూ, పది రైళ్లు మొర్రోమంటున్నట్లు గురకపెడుతోంది.

"నువ్వూ పడుకోలేదా? "

"లేదు"

"ఎందుకు వృధాగా ఆలోచించి నిద్ర పాడుచేసుకుంటావు? ఎలా జరగాల్సి వుంటే అలా జరుగుతుంది" అంది కోకిల.

"ఆ సంగతి నాకూ తెలుసులేవోయ్"

"సరేలే" అంది. ఇద్దరిమధ్యా నిశ్శబ్దం నిద్ర వైపు తరిమికొట్టింది.

శమంత పొద్దున్నే లేచి పాచిపనీ ఇంటి పనీ సమస్తం చేసేసింది.

వయసులో పెద్దదైనా ఆలోచనలూ, అభిరుచులూ చిత్రంగా వుంటాయి. తల్లీకూతుళ్లు అక్కా చెల్లెళ్లల్లా వుంటారు.

శమంత విశ్వాసంగా పనిచేస్తుంది. కాఫీ, టీ అడిగి తాగుతుంది. నిజాయితీగా వుండేవాళ్లు కడిగిన ముత్యంలా వుంటారనుకుంటే శమంత చుక్కలా చక్కగా వుంటుంది. జీవితంలో మంచీచెడ్డా చూసిన మనిషి. ఆటుపోట్లు చవిచూసిన వ్యక్తి. మామూలు మనుషల్లా రెండు రెళ్లు నాలుగు అనదు. కొంచెం ఆలోచిస్తుంది.

"అమ్మా! నువ్వు నీళ్లాడినంక పది ఇర్వై దినాలు ఇక్కడే వుంట. మా ఇంటాయనకి చెప్పిన, మంచిదన్నడు"

కోకిలకి ఒళ్లు జలదరించినట్లయింది. భయంతో, వెగటు, వెరుపుతో కాదు. ఆత్మీయతని పట్టలేక. ఆ దయని జీర్ణించుకోలేక.

"నీకోసం నేనేం చేయాలి శమంతా. నీకేం కావాలో నిర్భయంగా అడుగు. నా చేతిలో వున్నదేదైనా సరే నీకు ఇస్తాను" అంది కోకిల.

"గట్లంట వేందమ్మ. మేంగూడ కవాడి గూడ లుంటిమి. ఒక్క తానుంటిమి. నాకే

మొద్దమ్మా. ఇరవై దినాలు ఇక్కణ్ణే వుండి నంటే రెండిండ్లల్ల పనికి పోకుంటే నాగకి పట్టుకుంటరు. గాపైసలిప్పిస్తే సాల్తల్లి"

కోకిల చెంపమీద చేయి వేసుకుని రెప్పవే యకుండా చూస్తుండిపోయింది. కడుపులో బిడ్డ కదలికలు ఎక్కువయాయి. మాధవ పేపరు చదువుతున్నాడు.

శమంత 'పోతున్న' అని వెళ్లిపోబో యింది. సిమెంట్ ఫాక్టరీ దగ్గర పెంకు టింట్లో వుంటుంది. ఆవిడ మొగుడు రైల్వేలో కళాసి. చన్నీళ్లకి వేణ్ణీళ్లు శమంత నాలుగిళ్లల్లో పనిచేస్తుంది. రుక్కు ఫాతిమా స్కూల్లో, కొడుకు గేబ్రియల్ స్కూల్లో టెన్త్ క్లాసు చదువుతున్నారు.

"ఏందమ్మా గట్ల చూస్తవ్. నువ్వు నాకేం తక్కువ జేసినవ్?" శమంత అంది. ఆమె మనసులో పగ్గం వేసిన ప్రశ్నలు మొహంలో కనిపిస్తున్నాయి కోకిలకి.

రాత్రి మిగిలిన వంటకాల్ని ఇచ్చేస్తూ వందరూపాయలు చేతిలో పెట్టింది కోకిల.

"ఏంటికమ్మా" అని అడిగింది శమంత.

"మా మాధవుడి బట్టలు వుతకాలిక దమ్మా"

'పెద్దోళ్లిల్లల్ల ఏముంటయో, ఏమో! మారా జులు' అనుకుంది.

ఆమె వెళ్లిపోగానే మాధవ ఈలవేస్తూ వంటింట్లోకి వెళ్లి రెండు నిమిషాల్లో కాఫీ రెండు కప్పుల్లో పోసి తీసుకు వచ్చాడు. టీపాయ్‌మీద పెట్టేసి చతికిలపడ్డ కోకిలకి రెండు చేతులూ ఆసరా ఇచ్చి జాగ్రత్త అని నెమ్మదిగా లేవదీశాడు.

బాలయ్య గాజుల మలారాన్ని కింద పెట్టడం, అంతే జాగ్రత్తగా భుజానికి చేర్చు కోవడం గుర్తొచ్చింది కోకిలకి.

"భద్రం" మరోసారి హెచ్చరిస్తూ సోఫా దగ్గరికి తీసుకువెళ్లి కూర్చోబెట్టాక కాఫీ అందించాడు.

కోకిల సిప్ చేసి "ఎంతకాలం అయిందో ఇలాంటి కాఫీ తాగి" అంది.

ఉదయం ఎనిమిది గంటలు దాటింది. అంతవరకూ 'వివిధ్‌భారతి' విన్న మాధవ "రేడియో వుండనీయనా?" అని అడిగాడు. అతని మాటలు విననట్లు "మాధవా నేను పాట పాడనా? నీకూ మీ అక్కకీ ఇష్టం అయిన పాట" అని అడిగింది.

"ఏయ్ కోకిలా! రేడియో ఆఫ్ చేయనా అని అడుగుతున్నాను"

"కట్టేయ్! నేను పాడతాను. నువ్వు విను"

మాధవ విసుక్కున్నాడు. "ఖర్మరా దేవుడా... ఇంకా చిన్నపిల్లవనుకోకు. ఆ ఫ్లాష్‌బాక్‌లు నేను వినను"

"ఎందుకమ్మా!" గద్దించినట్లు అడిగింది. మాధవ దగ్గర చనువూ, చొరవా ఎక్కువ. ఒక్కొక్కసారి ముద్దు చేయడం, మురిపెంగా చూడడం కోకిల మరిచిపోలేదు.

అతను జవాబు చెప్పేలోగా అమ్మా అని కేకపెట్టింది. హడిలిపోయాడు అతడు. కోకిల పళ్ల బిగువున బాధని దాచుకునే ప్రయత్నం చేస్తోంది.

మాధవ చప్పున ఆమె దగ్గరకు వచ్చే శాడు. కోకిల మొహం తుడుచుకుంది. అర్థం అవుతోంది. ఒళ్లంతా చెమటలు పట్టే స్తున్నాయి. వీపులోంచి కడుపులోకి గున పంతో తవ్వినంత బాధ. అయితే తనకి డాక్టర్ చెప్పిన డేట్‌కంటే రెండు రోజుల ముందే డెలివరీ అవబోతోందన్నమాట.

"కోకీ! శమంతకి వుండమని చెప్పాల్సింది. ఆమె ఇల్లెక్కడ? నిన్నిలా వదిలి ఎలా వెళ్లను? ఇక్కడే వుండి నేనేం చేయగలను" అతను గాబరాపడ్డాడు. ఆమెని జాగ్రత్తగా తీసుకువెళ్లి మంచంమీద పడుకోబెట్టాడు.

కోకిలకి అంతకంతకి నొప్పులు ఎక్కువౌ తున్నాయి. మాధవ రెండు చేతులూ గట్టిగా పట్టుకుంది. ఆ స్పర్శవల్ల ఆమె పడేబాధ అర్థం అవుతోంది. అతను తలెత్తి చూశాడు. ఇల్లు అన్ని హంగులతో చాలా బావుంది. ఇలా వనవాసం చేయాల్సిన అవసరం ఎందుకు వచ్చింది? ప్రభు... ప్రభు వుండా

ల్సిన సమయం ఇది.

కోకిల మధ్యమధ్య అమ్మా అని కేకపెడు తోంది. గోడలు బద్దలై, పునాదులు కదిలిపో తాయేమో అని భయంవేసింది అతనికి. చప్పున బయటికి వచ్చేశాడు. రైల్వేక్వార్టర్స్ లోకి వెళ్లి ధైర్యం చేసి తలుపుకొట్టాడు. రెండుసార్లు ట్రై చేస్తేగానీ ఆ తలుపు తెరచు కోలేదు. తెరుచుకున్న తరవాత నడివయసు న్నావిడ వచ్చి "ఎవరూ" అని అడిగింది.

మాధవ విషయం చెప్పాడు "మా కోకిలకి నొప్పులు వస్తున్నాయమ్మా! మీరొక్కసారి అక్కడ వుంటే నేను పరిగెత్తుకెళ్లి పనిమని షిని పిలుచుకు వస్తాను"

ఆవిడ రెండు నిమిషాల్లో ఓ నిర్ణయానికి వచ్చేసిన దానిలా "పదండి" అంది.

ముందు మాధవా, వెనుక ఆవిడా ఇంచు మించు పరిగెత్తుకు వచ్చారు. ఆవిడ తిన్నగా కోకిల దగ్గరకి వచ్చేసి ఆమె వీపు మీద చేయివేసింది. స్పర్శలో తేడాకి కోకిల కళ్లు తెరచి లేవబోయింది.

"ఒద్దు... పడుకోమ్మా! మీ ఆయన పన మ్మాయిని పిలుచుకు వస్తానన్నాడు" అంది ఆవిడ.

కోకిల చుట్టూ చూసింది. మాధవ గుమ్మం దగ్గర నిలుచుని "కోకీ శమంత ఇల్లె క్కడ? " అని అడిగాడు.

కోకిల బాధని అణచుకుంటూ చెప్పింది. "సిమెంట్ గిర్నీ దగ్గర. డ్రైవర్ ఎల్లయ్యగా రింటి దగ్గర అంటే ఎవరైనా చెబుతారు" మాధవ పరిగెత్తాడు.

పదిహేను నిమిషాల్లో శమంతని వెంట పెట్టుకుని వచ్చాడు. శమంత గదిలోకి అడు గుపెట్టి "చాయ్ తాగిపిస్తే మంచిగుంట దయ్యా" అంది. మాధవకి కాళ్లూ చేతులూ ఆడడంలేదు. కోకిల గట్టెక్కాలి. తను ఇంటికి కూడా వెళ్లాలి. మనసులోనే దేవుడికి పదేపదే దండాలు పెట్టుకుంటున్నాడు. చదువు సాగడంలేదు. ప్రభు జాడా జ వాబూ లేదు. అదృష్టం బావుండి ఫీజుకి చ్చిన ఐదు వేలూ కట్టకుండా తీసుకువ చ్చాడు. ఈ పిల్లనేం చేయాల్రా భగవం తుడా అనుకున్నాడు.

ప్రైవేటు నర్సింగ్‌హోమ్‌కి దారి చూపిం చింది శమంత. ఎదురింటావిడ చెప్పింది. "అవసరం అయితే పిలవండి మీ..." అని ఆపేసింది.

మాధవ థాంక్స్ చెప్పాడు. కాకతీయ నర్సింగ్‌హోమ్‌లో చేర్పించాడు. నిమిషాలు గడుస్తుంటే బెంగగా వుంది. రెండు రోజులు గడిచాయి. రెండు యుగాలైనట్లుంది. ఇంటి దగ్గర చిన్న అబద్ధం ఆడి తప్పించుకు న్నాడు. ఇప్పుడు తప్పించుకోలేని పాశంలో చిక్కుకున్నాడు. మాధవా మాధవా కోకిలకి మాధవుడు గుర్తొస్తున్నాడు.

నర్సింగ్‌హోమ్‌లో లాబర్‌రూం గోడలకి అన్నీ అందమైన, ఆరోగ్యంగా వున్న పిల్లల బొమ్మలు వేలాడుతున్నాయి. ఒకే తువ్వాలు కప్పుకుని బోసినవ్వుల ట్విన్స్ డాక్టర్‌లా స్టెతస్కోపు చెవుల్లో పెట్టుకుని తెగ నవ్వు తుంటే నోట్లోంచి చొంగకారుతోంది.

కోకిల కెవ్వుమన్న కేకలో కేర్‌మన్న శబ్దం కలిసిపోయింది. బయట నిమిషాలు లెక్క పెట్టుకుంటున్న మాధవ ఉలిక్కిపడ్డాడు. తలుపు తెరిచి పిల్లవాడిని తీసుకు వచ్చి చూపించింది సిస్టర్.

మాధవ వాడివైపు చూశాడు "నేను కోకి లని చూడచ్చా" అని అడిగాడు.

"కొంచెం ఆగండి" అని వెళ్లిపోయింది.

మళ్లీ మాధవని చిక్కుముళ్లు బిగించేస్తు న్నాయి. ఓసారి ఒళ్లు గట్టిగా విరుచుకుంటే ఈ తాళ్లు తెగిపోయి తను ఆకాశంలో పక్షిలా ఎగిరిపోతే...

చేతకానితనం భయాన్ని కలిగిస్తోంది.

రావడం అయితే వచ్చేశాడుగానీ వెళ్లడం ఎలా? కోకిల కళ్లల్లో నీళ్లు చూడగలడా? చూసితట్టుకోగలడా? "మిమ్మల్ని చూడాలం టున్నారు" సిస్టర్ వచ్చి చెప్పగానే ఈ లోకం లోకి వచ్చినట్టు చుట్టూ చూశాడు.




# ఏరిన ముత్యాలు

★ రేపు అనేది లేకపోవచ్చు, కానీ ఈరోజు మాత్రం నా దగ్గరుంది.

- పేర్లే

★ న్యాయం గెలుస్తుందన్నమాట నిజమే కానీ గెలిచేదంతా మాత్రం న్యాయం కాదు.

- శ్రీశ్రీ

★ ఎన్నో కష్టనష్టాలు అనుభవించిన తర్వాత కానీ మనిషికి వినయం, వివేకం రావు.

- ఫ్రాంక్లిన్

★ సాహసించని వాడు గెలుపు సాధించలేడు.

- నేతాజీ

★ హోదానుబట్టి మనిషిని బేరీజు వేయకండి.

- తుకారాం

★ ఏది తప్పో, ఏది ఒప్పో అంతరాత్మ చెబుతూనే ఉంటుంది. తెలీదు అనడం ఉత్త వంచన.

- చలం

★ మంచి స్నేహితుల తర్వాత సంపాదించగలిగినవి మంచి పుస్తకాలే.

- కోల్టిన్

★ ఒక మంచి మనిషి ఆలోచనలు ఎప్పటికీ వృధాపోవు.

- గాంధీజీ

★ దైవభక్తి ఇంటికి కిరీటం- సంతృప్తి ఇంటికి వరప్రసాదం.

- రామకృష్ణపరమహంస

★ కోపపు సమయంలో సహనాన్ని పాటించగలిగితే నూరు రోజుల బాధనుంచి తప్పించుకోగలరు.

- చైనాసామెత

★ నీ ప్రవర్తన విషయంలో నీవు శ్రద్ధవహిస్తే గౌరవమర్యాదలు వాటికవే నిన్ను వెతుక్కుంటూ వస్తాయి.

- సంస్కృత సూక్తి

★ చిన్న పుస్తకం పట్టుకుని ఒక మూల కూర్చున్నప్పుడు దొరికిన విశ్రాంతి ఎక్కడ వెతికినా కనబడదు.

- థామస్. ఎ. కెంపిస్

★ ప్రతిభకు అవసరమైన ముడి పదార్థం సహనం మాత్రమే.

- బెంజిమన్ డిశ్రేలీ

సేకరణ: శివప్రసాద్ వండా

క్షణం ఆగి కోకిల వున్న గదిలోకి వచ్చాడు.

శమంత ఫ్లాస్కు తీసుకుని బయటికి వెళ్లింది.

కోకిల అతనివైపు చూసి "థాంక్యూ థాంక్యూ వెరీమచ్ మాధవా" అంది.

"మండుతుంది, నాకు. థాంక్యూ, సారీ ఈజీ పదాలు. నాకు జీర్ణం కావు. కోకిలా! ఎలా వున్నావు? ఇప్పుడేం బాధ లేదుగా!" అని అడిగాడు విసుగుని దాచుకుంటూ.

కోకిల నీరసంగా నవ్వి "పిచ్చి వాడివి నువ్వు. డెలివరీ అయ్యేవరకే ఈ బాధ. ఆ తరువాత అంతా నార్మలే. ఈ వీక్‌నెస్ మధ్యాహ్నానికల్లా పారిపోతుంది" అని "మాధవా నా కొడుకుని సరిగా చూడలేదు. వాణ్ణి చూశావా" అని అడిగింది.

"చూశాను"

"ఎలా వున్నాడు?"

"బావున్నాడు"

"ఎవరిలా వుంటాడు?"

"నీలాగే" అని నవ్వాడు. "చిన్న పాప... అంత చిన్న పిల్లలు అందరూ ఒకేలా వుంటారు కోకిలా"

"పాప అంటున్నావేమిటి?"

"పొరపాటు... బాబే అది సరే కోకిలా నువ్వేం తింటావు? డయట్ గురించి అడగలేదు. ఓసారి వెళ్లి డాక్టర్ని అడగనా"

"వద్దు, నువ్వు ఎక్కడికీ వెళ్లకు మాధవా. నాకు దగ్గరగా ఇక్కడే కూర్చో చాలా నిద్ర వస్తోంది. నీకో విషయం చెప్పనా"

"చెప్పు" మాధవకి చాలా ఓర్పు వుంది.

"రాత్రంతా పెయిన్స్ వస్తూనే వున్నాయి. సివియర్‌గా వచ్చినప్పుడు చెప్పచ్చని వూరుకున్నాను. నువ్వు ఖంగారుపడితే. నేను నిన్ను ఆపలేను. నువ్వు వెళ్లిపోతే భయం చాలా భయం మాధవా"

మాధవకి జాలేసింది. "భయందేనికీ?"

కోకిల కళ్లు ఒక్కసారి వురికిన జలపాతాలయాయి. "నాతోనే వుంటానని చెప్పి ప్రభు వెళ్లిపోయాడు. ఈ ఇల్లు అద్దెకు తీసుకుని చిన్న స్కూల్లో టీచరుగా పని చేస్తూ... ఓ గాడ్... హెల్... నరకం... ఇప్పుడు ఈ క్షణంలో కూడా నరకం చూస్తున్నాను. ప్రశాంతంగా వున్న నదిలో రాయివేస్తే ఎలా చెదిరిపోతుందో చివరికి నా బతుక్కూడా అలాగే అయింది. ప్రపంచంలో దేన్నైనా ఎదురుకోగలం కానీ ఒంటరితనాన్ని మాత్రం భరించలేం"

"ఇంటికి వచ్చేయాల్సింది" మాధవ వినలేనివాడిలా ఇబ్బంది పడుతున్నాడు. "అయినా కోకిలా నువ్వు చదివిన పుస్తకాలు కూడా ఇలాంటివే. తీయని కలలుకంటూ ఊహల పల్లకీల్లో ప్రయాణం చేయడం లాంటివే. ఇంక సినిమాలు చెప్పక్కర్లేదు"

"సందు దొరికితే చాలు తూర్పారపడతావు. అసలే ఏడుస్తూంటే ఇంకా ఎందుకిలా దెప్పుతావు?"

"అసలు మీ అన్నయ్యని అనాలి"

"మధ్యలో ఆయనేం చేశాడు?" అని అడిగింది. ఓ వైపు కళ్లనీళ్లు కారుతూనే వున్నాయి. అయినా అప్పుడప్పుడు మాధవ తిడుతుంటే నవ్వొస్తోంది.

"ఆడపిల్ల గడపదాటి బయటికి వెడుతూంటే ఓ కన్నువేసి వుంచడంలో తప్పేం లేదు. అది బాధ్యత. అది మీ అన్నయ్యకి లేదు"

మళ్లీ నవ్వింది కోకిల.

"వూరికే నవ్వెలా వస్తోంది కోకిలా?"

"నీకింకా పాత చింతకాయ పచ్చడి భావాలు పోలేదు" మాధవకి కోపం వచ్చింది. కొంచెంసేపు మనసులో ఒకటి రెండులు లెక్కపెట్టుకున్నాడు. క్రమంగా కోపం ముక్కుమీంచి జారి కరిగిపోతోంది.

బాబుకి స్నానం చేయించి తెల్లని బట్టలో జాగ్రత్తగా చుట్టి తీసుకువచ్చి కోకిల పక్కనే పడుకోబెట్టారు.

అంత చిన్న ప్రాణి, పుట్టి గంట కూడా కాలేదుకానీ గుప్పిళ్లు నోట్లో పెట్టుకుంటు




న్నాడు. ఆ చేయి జారిపోతుంటే మళ్లీ ప్రయత్నం చేస్తున్నాడు. ఆకలికి ఏదో తినాలనే వూహ ఎక్కడిది? జారిపోతున్న చేతి వైపు మెడ తిప్పాలని అసహనంగా కదులుతున్నాడు.

"మాధవా నాకు నిద్ర వస్తోంది. అయినా వీడు వచ్చేవరకూ కళ్లు మూసుకోవద్దనుకున్నాను. వీణ్ణిలా ఓసారి ముట్టుకో" అంది తను వాడి వంటిమీద చేయివేస్తూ. ఆ శరీరం మెత్తగా ఓసారి దూదిలా వెన్నలా మరోసారి రెండూ కాని రబ్బరు బంతిలా ముట్టుకుంటే మాసిపోయేట్లు కూడా కనిపిస్తున్నాడు.

"ఓసారి వీడి మీద చేయివేయి ప్లీజ్. ఎంత మెత్తగా వున్నాడో" మాధవ బుర్రలోకి కోకిల వర్ణిస్తున్న మాటలు దూరడంలేదు.

"నువ్వు చీరకట్టుకోవలసింది"

"తోచలేదు" నొచ్చుకుంది కోకిల.

"కోకిలా ఇంటికి వెళ్లద్దూ" అని అడిగాడు మాధవ.

కోకిల వులిక్కిపడింది. భయపడింది. ఆ భయంతో అతని చేతిని గట్టిగా పట్టుకుంది. అతను వెనక్కి తీసుకోబోతుంటే "ప్లీజ్ మాధవా వుండు ప్లీజ్! నాకోసం. నేనెలా వుండను? కొన్నాళ్లు నువ్వుంటే నాకు ధైర్యం వస్తుంది. ఇదిగో ఇటూ నా వైపు చూడు" అంది.

అతను తలెత్తాడు.

"నీకు గుదిబండనై నీ ప్రాణానికి శనిలా దాపురించాననుకోకు. నా వల్ల నీకు కోరి తెచ్చుకున్న కష్టాలు"

"పరీక్షలు దగ్గర పడుతున్నాయి. ఇంజనీరింగ్‌లో సీటు రాలేదు. ఈసారి కూడా ఎంసెట్‌లో క్వాలిఫై కాకపోతే నాన్నకి తల బొంపులొతుందంటారు. ఆయనని కష్టపెట్టడం మాట దేవుడెరుగు, ఫ్యూచరు పాడై పోదూ?"

"అదీ నిజమే"

ఈలోపుగా శమంత కాఫీ తీసుకు వచ్చి ఇచ్చింది.

కోకిల తీసుకోలేదు.

"తీసుకో కోకిలా" అన్నాడతను.

కోకిల చేత్తో కప్పుని దూరం పెట్టి "సారీ మాధవా! కాఫీ రుచిగా ప్రాణం లేచి వచ్చేదిగా లేదు. విషంలా అనిపిస్తోంది" అంది.

"ఐయామ్‌సారీ కోకిలా! నిజం నిష్ఠూరంలా వుంటుంది. నేనేమీ నీకు సహాయం చేసే స్థితిలో లేను. నేను ఇంటికి వెళ్లకపోతే..."

"నీ ఇష్టం... ఈ రోజే వెళ్లిపో నిజం చేదుగా వుంటుంది. నువ్వు వెళ్లాలనుకోవడంలో తప్పులేదు. కానీ నిన్నాపడంలో నేనే తప్పు చేయబోయాను" అని చిన్నగా నవ్వింది. "మహా సముద్రాన్ని ఈదడం అంటే ఏవిటో అనుకునేదాన్ని. ప్రభు లేకుండా కడుపులో బిడ్డతో ఇన్నాళ్లూ రోజుల్ని సునాయాసంగా గడిపేశాను. డెలివరీ కూడా సుఖంగానే జరిగింది. ఇప్పుడెందుకు భయపడ్డం పిచ్చిగానీ"

పిల్లవాడు కెవ్వుమన్నాడు.

వాడిని దగ్గరకి గుండెల్లోకి తీసుకుంది. "ఎంత హాయి... మాధవా... భగవంతుడు ఏదోవిధంగా తనదైన రక్షణ కల్పిస్తాడు. అంత ఇర్రెస్పాన్సిబిల్ పర్సన్‌కాదు. నాకు తోడు అవసరం అని తెలిసి ఇదిగో వీడిని పంపాడు. సో యూ కెన్‌గో"

అతను లేచి "మరి నేను వెడతాను" అన్నాడు.

కోకిల చేయి పైకెత్తి "గాడ్ బ్లెస్‌యూ" అంది. అతను గడపదాటాడు. కోకిల కదిలి కదిలి ఏడుస్తుంటే ఆ శబ్దం గేటు వరకూ వినిపించింది. మాధవ అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తున్నాడు.

వెనకనుంచి శమంత అరుస్తోంది. పరిగెత్తుతోంది. అతను ఆటో మాట్లాడుకున్నాడు. శమంత గాలికంటే వేగంగా దుమారంలా వచ్చేసి అతన్ని గట్టిగా పట్టుకుంది. "రాంఢ్రయ్యా... అమ్మెట్టిట్టనో చేస్తుంది"



అతను మంత్రంవేసినట్లు ఆమె వెనుకే వెళ్ళాడు.

మాధవ రూమ్‌లోకి అడుగుపెట్టగానే కోకిల కళ్లు తెరిచింది. మాధవ తిన్నగా వచ్చి ఆమె మంచంమీద కూర్చున్నాడు. కోకిల తన సంతోషాన్ని వ్యక్తంచేస్తూ చంటి వాడిని ముద్దుపెట్టుకుంది.

మాధవ అయోమయంగా చూశాడు.

శమంత అతనివైపు చూస్తూ, "అమ్మనిడిసిపెట్టిపోతే ఎట్లనయ్యా. అమ్మ లేదు, అయ్యలేదు. ఎట్ల బతుకుతదయ్యా. వూకె ఏడుస్తావుంటే నేనే వచ్చిననయ్యా" అంది మొహం దించేసుకుని.

కోకిల కళ్ళు తుడుచుకుంది. "నువ్వు హోటల్‌కి వెళ్ళి భోజనం చేసిరా మాధవా"

మాధవ ఆలోచనలోపడ్డాడు.

పన్నెండు గంటలవుతుండగా తనే వెళ్ళి హోటల్లో భోజనం చేసి శమంతకి కూడా తెచ్చాడు. డాక్టర్లు పథ్యాల గురించి పట్టించుకోరు. మందులు వేసుకున్నంతసేపూ అన్ని పదార్థాలూ తినచ్చుని గ్రీన్‌సిగ్నల్ చూపిస్తారు.

అయినా కోకిల భోజనంగానీ టిఫిన్‌గానీ చేయలేదు. బలవంతంగా కాఫీ తాగించాడు మాధవ.

అతని కళ్ళముందు పుస్తకాలు గుట్టలు గుట్టలుగా పేరుకుపోయి వున్నాయి. వేలకి వేలు కోచింగ్ సెంటర్లకీ, పుస్తకాలకీ ఖర్చు పెట్టారు. పట్టుబట్టి ఓ గంటసేపు కూర్చుంటే యిట్టే పాసయేవాడు. ఈ కోకిల వెళ్ళిపోవడం ప్రభు సంగతేమోగానీ తనకే ఎక్కువ బాధని కలిగించింది. నెత్తిపట్టుకొని కూర్చుంటున్నాడేగానీ ఒక్క ముక్క అర్థంకావడంలేదు. కోకిల ఉత్తరం రాయగానే క్షణం కూడా ఆలోచించలేదు.

కోకిల హాయిగా నిద్రపోతోంది. ఓవైపు నేలమీద కొంగు పరచుకుని పడుకుంది శమంత. ఇక్కడికి వచ్చినప్పటినుంచీ కంటిమీదకి కునుకు రావడంలేదు.

'తను పెద్దవాడిగా తలుచుకుంటూ శక్తికి మించిన బరువును వేసుకుంటున్నాడు. ఆ బరువుకు భుజాలు కృంగిపోతున్నాయి. డబ్బుకేం బాధలేదు. కానీ కరిగిపోతున్న కాలాన్ని పట్టుకోకపోతే పీకల్దాకా మునిగిపోతాడు. ఇప్పుడేం చేయాలి? ఇద్దరూ పడుకున్నారు. మెల్లగా జారుకుంటే...'

మాధవకి సిగ్గేసింది. 'తను మగవాడు. ఛాతీ చూపించడం, మీసం మెలేయడం లాంటి ఆర్భాటాలేం చేయక్కర్లేదు. ఆశ్రయం లేని తన స్నేహితురాలు ప్రాధేయపడుతుంటే పిరికివాడిలా పారిపోవడం చాలా దారుణం'

'చదువు కొండెక్కుతుంది'

'ఏం చేస్తాం'

అతను పరిపరివిధాల ఆలోచిస్తున్నాడు. చదువు... నిర్లక్ష్యం చేసేందుకు వీల్లేదు. క్షణం విలువ తెలిసి కూడా యింకా స్నేహం, మనిషి ధర్మం అనుకుంటే తను బతకగలడా?

బుర్ర పగిలిపోతోంది.

'ఈసారి తను ఆగడు. వెళ్ళిపోతాడు'

'ఎవరూ తనని ఆపలేరు. గుండె రాయిచేసుకుంటాడు. ఇంత పని చేసిన ప్రభుగాడికి చీమ కుట్టినట్లయినా లేదే' అతను తల పట్టుకున్నాడు. చప్పున లేచి నిలబడ్డాడు.

కేర్ మన్న కేక గుండెను రెండుగా చీల్చేస్తున్నట్లు. మాధవ కాళ్ళు నేలకి అతుక్కుపోయాయి.

బంధాలు... అవి బంధాలై కాళ్ళను చుట్టేశాయి.

వీడెందుకు ఏడుస్తున్నాడు? మాధవ చిన్నవాడి పక్కని సరిచేసి చూశాడు. సన్నటి ఎర్రచీమ.

రెపరెపలాడింది అతని మనసు.

'ఇంత చిన్న చీమ... వాడిని 'కుట్టి' రక్షించింది. వాడే ఏడవకపోతే తను ఈపాటికి ఆటోలో వుండేవాడు'

"ఏమైంది? ఏమైందయ్యా?" శమంత,

కోకిల అడిగారు. చేతిలో చీమని కోకిలకి చూపించాడు మాధవ.

చిన్నవాడి పిర్ర ఎర్రగా అయిపోయింది.

కోకిల దిక్కుతోచని దానిలా శమంతవైపు చూసింది. శమంత పక్క దులిపి తమ వెంట తెచ్చుకున్న తెల్లటి దుప్పటి పరిచి వాడిని తల్లివైపు తిప్పి పడుకోబెట్టింది.

మొట్టమొదటిసారి వాడు పాలు తాగుతూంటే ఆ శబ్దం అక్కడున్న ముగ్గుర్నీ పులకరింతలో ముంచివేసింది.

కోకిల నిద్రపోతోంది.

ఓ మనిషి తోడులో స్వర్గాన్ని చూస్తున్న దానిలా ప్రపంచాన్ని జయించినంత ఆనందంగా వొంటిమీద స్పృహ లేకుండా పడుకుంది.

నిశ్చింతలో వున్న సౌఖ్యం దేనితోనూ సరితూగదు.



మర్నాడు డిశ్చార్జ్ చేశారు.

శమంత రెండురోజులూ కోకిలని అంటిపెట్టుకుని వుంది. అడగకూడదనే 'హద్దు' ఆమెని నోరు ఎత్తనీయలేదు.

కోకిల ఏడుస్తూంటే 'ఈ గోల్‌మాల్ ఏమిటో అంతుచిక్కలేదు' 'ఆ అయ్య అమ్మని మంచిగ చూస్తడు' అని తప్ప మంచిభావం రావడంలేదు. 'అసలీ అమ్మకేమైతాడో తెలుసుకుంటే' శమంత ఆలోచనల్ని పక్కకి పెట్టి ఓసారి తన యింటికి వెడుతూ "అయ్య గిప్పుడెలస్త" అంది.

మాధవ బుర్ర వూపాడు.

కోకిలకి అనారోగ్యం అంటూ ఏదీ లేదు. అందుకే లేచి ఇల్లంతా పరచుకున్న 'చెత్తాచెదారం లాంటివి చేత్తో తీసేసింది. బట్టల్ని ఓ మూల ఉతికేచోట పడేసింది.

కిటికీకి అవతల వున్న మరో గదిలో మాధవ గడ్డం గీసుకుంటున్నాడు. అతను వుత్సాహంగా లేడు. ముళ్ళమీద వున్నట్లున్నాడు. 'మాధవ వెళ్ళిపోతాడు'

'వెళ్ళిపోవాలి కూడా'

'ఆ తరువాత?'

'మామూలు జీవితానికి అలవాటుపడాలి'

'పొద్దున్న లేచినప్పటినుంచీ రాత్రి పక్కమీద వాలేవరకూ అన్ని పనులూ తనే చేసుకోవాలి ఎలా?'

'సర్దుకుపోవాలి అంతే! గట్టిగా "మాధవా?" అని పిలిచింది. మాధవ అక్కణ్ణించే "చెప్పు" అన్నాడు.

కోకిల కూడా తను వున్న చోటునుంచి "ఇవాళ మంచిరోజు నువ్వు ఇంటికి వెళ్ళు" అంది.

అతను భుజాలమీంచి మొహం తిప్పి కోకిలని చూశాడు.

కోకిల చీర కట్టుకుంది.

నడికట్టు బిగించుకుంది.

చెవుల్లో దూది కనిపిస్తోంది.

పచ్చని శరీరం పసుపు రాసినట్లు మెరుస్తోంది.

ఇప్పుడామె కళ్ళు దైన్యంగా లేవు. ఏ క్షణంలో ఏవిధమైన పరిస్థితులు ఎదురైనా తట్టుకుందుకు సిద్ధంగా వున్నట్లు చెబుతున్నాయి. మనసు బలహీనం అయితే శరీరంలో భాగాలు చచ్చుబడినట్లు అవుతాయి.



తన మనసు ఇప్పుడా గతాన్ని గురించి ఆలోచించడమూ లేదు బాధపడడమూ లేదు.

'పోనీయ్'

'పోతే పోనీయ్'

ఎవరూ... ఎవరి గురించీ పట్టించుకోనవసరంలేదు.

"నీ బట్టలు సర్దుకో"

"ఇవన్నీ చెప్పక్కర్లేదు కోకీ. వెళ్ళాలి అనుకున్న తరువాత క్షణం ఆలశ్యం చెయ్యను. వెళ్ళిపోతున్నాను. పిల్లవాడు జాగ్రత్త. శమంతకి డబ్బు ఎక్కువైనా ఫరవాలేదు. ఇక్కడే వుండి నీకు పని చేయమని చెప్పు"

"ఓ" వ్యంగ్యంగా అంది కోకిల. "నువ్వు నాకు సలహా ఇవ్వక్కర్లేదు. బతకాలి కనుక ఎలా బతకాలో కూడా తెలుస్తుంది. సారీ ఉరుము ఉరిమి మంగలంమీద పడిందన్నట్లు నీమీద పెత్తనం చలాయిస్తున్నాను. సో... సారీ"

"మరేం ఫరవాలేదు. నీకు కోపం రావడంలో తప్పులేదు. ఇప్పుడేం? నువ్వు ఎవరిమీద కోపం తెచ్చుకున్నా నామీదే విరుచుకు పడేదానివి. అలవాటైపోయింది"

అతను గబగబా బాత్‌రూమ్‌లోకి దూరాడు. ఆ తర్వాత నీట్‌గా తయారయ్యాడు. బ్రీఫ్‌కేస్ తీసుకుని మంచంమీద పడుకున్న చిన్నవాడి దగ్గరకి వెళ్ళి వాడి గుప్పిళ్ళు తన చేతిలోకి తీసుకుని వాసన చూసినట్లు సున్నితంగా ముద్దెట్టుకున్నాడు. రెండు రోజుల బాలింతరాలు కావడంవల్ల అలసిపోయింది కోకిల.

గుమ్మం దాటుతూ "వెడుతున్నాను" అన్నాడు.

"వూఁ" అనలేదు కోకిల. జవాబిస్తే యింకేమైనా వుందా గుండె పగిలిపోదూ. చిన్నవాడిని దగ్గరకి తీసుకుంది. అయిపోయింది. కళ్ళు ఒద్దన్నా తడుస్తున్నాయి.

కోపం వస్తోంది.

తనమీద తనకే...

పరిసరాలమీద

తల్లితండ్రులమీదా... అన్నా వదినలమీద

ప్రభుమీదా...మాధవమీద...

ప్రపంచంమీద...

ఎందుకుట?

ముద్దుగా చెప్పి తనని స్వేచ్ఛగా వదలివేయకుండా వుండాల్సింది. తల పగిలిపోతోంది.

'పారిపోవాలి. పరిగెత్తిపోవాలి. తనకి అందరూ కావాలి' ఈ శూన్యాన్నీ, ఈ భయం తెప్పిస్తున్న ఒంటరితనాన్నీ వదిలేసి వెళ్ళిపోవాలి... హాయిగా.

ప్రేమ అనుభవిస్తున్నప్పుడు ఎంత తియ్యగా వుంటుందో కొంచెం దూరం అయితే నరకాన్ని సృష్టిస్తుంది.

తడిసిన కళ్ళు మూతలు పడ్డాయి. కోకిలకి నిద్ర పట్టేసింది.

★ ★ ★

చాలా దూరం వచ్చేశాడు మాధవ.

ఇంట్లోకి అడుగు పెట్టగానే తండ్రి అంతెత్తు ఎగిరాడు. "వేలకి వేలు తగలేసి చదివిస్తూంటే ఫీజు కూడా తీసుకుని పారిపోయావు. బుద్ధీ, జ్ఞానం వున్న వాళ్లెవరూ ఇటువంటి పనిచేయరు. ఎందుకొచ్చావు. వుద్ధరించేందుకు వెళ్ళావుగా! నువ్వో అపర రాజారామ్మోహన్‌రాయ్‌వని ఓ పేరు తగిలించుకోపోయావా? "

బ్రీఫ్‌కేసు కూడా కిందపెట్టలేదు మాధవ. తల దించేసుకున్నాడు. అతనికి జవాబు ఇవ్వడం అలవాటులేదు.

"మాట్లాడకుండా వుండడం గొప్ప అనుకుంటున్నావా? అడిగిన దానికి సమాధానం చెప్పద్దనుకున్నావా? మాట్లాడవేంరా? "

తలెత్తి చుట్టూ చూశాడు. అక్కడ అంత పెద్దపెద్ద అరుపులు దద్దరిల్లుతూంటే ఈ అమ్మ ఎక్కడుందో? 'అమ్మా రక్షించు' అనుకుంటున్నాడు.

తండ్రి ఇచ్చిన స్ట్రాంగ్ ఇన్‌స్ట్రక్షన్స్ అయి వుంటాయి. ఆవిడ రావడంలేదు. తప్పదు.




"సారీ డాడీ... తప్పే చేశాను. కోకిల చాలా కష్టంలో వుంది. మీక్కూడా కోకిల అంటే యిష్టమే కదండి. దానికి నిన్ననే కొడుకు పుట్టాడు"

ఆయన కొయ్యబారిపోయాడు. కళ్లు తెరచి చూస్తూంటే "ప్లీజ్ డాడీ! మీరు కల్పించు కుంటే అనాథలా వుండదు కోకిల. ఒక్కతే ఎన్ని కష్టాలు పడుతోందో చూడండి" అని ప్రాధేయపడ్డాడు.

అరక్షణంలో తేరుకుని అరక్షణంలో దడ దడదడ మంటూ వడగళ్ళ వర్షం కురిపించే శాడాయన. "ఘనకార్యం చేసినట్టు చెబుతు న్నావు సిగ్గుగా లేదూ. ఆ పిల్ల వెళ్ళిపోయి నప్పుడే నువ్వులూ, నీళ్లూ వదిలేశారు. మన కెందుకు... ఒకడిని ప్రేమించిందని తెలిసి నువ్వెందుకు వెళ్ళావు? "

"కష్టంలో వున్నానని రాస్తే ఫ్రెండ్ కదా ఆమాత్రం హెల్ప్ చేయకపోతే ఎలా డాడ్"

"నిండా యిరవైఏళ్లు లేవు. ఉద్ధరించేం దుకు బయలుదేరావు. నా కడుపున చెడబు ట్టావు"

ఆయన అలా ఎడాపెడా తిట్ల వర్షం కురి పిస్తూంటే క్షణం నవ్వొచ్చింది మాధవకి "ఈయన కడుపున పుట్టడం ఏమిటి? " అని. ఆయన హాల్లో బుసలుకొడుతూ ఇటూ అటూ తిరుగుతున్నాడు. లోపలికి రమ్మ నడు... బయటికి వెళ్ళమనడు. లోపల కూర్చోవాలో గడప దాటాలో అర్థంకావడం లేదు. నిల్చుని నిల్చుని కాళ్ళు నొప్పులు.

"అమ్మా" సహనం చచ్చిపోయింది. మాధవ గట్టిగా అరిచేశాడు.

పిలుపు విని కిందికి దిగివచ్చింది కాత్యా యని. "ఎంతసేపైంది వచ్చి" అని అడి గింది.

"నిజంగా నీకు తెలీదామ్మా"

"పైన వున్నాను. వినిపించలేదురా. ఎక్క ణ్ణించి వస్తున్నావు? "

"అదీ తెలీదూ? వూళ్లో అందరూ అరు స్తుంటే నీకు తెలీదామ్మా"

నారాయణరావు ఇటువైపు తిరిగాడు. "చూశావా? వాడు నన్నే అంటున్నాడు"

"అమ్మా! నన్ను లోపలికి రమ్మంటావా లేదా? "

"అంటే" ఆవిడ అప్పుడు చూసింది. భర్త సీరియస్‌గా వున్నాడు. నిజానికి ఆయన గొడవ పడడం తనకి వినిపించలేదు. ఏం చేయాలో వెంటనే తోచలేదు. అయినా ధైర్యం చేసి "రా లోపలికి" అంది.

అతను అడుగు ముందుకు వేశాడు. వెళ్ళి సోఫాలో కూర్చుని వెనక్కి వాలి నిద్రపో యాడు. కళ్ళు మూసుకున్నా తెరిచినా కోకిల కనిపిస్తోంది. ఇంక నిద్ర ఎలా పడు తుంది? సమస్య అతన్ని కలవరపెడు తోంది.

పొరబాటు జరిగింది. 'కోకిలని వదిలి వచ్చేయకూడదు' "సంధ్యవేళ నిద్రపోతే కలత నిద్ర అవుతుంది. లే... లేవరా మాధవా" అని లేపింది కాత్యాయని.

తృళ్ళిపడి లేచాడు మాధవ.

"మంచినీళ్ళు కావాలా? " అని అడిగింది.

"అవసరంలేదు" మాధవ లేచి నిలుచో గానే గాబరాగా అడిగింది ఆవిడ "మళ్ళీ ఎక్కడికిరా నాయనా"

"నువ్వేం బతిమాలక్కర్లేదు. వాణ్ణిపో నీయ్" అన్నాడు నారాయణరావు. కాత్యాయ నికి ముచ్చెమటలు పోస్తున్నాయి. "నా న్నాగారితో పేచీ పెట్టుకోకు. ఇప్పుడేం కొంపలంటుకు పోతున్నాయి? "

ఆవిడ గోలగోలగా అతన్ని చుట్టేయబో యింది. అతను ఆవిణ్ణి నెమ్మదిగా పక్కకి జరిపి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి చాలా పొద్దుపోయేవరకూ అక్కడా యిక్కడా తిరుగుతూనే వున్నాడు. పది గంటలౌతూంటే లాడ్జికి వెళ్ళి అక్కడి నుంచి ఫోన్ చేశాడు.

"హలో"

"మీరు మిష్టర్ సంపత్ అవునా? "

"యస్... చెప్పండి... ఎవరూ? ఎవరు

మీరు" అటు నుంచి సంపత్ అడిగాడు.

"మాధవ... మాధవ హియర్"

"ఓ" సంపత్ గ్రహించాడు. "చెప్పు... సంగతేమిటి"

"మీరోసారి మయూరా లాడ్జ్... రూమ్ నెంబరు పదహారుకి వెంటనే వస్తారా?"

"సంగతేమిటి?" సంపత్ గొంతులో అసహనం స్పష్టంగా వినిపిస్తోంది. మాధవ పట్టించుకోలేదు "ప్లీజ్ రండి" అన్నాడు.

సంపత్ ఏమనుకున్నాడోగానీ "వస్తున్నా" అన్నాడు.

అరగంట తర్వాత సంపత్ వచ్చాడు. మాధవ అతన్ని 'కూర్చో'మని చెప్పాడు. సంపత్ కూర్చున్నాక మాధవ చిన్నగా దగ్గి "సంపత్ మీరు కోకిలని తెచ్చుకోండి. లేదంటే మీరే వెళ్ళి ఆమెను కాపాడుకోండి"

అతను విసురుగా తలెత్తాడు "ఈ ఉచిత సలహాలు నాకెందుకు? మా ఇంటి విషయాలు నీకవసరంలేదు. ఏం చేయాలో, ఏం చేస్తే బావుంటుందో మాకు తెలుసు"

మాధవ క్షణం నిర్ఘాంతపోయాడు. తేరుకుని మొహానికి పట్టిన చమట తుడుచుకున్నాడు.



సంపత్ లేచి పచార్లు చేస్తూ ఆగి "అవునూ కోకిల దగ్గరకి నువ్వు వెళ్ళావా? లేక తనే నిన్ను రమ్మని పిలిచిందా? ఇదిగో యిటు చూడు" అని కొంచెం వొంగుని పాంటు జేబులోంచి కట్టకట్టిన ఐదు వందల రూపాయలనోట్లు తీసి సోఫాలోకి విసిరే శాడు. అతని కనుబొమ్మలు ముడిపడ్డాయి "చూడు మాధవా కోకిల కోసం నువ్వు ఇంత కంటే ఎక్కువ ఖర్చుపెట్టినట్లయితే మొహ మాటపడకుండా అడుగు యిస్తాను. డబ్బుకి యిబ్బందేమీ లేదు. ఇబ్బందల్లా రెండు రోజులకో ఫ్రెండ్ కోకిల దగ్గరకి వెళ్ళి క్షేమ సమాచారాలు వాకబు చేసుకుని మళ్ళీ మళ్ళీ నీలాగే లాడ్జిలకి నన్ను పిలుస్తారేమో"

రెండుచేతుల్తో చప్పట్లు కొట్టాడు మాధవ. "భేష్ మిమ్మల్ని బహిరంగంగా సన్మానించాలని వుంది. అన్న అంటే మీలా వుండాలి" అన్నాడు. తిరిగి కొంచెం ఆగి చూపుడు వేలినీ మధ్యవేలినీ కలిపి అతని మొహంమీద గురిపెట్టి "కోకిల పతనానికి కారణం మీరూ, మీ తల్లితండ్రులూ. ఆ పిల్ల ఆడింది ఆటగా, పాడింది పాటగా పెంచారు. అది గొప్ప అనుకున్నారు. మీ దృష్టిలో మగా ఆడా తేడా లేదనీ, సమాన హక్కులూ, స్వేచ్ఛా ఇలా ఎన్నో నమ్మిన వాళ్ళు. ఇప్పుడు సమయం వచ్చేసరికి మీకు పరువు గుర్తొచ్చినట్లుంది"

"స్టాప్" సంపత్ మొహం ఎర్రబడింది. "నా గుండె చప్పుళ్ళు నీకు వినిపిస్తు న్నాయా? నా మనసు పడేక్షోభ తెలు స్తోందా? లేదు. నీకు నోరుంది. అవాకులూ చవాకులూ పేలుతున్నావు మాధవా. అది మగరాయుడిలా ఎవర్నీ లెక్కజేయక పోవ డాన్ని డాడీ ఎప్పుడూ తప్పుపట్టలేదు. ఒక అన్ననై వుండీ దాని గురించి పట్టించు కోనా...? "

ఆయాసంతో మళ్ళీ అన్నాడు. "పట్టించు కోను... ఎందుకంటే యింట్లో 'డాడీ' మాట చెల్లాలి. నేనేం చేసినా ఆయనకి కోపం వస్తుంది. డాడీకి లేని బాధ వీడికెందుకో అనుకుంటుందని, గౌరవం ఏకాస్తయినా వుంటే పోతుందనీ. నోరు మూసుకున్నాను. ఓ... కే"

మాధవ నిశ్శబ్దంగా వింటున్నాడు.

"కోకిల కాజీపేట రైల్వే క్వార్టర్స్ పక్కన వుంది. దానికి కొడుకు పుట్టాడు. ఆమె ఎవరో సహాయం చేస్తోంది. ఇవన్నీ నాకు తెలుసు. కానీ నేనేమీ చేయలేను. కానీ కష్టం సుఖం తెలుస్తుంది. లైఫ్ అంటే ఆట కాదనీ నేర్చుకోనీ"

క్రమంగా మాధవకి అర్థం అయింది. "అయినా కోకిల..." అని "నేను గ్రహిం చాను. మీరున్న పరిస్థితుల్లో ఏమీ చేయలే కపోతున్నారు. కానీ..." మళ్ళీ ఆగాడు. ఈసారి అతను చెప్పేశాడు. "ఈ సమయం లోనే ఎవరికైనా తన వాళ్ళ ఓదార్పు కావాలి సంపత్‌గారూ. మీరు ధైర్యం చేయకపోతే ఆత్మహత్య చేసుకుంటుంది. నేను యింకా అక్కడ వుండలేను కదండి"

సంపత్ చుట్టూ చూసి తెలుసుకున్నాడు. "అయితే మీ నాన్నగారు యింట్లోంచి పంపించేశారన్నమాట 'అయ్యో!' అని జాలిప డను మాధవా. ఎందుకంటే యిటువంటి సహాయాలూ, విప్లవాలూ వీటిని ప్రోత్సహిం చను నేను. మగవాడు తన చదువు తర్వాత జీవితంలో సెటిల్ అయేవరకూ సాహసాలు చేయనక్కర్లేదు. కోకిలతో నీకేం పనీ? కోకి లలాగే మరొకరు... మరొకరు ఎంతమం దిని ఉద్ధరిస్తారు? "

"తప్పే కానీ" అని కొంచెం ఆగి చెప్పాడు. "మిష్టర్ సంపత్! రోడ్డు మీద ఓ ప్రాణి చావుబతుకుల్లో వుంటే మీ పాటికి మీరు చూసీచూడనట్లు వెళ్ళిపోగలరా? నేనైతే వెళ్ళనండి. ఓ నోరు లేని జీవి గురించే ఇంత ఆలోచిస్తే మనిషి... నా స్నేహితు రాలు కష్టంలో వుంటే నాకు చేతనైన సహాయం చేయాలని వెళ్ళాను. నాకేమీ మెడల్స్, మెప్పులు అవసరంలేదు, కేవలం




మానవత్వం... మానవత్వం వుంటే చాలు. మానవత్వంతో ఆదుకున్నానుగానీ నేనో యువకుడిననో, నా రెండు చేతులూ బార్లా చాపి నా గుండె చూపించి హాయిగా నిద్రపో అని చెప్పడానికో చేయలేదు. అంతే"

"అయిందా? ఇంకా చెప్పేందుకేమైనా వుందా? "

సంపత్ మాట్లాడుతుంటే అక్షరం... అక్షరంలో పెదవి విరుపూ, వ్యంగ్యం తొంగిచూస్తున్నాయి. అది కనిపెట్టలేనంత చిన్నవాడేమీ కాదు మాధవ.

"చాలా వుంది. కానీ మీరు చీటికీమాటికీ వాచీ చూసుకుంటున్నారే. పోనీండి చివరిగా యిది వినండి. మీకు డబ్బువుంది. ప్రభు ఫామిలీ మెంబర్సందరూ మిమ్మల్ని గౌరవిస్తారు. మీ కుటుంబాన్ని యిష్టపడతారు. ఇటువంటి పరిస్థితుల్లో మీరు వెళ్ళి యీ విషయం వాళ్ళవాళ్ళతో చెబితే బావుంటుంది. కోకిలని 'కుంతీ కుమారి' బిరుదు నించి తప్పించండి"

వొళ్ళు మండింది సంపత్‌కి "చాలు నువ్వు చెప్పింది చెప్పావు. నాకు తోచింది చేస్తాను సరేనా? "

"ఛీ" మాధవ గట్టిగా అసహ్యించుకున్నాడు "మా అమ్మ ఎవరైనా మజ్జిగ కావాలి అంటే చెంబునిండా యిస్తుంది. అదే 'తోడు'కి ఓ చెంచాతో యివ్వండి అంటే చచ్చినా యివ్వదు.

ఎందుకు? అని అడిగాను. అప్పుడు అమ్మ చెప్పింది 'తోడు' యిమ్మంటే తోడబుట్టిన వాడిని యివ్వమని అర్థం అని. అమ్మ దృష్టిలో తోడబుట్టిన వాడు గొడుగ్గై కాపాడతాడని. కానీ యిలా!" మాధవ బుర్ర గట్టిగా విదిలించాడు. "మీలాంటి వాళ్ళు సిగ్గుపడాలి. మీ యిష్టం. వెళ్లండి" అనేశాడు నిర్మొహమాటంగా.

సంపత్ త్వరత్వరగా వెళ్ళిపోయాడు. మాధవ మిగిలిపోయాడు. సోఫాలో కూర్చుని రెండు చేతుల్తో జుట్టు పీక్కున్నాడు. కోపంగా వున్నాడు. కాస్సేపటికి స్థిమితపడ్డాడు. తను చదువుకోవాలి. తనకి ఎవరిగురించీ ఏమీ అవసరంలేదు. ఎవర్నీ తను ఆదుకోనవసరం లేదు. తను వినలేని చెవిటివాడు. మాట్లాడలేని మూగవాడు. తనకి ఏదీ కనిపించదు కూడా "ఓ దేవుడా కోకిలని కాపాడు" గట్టిగా అన్నాననుకున్నాడు. కానీ పెదవి విప్పలేదన్నమాట. నిశ్శబ్దంగా కోకిల సుఖంకోసం ప్రార్థించాడు.

కోకిల దగ్గరకి వెళ్ళి వచ్చినప్పటినుంచీ నిద్ర కరువైపోయింది. మంచంమీద వాలగానే నిద్రపట్టేసింది.

★ ★ ★

మర్నాడు హోటల్లో భోజనంచేసి యింటికి వచ్చాడు. మాధవ. అతని ప్రాణం హాయిగా వుంది. అంతక్రితం ఏమీ జరగనట్లు సోఫా దగ్గరకి వెళ్ళి "అమ్మా" అని పిలిచాడు. తండ్రి యింట్లోనే వున్నాడు. మాధవ భయపడలేదు. ఆయన్నీ పిలిచాడు. నారాయణరావు హాల్లోకి వచ్చి కొడుకుని చూస్తూనే మండిపడ్డాడు. కాత్యాయని అడ్డు వస్తున్నా అతను వినలేదు.

మాధవ గంభీరంగా కూర్చున్నాడు.

నారాయణరావు నిలకడగా వుండలేక అటూఇటూ తిరుగుతున్నాడు. "రాత్రంతా ఏ వూళ్లో వూరేగావు? "

మాధవ నెమ్మదిగా జవాబు చెప్పాడు. "డాడీ! రాత్రి మీకు బాగా కోపం వచ్చింది. నన్ను చూస్తేనే మీరు భగ్గుమంటున్నారు. ఎవర్నో బాగుచేయాలని వెళ్లిన నేను ముందు నన్ను నేను బాగుచేసుకోవాలనుకున్నాను. రాత్రి హోటల్లో వుండి యిదిగో యిప్పుడు వచ్చాను" అన్నాడు.

ఆయనోసారి కొడుకువైపు చూశాడు. మాధవ నిజంగానే హిందీలో అన్నట్లు 'లాఖోంమే ఏక్.' లక్షల్లో ఒకడు. కోపంతో ఆలోచించడంలేదుగానీ. నారాయణరావు

కొంచెం చల్లబడ్డాడు. ఒక కొడుకు ఒక కూతురు. కూతురు గురించి బెంగలేదు. తిరిగి చూడాల్సిన అవసరంలేదు. హాయిగా వుంది. వీడు కూడా ప్రొఫెషనల్ డిగ్రీ తీసుకుంటే తనకి అంతకంటే ఏం కావాలి? "

"డాడీ! నేను బ్రిలియంట్ మెటీరియల్ తెప్పించుకుంటాను. కృష్ణయ్య ఇన్స్టిట్యూట్‌లో చేరతాను. ఈసారి నాకు సీటు ఖాయం. మీరు వర్రీ అవద్దు. నేను కొంచెం పొరపాటు చేశానేమో అనిపించి ఈ డెసిషన్ తీసుకున్నాను"

"వెరీగుడ్" అనేశాడు ఆయన.

మాధవ వూపిరి పీల్చుకున్నాడు.

★ ★ ★

"శమంతా" కేక విని శమంత అటువైపు చూసింది. కోకిల తయారైంది. పిల్లవాడిని వుయ్యాల్లో పడుకోబెట్టి "తాళాలు ఇవిగో. 'ఈ షూ' ఏడిస్తే యిదిగో ఇక్కడ కావలసినవి వున్నాయి. నీవల్లగాకపోతే స్కూలుకి వచ్చేయ్.

"నడిచిరాకు. ఎండ చుర్రుమంటోంది. వడగాలి తగులుతుంది. ఆటో మాట్లాడుకో. వచ్చేముందు నువ్వో వుల్లిపాయ జాకెట్‌లో వేసుకో. మరో వుల్లిపాయ బాబు జేబులో వేయి. ఈషూకి ఆ వుల్లిపాయ గుచ్చుకోకుండా జాగ్రత్తగా తీసుకురా"

"ఇస్కూల్‌కి టైమైతున్నది గదమ్మ"

"ఓ" కోకిల కంగారు పడుతూ మరోసారి పసివాడిని గుండెలకి హత్తుకుంది. పెద్దగా శబ్దంచేస్తూ ముద్దుపెట్టుకుంది. ఆమె చేతికి అందించింది..

వెనక్కి చూస్తూ రెండు అడుగులు వేసి మరుక్షణం ముందుకు వెళ్ళిపోయింది. స్కూలుకి నడిచివెళ్ళడం అలవాటు చేసుకుంది కోకిల. 'ఈషు' ఏడిస్తే శమంత ఈ వయసులో ఆయాసపడుతూ నడుస్తూంటే చూసి తట్టుకోలేదు. కోటి విద్యలూ అన్నట్లే... పొట్టకోసం, మొహమాటంతో పిల్లాడిని ఎత్తుకునివస్తే తను చూళ్లేదు. అందుకే శమంతకోసం ఆటో డబ్బు దాచి వుంచుతోంది.

తనకీ, శమంతకీ కూడా ఆటో ఖర్చు భరించలేదు. ఫిబ్రవరి నెలాఖరు రోజులు. మార్చి నెల రాగానే స్కూళ్ళకి సగం పూటే. త్వరత్వరగా పనులన్నీ చేసుకుని మధ్యాహ్నం వరకూ పనిచేస్తే సగంపూట ఈషుతో ఉండొచ్చు ఆపైన ఏప్రిల్ నెలాఖరుకి స్కూళ్ళు మూసేస్తారు. మళ్ళీ స్కూళ్ళు తెరిచేసరికి వాడికి ఆరునెలలు దాటిపోతాయి.

ఇంత ధైర్యం, తెగింపు ఎక్కడినుంచి వచ్చింది?

"అమ్మ... అమ్మ... అమ్మ..."

ఈషూ అంటున్న మాటలు వినిపిస్తున్నాయి. మళ్ళీ హెచ్చరిస్తున్న మనసు, కళ్ళెం వేస్తున్న ఆర్థిక సమస్యలు.

నడుస్తుండగానే స్కూలు వచ్చేసింది.

ఇండియా ఈజ్ మై కంట్రీ...

ఫస్ట్ పిరియడ్

వరుసగా గంటలు దొర్లిపోతున్నాయి.

రోజూ వచ్చే శమంత ఈ మధ్యాహ్నం రాలేదు. ఒక్కసారి భయం వేసింది కోకిలకి.

"కోకిలా మదర్ పిలుస్తున్నారు" టీచర్ మేరీ చెప్పింది.

ఏదో ముఖ్యం అయిన విషయం లేకపోతే పిలవరు ఆమె. కొంచెం భయం వేస్తే వెంటనే సర్దుకుంది. మదర్ గదిలోకి రాగానే ఆవిడ "కూర్చోమ్మా" అంది.

కోకిల కూర్చుంది.

"మంచినీళ్ళు కావాలామ్మా" అడిగింది ఆవిడే.

"వద్దు మదర్" అంది. ఉన్నట్లుండి చమట పడుతుంటే చప్పున తుడుచుకుని "చెప్పండి మదర్" అంది.

మదర్ మాట్లాడలేదు. టేబుల్ సొరుగు లోంచి కవరు తీసి ఇచ్చింది. కోకిల జాగ్ర




త్తగా అందుకుంది. ఆ కవరులో కాగితం చేతికి తగలగానే కోకిల మెదడు వాకిళ్ళు తెరుచుకుని సమస్తం అర్థం అయిపోయింది. ఆ వెంటనే ప్రశ్నకి జవాబూ దొరికింది. మెల్లగా కవరు చింపి కాగితంమీదకి దృష్టి పోనిచ్చింది.

'కనుక మీ సేవలకి అభినందించి ఆనందిస్తూ మా పరిధిలో వున్న కట్టుబాట్లని అతిక్రమించలేని కారణంవల్ల మీరు మావద్ద పనిచేసేందుకు వీలుబడదని చెప్పేందుకు చింతిస్తున్నాం. దయతో ఈ సొమ్ము మీరు అందుకోవాలని కోరుతూ.

కరస్పాండెంట్.'

తనకంటే బలవంతుడు ఎదురుగా నిలుచుని సవాలు విసిరితే నీరుకారి పోవాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. ఆ సంగతి తెలిసే కోకిల మనసు నిబ్బరంగా వుంచుకుంది.

ముందు రోషంతో, ఉక్రోషంతో, కోపంతో ఆ డబ్బు తీసుకోకూడదనుకుంది.

అయినా తీసుకుంది.

ఆత్మవిశ్వాసం...

విద్యార్థులకి తను న్యాయం చేసిన తృప్తి...

అక్రమంగా, అన్యాయంగా సంపాదించిన డబ్బుకాదది. పవిత్రమైన ఉపాధ్యాయ వృత్తిలో చేసిన కృషికి ఫలితం. ఈ డబ్బు తనకి అవసరం. తన వెనుక ఈషూ వున్నాడు.

ఒక్కో అడుగూ వేస్తోంది.

టీచర్లందరూ బాధపడ్డారు.

సమాధానంగా చిన్న నవ్వు నవ్వింది.

'జంకులేదు, గొంకులేదు.

భయంలేదు, బాధలేదు'

'ఒకటీ... రెండూ, మూడు... అడుగు వెనుక అడుగు.

ముందుపడ్డ అడుగు. ముందు ముందు ముందడుగే... పిచ్చిపిచ్చిగా ఆలోచిస్తోందా?' రేపటినుంచీ తిరిగి వేట.

ఉద్యోగ ప్రయత్నం.

పొట్ట... జానెడు పొట్టకు బారెడు ఆకలి... 'ఓహ్... భగవంతుడా! బుర్ర వేడెక్కిపోతోంది. పగిలిపోతుందేమో. రెండు ముక్కలైపోతే'

కొబ్బరికాయ 'రెండుముక్కలు.

'తన తల కూడా!'

కోకిల ఆలోచనల్లోంచి బయటపడాలని చూస్తోంది.

'కోకిలా... ఓ కోకిలా...

'కొమ్మలో కోకిలా' సన్నగా పాడుకుంటోంది.

దెబ్బ తగిలిందమ్మా కోకిలకి.

'ఎక్కడ? ఎప్పుడు? ఎలా? ఎందుకు?'

అన్ని ప్రశ్నలా? దెబ్బమీద దెబ్బ కొట్టినట్లు.

'చిన్నారి కోకిల చక్కగా చదివితే డిగ్రీ సెకండియర్‌లో వుండేది. లేతమనసు ముదురు ప్రేమని ఇరికించుకుంది. మనసూ, ప్రేమతోబాటూ శరీరం కూడా ముదిరిపోయింది'

'కూ... కూ...' వేసవి వస్తోందన్నట్టు అదోరకమైన వింత వాసనలతో గాలి వీస్తోంది. వెంటనే నిప్పుని ఊదినప్పుడు వచ్చే సెగ. నిప్పురవ్వలు ఎగిరి మీదపడ్డట్లే.

కోకిల వీధులవైపు చూసింది.

ఎండకి సగం షట్టర్స్ మూసేసి తెరలు వేశారు.

కొన్ని చోట్ల వట్టివేళ్ళ తడికెలు.

నీళ్ళు చల్లుతుంటే ఆ చల్లని నీళ్ళు శరీరానికి తగిలి సువాసనలు వెదజల్లుతున్నాయి.

ప్రాణానికి హాయిగా వుంది.

రేపు పొద్దున్నే కొంపలంటుకుపోయినట్లు త్వరగా లేవక్కర్లేదు. ఈషూని సుఖంగా పడుకోబెట్టచ్చు తనకి తొందరైపోతుందని వాడినీ లేపేస్తోంది.

ఉరుకులూ, పరుగులూ.

ఇప్పుడా శ్రమలేదు.

ఎన్నాళ్ళీ సంబరం?

మరో జాబ్ దొరికేవరకూ.



చుట్టూ బోలెడు ఇళ్ళున్నాయి. ఎవరి ఇళ్ళల్లో వాళ్ళు వోపిక వుంటే నవ్వుతారు. లేకపోతే తలుపులు వేసుకుంటారు. ఎవరికీ తీరిక వుండదు.

సాయంత్రాలు ఆరుబయట కుర్చీలు వేసుకుని గంటలకొద్దీ కబుర్లుచెప్పుకుంటారు. దూరంనుంచే 'హాయ్ టీచర్', 'హలో డాక్టర్', 'హలో సిస్టర్' అదీ ఇష్టాన్ని బట్టి. లైట్లు వెలిగేవరకూ కూర్చుని ఆపైన తలుపులు వేసుకుంటారు. ఆ తలుపులు మళ్ళీ పొద్దున్న వరకూ తెరచుకోవు. తనూ తలుపు వేసుకుంటుంది.

ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురు చూస్తుంది. రాత్రంతా నిద్రవుండదు. తెల్లవారితే జైల్లోంచి వచ్చేసినంత రిలీఫ్. ఇంత క్రితం తనాయింట్లో ఒక్కత్తే ఉండేది. అప్పుడప్పుడు శమంత ఉంటుంది. టీవీలో మంచి సినిమా వస్తే సంతోషం ఆమెకి. సినిమాకంటే ముందే డైలాగులు చెప్పేస్తుంది. పాత సినిమా కాదు కొత్త సినిమాల్లో టీవీ అడ్వర్టయిజ్‌మెంట్లు పాడేస్తుంది. శృతీ, లయలు వుండవు. దంపుళ్ళ పాటలే. అన్నిటికీ ఒకేరకం వరుసలు. కోకిల ఆనందంతో నవ్వుకుంటుంది.

ఇల్లు వచ్చేసింది. గడప దాటబోతూ ఆగిపోయింది. శమంత పిల్లవాడిని గుమ్మాడి ఊగిస్తోంది. గుమ్మడిపండులా వున్నాడు వాడు. కళ్ళనిండా కాటుక, నుదుట పెద్దబొట్టు, దిష్టి తగలకుండా. వాడు వూగుతున్నప్పుడల్లా పకపకా నవ్వుతున్నాడు. నవ్వీ నవ్వీ చొంగ కారడంవల్ల తెల్లని జుబ్బా తడిసిపోయింది.

"మా నాయన... నా కొడుకే..." శమంత మురిసిపోతోంది.

కోకిలకి కడుపు నిండినట్లయింది. ఆ కల చెదిరిపోతుందేమో అన్నట్లు చప్పుడు చేయడంలేదు. అమ్మ మనసు ఎంత గొప్పది? తను లేకపోయినా తన కొడుకును తనకంటే బాగా చూసే శమంత వుంది. శమంత పిల్లవాడిని ఎగరేసి పట్టుకోబోయింది. తలెత్తినప్పుడు కోకిల గుమ్మానికి అతుక్కుపోయి వుండడం చూసింది.

"రామ్మా" అంది. కోకిల లోపలికి వచ్చి మంచంమీద కూర్చుంది. శమంత మంచి నీళ్ళు తీసుకువచ్చి కోకిలకి ఇచ్చింది.

రైళ్ళు పరుగెడుతున్నాయి.

అప్పటికీ ఇప్పటికీ తేడాలేదు.

'ఎలా వచ్చింది?'

"చాయ్ తీసుకురానామ్మా?"

"వూ..." పిల్లవాడిని అందుకుంది. తల్లి ఒళ్ళోకి చేరగానే వాడి కళ్ళు మూతలుపడడం ప్రారంభించాయి. వాడిని ఎదమీదకి తీసుకోగానే గుండెకి చిల్లు పడినట్లే ప్రేమామృతధారలు. వాడి తలమీద క్షీరాభిషేకం. వాడు ఉక్కిరిబిక్కిరై తల్లిపాలతో జలకాలాడుతున్నాడు. ఇంత అద్భుతమా ఈ ప్రేమ బంధం... 'ప్రభూ నీకు నీ కొడుకును చూడాలని లేదూ' కోకిల విలవిల్లాడుతోంది.

వాడి చేతి గుప్పిళ్ళని ముద్దుపెట్టుకుంది. శమంత టీ ఇచ్చింది. ఐదు నిమిషాల్లో 'ఈషూ' నిద్రపోయాడు. వాడిని పడుకోబెట్టింది.

టీ తాగాక పర్సు తీసింది. శమంత దూరంగా కింద కూర్చుని స్టీలుగ్లాసులో టీని 'వుఫ్' మని వూదుకుంటూ తాగుతోంది. నమ్మినబంటు... ఈ ఊరు వచ్చినప్పుడు తను మొట్టమొదట కలుసుకున్న మనిషి ఈ శమంతే.

"శమంతా... ఇదిగో ఈ డబ్బు తీసుకో" అని లెక్కపెట్టి ఐదువందలు ఇస్తూంటే, "ఎందుకమ్మా" అనడిగింది.

"తీసుకో. డబ్బు ఎందుకు? అని ఎవరైనా అడుగుతారా?"

"ఏంటి కిస్తున్నవమ్మా. మొన్న పైలికి ఇస్తివి గదమ్మ"

శబ్దంలేని నవ్వు విసిరేసి "ఉన్నప్పుడిస్తాను. లేనప్పుడు నువ్విస్తావు దానిదేం వుంది?" అంది.




"ఏమైందమ్మా గట్లున్నావ్?"

"ఏం లేదు"

"చిన్న మాటడగాలమ్మా?"

"అడిగేందుకేమీలేదు"

"గా దినము మస్తు బుగులైందమ్మ"

"ఏరోజు?"

"గదేనమ్మా... ఇల్లు కావల్నంటివి, గాపొద్దు. ఎంత ముద్దుగున్నవో, గన్ని సొమ్ములొన్ని వచ్చినవ్. గప్పుడే 'షక్' అయిందమ్మా. అయ్య ఎప్పుడొస్తడమ్మా"

"రాడు..."

"ఏంటికమ్మా?"

కోకిల నిట్టూర్చింది "అదంతే..."

"మంచోనిలెక్కనే గొట్టిండు"

కోకిల మాట్లాడలేదు.

"సప్పుడు చేస్తలేవు"

మంచంమీదకి చేరగిలి పడుకుంది. ఇక జవాబు దొరకదని తెలిసింది శమంతకి. లేచి గ్లాసులు తీసుకు వెళ్ళిపోయింది. 'చిన్ని చిన్ని ఆశ...' పాడుతోంది.

'ఎటూకానివేళ ఏం చిన్న చిన్న ఆశో' అనుకుంది కోకిల.

ఆ పాట అయిపోయింది. చీపురు శబ్దం తోపాటు శమంత గాజులు మోగుతున్నాయి. 'కొన్నాళ్ళు బాగానే గడుస్తాయి. మళ్ళీ వేట. ఎందుకీ ప్రయాస? ఇంటికి వెడితే'

ఛ... ఏం బావుంటుంది?

వాళ్లందరూ తనని నీచంగా చూస్తారు. ఆ చూపుల్ని తను భరించలేదు. ఆఖరికి అమ్మానాన్నా కూడా హీనంగా మాట్లాడుకుంటారు. తను తట్టుకోలేదు. అందరూ తనని చూడడానికి వస్తారు.

పైకి 'అయ్యోపాపం' అంటారు.

గడప దాటగానే' పొగరు. కొవ్వు' అన్నా ఆశ్చర్యపోనవసరంలేదు. తను ప్రభుమీద చర్య తీసుకోవడంలేదే? న్యాయ స్థానంవుంది. ఈ ఆలోచన ఎందుకు రాలేదు?

'ఎందుకంటే... ఎందుకంటే ప్రభు అంటే తనకి వల్లమాలిన ప్రేమ కనుక

ప్రేమ జీవితాన్ని మింగేసిన కొండచిలువలా వుంది.

అటువంటి ప్రేమను ఆరాధించడం.

'ఒద్దు కోకిలా ఒద్దు. నువ్వు నీ హక్కుని గుప్పిట్లోకి తీసుకో. పరువుప్రతిష్ఠలు గంగలో కలిసిపోయాక ఇంకా ఆలోచిస్తూ 'ప్రేమ' అంటూ జపం చేయడం ఫూలిష్‌నెస్' కోకిల మళ్ళీ నవ్వుకుంది. సినిమాల్లో మాదిరి రెండు కోకిలలు... ఒకటి తను... రెండోది 'తన 'ఆత్మ' తనని కంట్రోల్ చేస్తూ, సినిమా... సినిమా... సినిమా...లా

"పోయి రావాల్నామ్మా"

"ఊ..." అంది కోకిల.

శమంత పిల్లాడి దగ్గరకు వచ్చి మెటికలు విరిచి ముద్దు పెట్టుకుని మరోసారి చెప్పి వెళ్లిపోయింది.



లైట్లు వెలిగాయి. ఒంటరితనం పీతలా పట్టుకోబోతోంది. భోజనం చేయాలనిపించలేదు. ఈషూ ఇంకా పడుకునే వున్నాడు.

రాత్రి పన్నెండు గంటలయినా నిద్ర

రాలేదు.

ఈషా నిద్రలో అటూఇటూ కదులుతు న్నాడు. ఉన్నట్లుండి వాడు కెవ్వుమన్నాడు. కోకిలకి ఊపిరి ఆగిపోయినట్లయింది. చప్పున వాడిని ఎత్తుకుంది. వాడి ఏడుపు ఆగడంలేదు.

ఏమైంది?

వాడేం చెప్పగలడు?

చెవి, పొట్ట చూసింది.

రైళ్ల గోలలో వాడి ఏడుపు ఇరుగుపొరుగు వారికి వినిపించదు.

'భగవంతుడా!' రెండు చేతులూ జోడించి ప్రార్థించింది. ఏడ్చి ఏడ్చి కొయ్యబారి పోయేటట్టున్నాడు వాడు. శరీరం ముందు ఎరుపు రంగూ, ఆ తరువాత నీలిరంగులోకీ మారుతూంటే క్షణం కూడా ఆలోచించలేదు. పర్సు తీసుకుని ఆటో ఎక్కి హాస్పిటల్ కి తీసుకెళ్లింది.

కొడుకుని డాక్టర్ చేతిలో పెట్టేవరకూ ఊపిరి తీసుకున్న జ్ఞాపకం లేదు కోకిలకి.

ఓ చిన్న పొరపాటు జీవితాన్నే తలకిందులు చేస్తుంది. డాక్టర్ నవ్వి "నథింగ్ టు వరీ. జలుబు చేసింది. అందువల్ల చెవిలో పోటు వచ్చింది. మీ వెంట ఎవరూ రాలేదా, ఈ చీకట్లో...? "

కోకిల దగ్గర జవాబు లేదు.

డాక్టర్‌కి తెలుసుకోవాలన్న కుతూహలం అసలే లేదు. ఆయన డ్యూటీ డాక్టర్.

డాక్టర్ చేతిలో ఏ మహిమ ఉందో గానీ బెడ్ మీద హాయిగా పడుకున్నాడు.

"డాక్టర్! ఈ రాత్రికి ఇక్కడ ఉండమంటారా? "

"అవసరం లేదమ్మా! ఇంక గొడవ చేయడు" పిల్లల డాక్టర్ చిన్నగా నవ్వాడు. కోకిల వైపు దీర్ఘంగా చూస్తూ "బాగా హడలగొట్టేసినట్టున్నాడు. ఇంకా వయసు పెరుగుతూంటే తల్లితండ్రుల సింపతీ కోసం వేషాలు వేస్తారు. మనం తెలుసుకోలేం"





ఆయన మాట్లాడుతూంటే కోకిలకి క్షణ కాలం భయం ఎగిరిపోయినట్లు అయింది. అయినా డాక్టర్‌ని రిక్వెస్టు చేసింది. "మళ్లీ వీడికి ఏదయినా అయితే ఇంత దూరం రాలేను. ప్లీజ్, పొద్దున్నే వెళ్లిపోతాను"

డాక్టర్ పిల్లవాడి బుగ్గమీద చిటికెవేసి వాడిని చూస్తూ కోకిలతో "నా విజిటింగ్ కార్డు తీసుకోమ్మా. ఫోన్ నెంబరుంది. అవసరం అయితే నేనే వస్తాను" అన్నాడు.

కోకిల తల అడ్డంగా ఊపింది. "ఈ చీకట్లో నేను వెళ్లలేను"

డాక్టర్‌కి ఏదో అర్థం అయింది. "ఓ. కే" అనేసి రౌండ్స్‌కి వెళ్లిపోయాడు.

కోకిలకి ఆ వాతావరణం నచ్చింది. 'పిల్లల ఏడుపూ, తల్లుల లాలింపూ... సందడి. అందులో పంచుతున్న ఆనందం... అది తనవరకూ వచ్చింది'

'భగవంతుడా ఎంత దయ నీకు? ' తల పైకెత్తి సీలింగ్ వైపు చూస్తూ దణ్ణం పెట్టుకుంది. అసహాయ స్థితిలో మనిషి తలుచుకునేదీ, ఆశ్రయించేదీ భగవంతుణ్ణే. ధైర్యం వచ్చింది. ప్రాణం తేలిక పడింది.

★ ★ ★

మర్నాడు డిశ్చార్జ్ చేసే ముందు డాక్టర్ గదిలోకి అడుగుపెట్టిన కోకిలని "రామ్మా" అని, ఆమె రాగానే "కూర్చో" అన్నాడాయన, ఎదురుగా ఉన్న కుర్చీ చూపిస్తూ.

హాస్పిటల్‌లో డెట్టాల్, ఫినాయిల్ వాసన గమ్మత్తుగా ముక్కుకి తగులుతోంది. ఆరోగ్య సూత్రాలకి సోపానంలా విశాలమైన కిటికీల్లోంచి వేప చెట్ల మీంచి గాలి తోసుకు వస్తూంటే మనసుకి ఆహ్లాదంగా వుంది. 'కేర్, కేర్' మంటున్నారు పిల్లలు కేర్ తీసుకోమంటున్నట్లు.

కోకిల కూర్చుంది. ఏ ఉపోద్ఘాతం లేకుండా చెప్పింది. "నా పేరు కోకిల. ఇంజనీరింగ్ మొదటి సంవత్సరం డిస్‌కంటిన్యూ చేశాను. ఇంగ్లీషు మీడియంలో చదివాను. నాకు జాబ్ లేదు. నెలా రెండు నెలలయితే వీడితో వీధిన పడాలి. మీ హాస్పటల్‌లో

# ఏరిన ముత్యాలు

★ ఇతరులకు మేలు చెయ్యడం నీకు నువ్వు మేలు చేసుకోవడమే.

-ఫ్రాంక్లిన్

★ ఇతరులను జయించినవాడు ధైర్యశాలి, తనను తాను జయించిన వాడు మహనీయుడు.

- వివేకానంద

★ శమ సర్వత్రా జయిస్తుంది.

- హోమర్

★ ఒరనుంచి తీసిన కత్తివంటి బహిరంగ శత్రువు కంటె మంచిగా ఉంటూ హాని చేసే బంధువు ప్రమాదకరం.

- తిరుక్కురళ్

★ శ్రామికోద్యమానికి పరాజయం అంటూ లేదు.

- ఇ.వి.డెబ్స్

★ భాష, వాక్కు మనిషికి దేముడిచ్చిన వరాలు.

-ఎన్. వెబ్‌స్టర్

★ భోగట్టాను పెంచుకునేవాడు దుఃఖాన్ని పెంచుకుంటాడు.

- ఎక్లెసియా స్టీన్

★ జీవితంలో దుర్వినియోగం చేసే భాగమే జీవితభారాన్ని పెంచుతుంది.

- రూసో

★ మనకు సంబంధంలేని పనులు చెయ్యడం సోమరితనం కంటే హీనం.

- గ్రేసియస్

★ సంఘంలో ఆచారాలు పరిపాకం చెందిన అనుభవాల ఫలితాలు. కొంత వరకూ మనం వాటికి తల వంచక తప్పదు.

- ఏ.ఏ.హార్జ్

★ లోపాలు లేని మనిషి అంటూ ఉండడు. తక్కువ లోపాలున్నవాడే ఉత్తముడు.

- హరేస్

★ మనం చేసే ఘనకార్యాల వెనుక ఉన్న మన స్వార్థం లోకం కంటపడితే తరచూ మనం సిగ్గుపడవలసి వస్తుంది.

- రోచెఫొకాల్ట్

★ అప్పు చెయ్యడంతో పోలిస్తే బిచ్చం ఎత్తుకోవడమే గొప్ప.

- లెస్సింగ్

★ పిల్లలు అక్కరలేని వారు పెళ్లి చేసుకోవడం అనవసరం.

- మహాత్మాగాంధీ

సేకరణ: పి.వి.రమణకుమార్

ఏదయినా పని ఇస్తారని..." అంతే...

డాక్టర్ ఘొల్లున నవ్వాడు. "సినిమాలు ఎక్కువగా చూస్తావామ్మా? "

కోకిల ఉలిక్కిపడింది. సర్దుకుని "మీ కెలా తెలుసు? " అని అడిగింది.

"నేను చూస్తానులే. అందుకు"

"వావ్" అరిచినంత పని చేసి "మీరు... మీరు... ఈ వయసులో" నమ్మలేకపో తోంది.

"ఏం నేను చూడకూడదా... అమితాబ్ బచ్చన్ ఇష్టం, అలానే ఆఫ్తాబ్ ఇష్టం... అంతకుముందు అశోక్‌కుమార్ ఇష్టం... నాకూ డాన్స్ చేయడం వచ్చు"

"ఓ... హ్హో..." అంది సంతోషం పట్టలేనట్లు. మళ్ళీ సందేహంగా చూస్తూ, "నిజంగానా, వేళాకోళమా? " అనడిగింది.

"నిజమే"

"అసలు మీకెందుకీ అనుమానం వచ్చింది సర్"

ఆయన తాపీగా వెనక్కివాలి కూర్చుని చెప్పాడు. "హాస్పిటల్ ఇది. ఇక్కడ చుట్ట గానీ, సిగరెట్‌గానీ తాగకూడదు. నిషిద్ధం. లేకపోతే ఓ హీరో లెవెల్లో సిగరెట్‌ని రింగులుగా ఊది నిన్ను అలా ఫ్లాష్ బాక్‌లోకి పంపేవాడిని. అఫ్‌కోర్స్ నేనూ నీతో బాటే వచ్చేవాడిని"

"చెప్పండి"

"మధ్యలో ఊపిరి పీల్చుకోనా" అని తిరిగి, "నువ్వు పిల్లవాడికి ఏమైందో అని కంగారు పడుతూ వచ్చావు. అంతవరకూ ఓ.కే. రాత్రి నేను డిశ్చార్జ్ చేయబోతుంటే పొద్దున్న వెడతానన్నావు. సరే... పొద్దున్నే అదే డాక్టర్‌ని జాబ్ అడిగావు. ఇలాంటివి చిటికెలమీద అయిపోతాయి. అటువంటి సీన్లు కేవలం సినిమాల్లోనే చూస్తాం. నిజ జీవితంలో ఇవన్నీ అంత ఈజీగా జరగవు.

"ఈ హాస్పిటల్‌కి రావడం నీకిదే మొదటిసారి. నీకూ నాకూ మధ్య ముఖ పరిచయం కూడాలేదు. పేషెంట్‌ని తీసుకువచ్చేప్పుడు మనకి ముఖపరిచయాలూ, బంధుత్వాలూ వుండక్కర్లేదు. మొదటి పరిచయంలోనే నేను జాబ్ ఎలా ప్రొవైడ్ చేస్తాననుకున్నావమ్మా. నువ్వెవరో, నీ బంధువర్గం మొదలైన బాక్‌గ్రౌండ్ తెలియకుండా అందుకు సినిమాలు చూస్తావామ్మా అని అడిగానంతే" అన్నాడు.

కోకిల మొహం చిన్నబోయింది. తల దించుకుంది. నెమ్మదిగా "సారీ" అంది.

"అరెరె...రె. సారీ చెప్పేంత తప్పేం చేయలేదు కోకిలా నువ్వు. సినిమాలోనేకాదు నిజంగా కూడా ఇలాంటి సంఘటనల్ని మనం ఎక్స్‌పెక్ట్ చేయచ్చని నేను చూపిస్తాను"

చివ్వున తలెత్తిన కోకిల "దేవుడా" అంది.

డాక్టర్ చిత్రంగా చూసి నవ్వాడు. "చేతకానప్పుడే కాదు చేతనైనప్పుడు కూడా 'దేవుడా' అంటే బావుంటుందేమో" అన్నాడు. కోకిల నవ్వింది.

"నేను డ్యూటీలో ఎప్పుడు చేరను? " అనడిగింది.

"ఇప్పుడే. అదీ నీకు వీలైతే" అని ఆయన ఆప్రాన్ చేతిమీద వేసుకుని లేచి నిలబడ్డాడు.

"టర్మ్స్ అండ్ కండిషన్స్ లేవా డాక్టర్" అనడిగింది.

"ఇప్పుడు అనవసరం. నువ్వు జాయిన్ అయిన వెంటనే ఫోన్ చేయి" ఆయన అడుగు ముందుకు వేయబోతుంటే జారిపోబోయే క్షణాన్ని పట్టుకుంటున్నట్లు "ఇంటికెళ్ళి వచ్చి చేరతాను డాక్టర్" అంది.

ఆయన డాక్టర్ శేషాద్రి. హాస్పిటల్‌కి దగ్గరలోనే ఆయన ఇల్లు వుంది. ఆయన భార్య రేఖారాణి. గైనకాలజిస్ట్. పిల్లలు కూడా డాక్టర్లే. ఆయన ఆగి కోకిల భుజం తట్టి "ధైర్యంగా వుండు. 'ఫేస్ ఈజ్ ద ఇండెక్స్ ఆఫ్ ద మైండ్'. నిజానికి సినిమాలు నేనూ చూస్తాను. నేను పెద్దవాడిని కనుక





సినిమా వేరు, జీవితం వేరూ అని తెలుసు కోగలను. నువ్వలా కాదు. ఈ తరం పిల్లవి. ఆ గాలి నీకూ సోకింది. యా మై కరెక్ట్" అని వెళ్ళిపోయాడు.

'మై గాడ్' అంది కోకిల. ఆయన వెనక్కి తిరిగి చూసి నవ్వి కారెక్కాడు.

ఇంటికి చేరుకునేసరికి పదిగంటలైంది. కోకిలకి కంగారుగా వుంది. శమంత వచ్చిం దోలేదో అని ఆటో దిగుతూనే చూసింది. గోడకి దగ్గరగా వున్న రాయిమీద చెంపకి చేతిని ఆన్చుకుని కూర్చుంది.

ఆటోలో వున్న కోకిల ఊపిరి పీల్చు కుంది. నమ్ముకున్నందుకు గొప్పతనాన్ని నిశ్శబ్దంగా చూపిస్తుంది. ఈ టైంలో తను లేదని ఇంటికి వెళ్ళిపోయి వుంటే తనకెంత కష్టం అయ్యేది?

ఇంటిముందు తుడిచి నీళ్ళు చల్లి ముగ్గు కూడా వేసింది. వాకిటి తాళం చెవి డూప్లి కేట్ శమంత దగ్గర వుంటుంది. ఆటో లోంచి కోకిల దిగబోతుంటే చప్పున వెళ్ళి చంటివాడిని పట్టుకుంది. వాడు రాత్రంతా నిద్రలేకపోవడంవల్ల లేవలేదు. వాడిని గుండెలకి అదుముకుంది. ముద్దు పెట్టు కుంది. ఒక్కసారి దుఃఖం పొంగుకు వచ్చే సింది. ఆటోకి డబ్బు ఇచ్చేసి పంపేసింది కోకిల.

"ఏమైందమ్మా. ఏడికి పొయ్యొస్తున్నవ్. ఎప్పుడు పోయినవ్" ప్రశ్నలే ప్రశ్నలు. ఇంటి తాళం తీసి పిల్లవాడిని పడుకోబెట్టాక శమంతని ప్రశ్నలు వేయనీయలేదు. కోకిల "రాత్రంతా..."

పూర్తిగా విన్న తరువాత కస్సుమంది శమంత. "నువ్వు పైసలిస్తవ్, నేను పన్జేస్త నమ్మా. రాత్రిల్ల పిల్లగాని ప్రాణం మంచిగ లేకుంటే గాయింట్లనో, గీఇంట్లనో, కాల్మొక్కో, బత్మిలాడో తీస్కపోనుంటివి. యీయాల్రేపు దినాలెట్లున్నయ్. సీన్మలల్ల జూస్తలేమూ? పైసలియ్యకుంటే పొడుస్తరు, పెయ్యి యియ్యకుంటే చంపి పార..." బూతు...

"షటప్..." వినలేనట్లు చెవులు మూసు కుంది కోకిల.

"మీ లెక్క సదుకున్నమా ఏంది? మంచి మాటలు మాకెట్లొస్తయ్. మీ సదూకున్నోళ్ళ కున్నట్లు మాకు ధైర్యముండదమ్మా. ఎట్ల బత్కుదమనుకున్నవమ్మా... ఎప్పటికీ నీతాన్నే వుంటననుకుంటున్నావా. ఇప్పు డుంట, జరైనాక బత్కుతనన్న భరోస లేక పోయె. ఏడ్కపోతవ్? ఏడుంటవ్? గాదిన మొచ్చిండు గా పెద్దమడిసిని పిలిపియ్యరా దమ్మా"

కోకిల నవ్వి "కొంచెం ఓపిక పట్టు శమంతా. నేను సుఖంగానే వుంటాను. నువ్వే చూస్తావుగా" అంది.

కోకిల పిల్లవాడికి స్నానం చేయించి శమంతకి అప్పచెప్పి హాస్పిటల్‌కి వెళ్ళింది.

శమంత ఏమీ అనలేకపోయింది.

"ఎట్ల జరగాల్నుంటే గట్లనే జరుగు తది" అనుకుంది.

★ ★ ★

హాస్పిటల్‌లో మూడు షిఫ్టులుంటాయి. ప్రతి షిఫ్ట్‌లో వారంరోజులు పనిచేయాలి. కోకిలకి మాత్రం రెండు షిఫ్టులే వున్నాయి. చంటిపిల్లవాడి కారణంగా రాత్రి డ్యూటీ కోకి లకి లేదు. కోకిలకి పనివత్తిడి కూడాలేదు. ఏ పనినైనా నిమిషాల్లో చేయడం ఈమధ్య కాలంలో అలవాటైపోయింది.

హాస్పిటల్లో రోజులు ప్రశాంతంగా గడిచి పోతున్నాయి. డాక్టర్ శేషాద్రి కోకిలకి ఎక్కువ జీతమే ఇస్తున్నాడు.

"అత్తుంటున్నడమ్మా ఈశయ్య" శమంత రోజుకో కబురు చెబుతుంది.

కోకిల వచ్చే టైమ్‌కి ఈషూ గడపవైపు చూపిస్తాడు.

శమంత ఆ టైమ్‌కి అన్నిపనులూ ముగిం చుకుని వాణ్ణి తీసుకుని ముందేవెళ్ళి

కూర్చుంటుంది.

"తాతన్నాడమ్మా?"

వాణ్ణి ఎగరేసి ముద్దు పెట్టుకుంటుంది.

★ ★ ★

కోకిల ఆరుబయట కూర్చుంది. చాలారోజుల తర్వాత అందరూ గుర్తొస్తున్నారు. జ్ఞాపకాలని సమాధి చేసేసి సుఖంగా వుంటూంటే సమాధి గోడలు పగిలిపోయాయెందుకు?

జ్వరంతో ఒళ్లు సలసలా కాగుతోంది. చలికి శాలువ కప్పుకుంది. దూరంగా శమంత వాడిని ఎత్తుకుని ఇటూ అటూ తిప్పుతోంది. అప్పుడప్పుడు వాడు తల్లికోసం ఏడుస్తున్నాడు. రెండు రోజుల్నుంచీ హాస్పిటల్‌కి వెళ్లలేక డాక్టర్ శేషాద్రికి ఫోన్ చేసి చెప్పింది.

ఆయనే రెండు రోజులూ వచ్చి కావలసిన మందులూ ఇంజక్షన్లూ ఇచ్చి వెడుతున్నాడు.

చెప్పలేనంత సంతోషం వేసింది కోకిలకి. డాక్టర్‌గారికి సినిమాపిచ్చి వుండడం తన పాలిట ఓ పెద్ద వరం అయిపోయింది. ఆయన మాట్లాడుతుంటే ఇంకా ఇంకా వినాలని వుంటుంది. ఓ గంటసేపు సినిమాలూ, షికార్లూ, సంగీతం, సాహిత్యం అప్పుడప్పుడు దయ్యాలూ, జ్యోతిషం, చావుపుట్టుకలు, పునర్జన్మలు, బేల్‌పూరి, మసాలవడ ఒకటేమిటి కబుర్లే కబుర్లు. టైమ్ కూడా తెలియనంత. వున్నట్టుండి డాక్టర్ పరిగెత్తుతాడు. చాలా సేపటికిగానీ ఆ మత్తు వదలదు. వదిలిన తర్వాత చీకటి... ఒంటరితవానికి.

డాక్టర్‌గారు రోజూ వస్తే బావుండేది.

జాబ్ చేయకుండా ఆయన కబుర్లు వింటూ వీడిని చూసుకుంటూ బతికితే అంతేచాలు.

కొరడాతో కొట్టినట్లయి అటూ ఇటూ పచార్లు చేసింది. చివరికి ఆరుబయట కూర్చుంది. తను మోసం చేస్తోంది. ఎవర్ని? ఎవర్నో చేయడం తనకేం చేతనౌను. తనని తానే మోసం చేసుకుంటోంది. తను లేనిపోని భేషజానికి పోయి ఇల్లు గురించి ఆలోచించడంలేదు. ఇలా ఇంకా ఎన్నేళ్లు? నీడలా పట్టుకుని వదలకుండా పీడిస్తున్న ఈ జీవితానికి ఇంక గుడ్‌బై చెప్పేస్తే హాయిగా తీయగా...

కోకిల పాట పాడుతుంటే దూరం నుంచి శమంత కసురుకుంది "జ్వరం తగ్గలేదు. ఇంట్లకు పోయి పండుకోరాదమ్మ"

శమంతని ఇబ్బంది పెడితే ఆవిడ రాకపోతే తన పని గోవిందే. కళ్లల్లోంచి సెగలూ పొగలూ ఆవిర్లు వస్తున్నాయి. తను ప్రభుని వదిలి పెట్టేసింది. ప్రేమ... వినేందుకు బానేవుంది. ప్రభు గురించి మాధవతో చెప్పాలి. బస్ ఖతం... అయిపోయింది. ఈ ఐడియా ఇన్నాళ్లూ రాలేదేం. ఇప్పుడు తప్పసరిగా వచ్చేసింది. నయం ఇప్పటికైనా మనసు, కళ్లు తెరుచుకున్నాయి.

"శమంతా"

"ఏందమ్మా"

"ఫోన్ చేసి వస్తాను"

"డాక్టర్‌కామ్మా"

"వుహూఁ"

శమంత బుర్ర వూపి "పెయ్యికాల్తా వుంది, ఎట్లెల్తవమ్మ" అని అడిగింది.

"ఇదిగో ఇలా" నీరసంగా నవ్వింది.

ఫోన్ చేసేందుకు చాలాసేపు పట్టింది. ఎన్నిసార్లు ఫోన్ చేసినా మాధవ తల్లో తండ్రో తీస్తున్నారు. తను పెట్టేస్తోంది.

ఆఖరిసారి ప్రయత్నం చేసింది. ఫోన్ అవతల మాధవ తల్లి "నీకే అయివుంటుందిరా మాధవా! ఈమధ్య ఆడపిల్లలకి తమాషా అయిపోయింది. మగ పిల్లల్తో తిరగచ్చు, ఆడొచ్చు పాడొచ్చు హోటళ్లకి షికార్లకీ బైక్‌మీద వెనకాల కూర్చుని ముందు నడిపేవాడి మొహంలోమొహం పెట్టి వూరేగి రావచ్చు కానీ వాడి తల్లి ఫోనె

త్రితే చాలు రక్కున పెట్టేస్తున్నారు"

కోకిలకి వినిపిస్తోంది.

"బొత్తిగా వెన్నెముకలేని మనుషులు. ప్రేమించడంలో వున్న ధైర్యం ఎదుట పడి మాట్లాడడంలో వుండడం లేదు" ఆవిడ అంటోంది.

"అమ్మా" మాధవ పలికాడు.

"ఈ ఫోన్ తమరికే తీసుకోండి" వ్యంగ్యంగా అంటోంది ఆవిడ.

మాధవ "హలో' చెప్పగానే ప్రాణం లేచి వచ్చినట్లయింది కోకిలకి. "మాధవా నేను" అంది దుఃఖాన్ని అదిమేస్తూ సంతోషాన్ని, సంభ్రమాన్నీ కంట్రోల్ చేసుకుంటూ.

క్షణం జవాబురాలేదు.

"హలో మాధవా" కోకిల మళ్లీ పిలిచింది.

"చెప్పరా అరుణ్" అన్నాడు మాధవ.

"నేనూ కోకిలని" కోకిలకి అనుమానం వేసింది.

"చెప్పమంటున్నానుకదరా" మాధవ కొత్తగా మాట్లాడుతున్నాడు "చెప్పు" మాధవ రెట్టించాడు.

"మాధవా... ఏడాదైపోయింది వాడు పుట్టి. రెండ్రోజుల్లో వాడి పుట్టినరోజు. నువ్వోసారివచ్చి వెళ్లు. ఈసారి నిన్ను బాధ పెట్టను. జస్ట్ వాడిని చూసి వెళ్లు"

"సరే" ఇబ్బందిగా వుంది అతని స్వరం.

"ప్లీజ్... ప్లీజ్" అంటోంది కోకిల.

"ఎల్లుండి వెడదాం" అని "ఎల్లుండి తప్ప కుండా కలుస్తావ్రా బాబూ" అతని గొంతులో ఇబ్బంది. అప్పుడు అర్థం అయింది కోకిలకి. మాధవ తల్లి అక్కడే వుండివుంటుంది. నీరసంగా ఇంటికి వచ్చే సింది.

"ఇంటికి పొయ్యొస్త" శమంత లేచి వెళ్లేం దుకు సిద్ధం అయింది. కోకిల బుర్రవూ పింది.

"పిలగాన్ని తోల్కపోత, బిరాన అస్త"

కోకిల వింది. మంచంమీద దుప్పటి కప్పుకుని ముడుచుకుంది. ఎల్లుండి... ఎల్లుండి. పెదవులు కదులుతున్నాయి. కళ్లు చెమరుస్తున్నాయి. శమంత వద్దు అని చెబుతున్నా వినకుండా ఫోన్ చేసేందుకు వెళ్లింది. రాగానే ఇదిగో ఇలా మంచం మీద వాలిపోయింది. ఒళ్లంతా విపరీతమయిన నొప్పులు. మాధవ రాడూ రాడు.. రాడు... రాడు. డాక్టర్ వచ్చి చూసి వెళ్లాడు వైరల్ ఫీవర్. శమంత ఇంట్లో చెప్పి వస్తుంది.

"అమ్మా" అప్పుడే గంటపైనే అయింది శమంత వెళ్లి. వచ్చేసింది. పిల్లవాడికి అన్నం పెడుతూ పాట పాడుతోంది. అన్ని పనులూ చకచకా చేస్తుంది. 'చందమామ రావె'.

కోకిల నవ్వుకుంది. అదో ప్రపంచం. అందమైన ప్రపంచం ఆమెది.

రాత్రి ఈషాని తన పక్కనే పడుకోబెట్టు కుంది. రాత్రిపూట స్టేషన్లో గోల జోలపా టలా వినిపిస్తుంది. సందడేసందడి.

★ ★ ★

ఉదయం ఎనిమిది గంటలు కావస్తోంది. గూడ్స్‌బళ్లు. పొగలోంచి బొగ్గువాసన. పొగలు ఆకాశాన్ని చుట్టేసి సూర్యుడు మబ్బుల్లో చిక్కుకుపోయినట్లున్నాడు. నులి వెచ్చని వాతావరణంలో హాయిని అనుభవి స్తున్నారు.

డాక్టర్ శేషాద్రి కారు ఆగిన శబ్దం అయింది. ఆయన నడుస్తుంటే బూట్లు టక టకమంటున్నాయి. మనసు చెప్పే మాట శరీరం వినడంలేదు. నీరసం లేవనీయడం లేదు. డాక్టర్ గుమ్మందాటి లోపలికి వచ్చాడు. ఇంట్లో ఎవరూ కనిపించరు. పనావిడ మాత్రం 'నమస్తే అయ్యా' అంటుంది. గదిలోకి వెడితే గోడలన్నీ బోసిగా వుంటాయి. ఎవరి ఫొటోలూ వుండవు. వివరాలేవిటో తెలియదు. డాక్టర్ శేషాద్రికి పీకలదాకా కోపం వచ్చింది. పద్దెని మిదికీ పంథొమ్మిదికీ మధ్య వుంటుంది కోకిల వయసు.



ఆ తల్లితండ్రులు ఎలా నిద్రపోగల్గుతున్నారు? పోతే పోయిందనుకునేవాళ్లు కూడా వున్నారా? ఛ... తను మాత్రం ఎంతకాలం రాగలడు? వాళ్ల వాళ్లెవరైనా తెలుస్తే తనే స్వయంగా వెళ్లి అప్పజెప్పి చివాట్లు పెట్టి వచ్చేవాడు.

"కోకిలా"

కోకిల కళ్లు తెరిచి లేచి కూర్చుంది.

ఆయన ఆలోచనల్ని కట్టిపెట్టి ఆమె దగ్గరకి వచ్చి పల్స్ చూస్తూ "ఎలా వున్నావు" అని అడిగాడు.

కోకిల నవ్వింది.

"ఎందుకు నవ్వుతున్నావు?" అని అడిగాడు.

"పల్స్ చూస్తూ అడుగుతూంటే నవ్వొచ్చింది"

"జోకా"

అప్పుడూ నవ్వింది కోకిల. అచ్చం సినిమాల్లో వాళ్లల్లా.

"చాలు" డాక్టర్‌కి కోపం వచ్చింది. జీవితాన్ని ఎంత తేలికగా తీసుకుంటోంది? అంతలోనే మామూలుగా అయి "కోకిలా! కొద్ది తెలివితేటలుపయోగిస్తే ఎదుటివాడు ఎక్సరే ఫొటోలా కనిపిస్తాడు. మీ ఇంటి అడ్రసు ఇస్తే నేను వెళ్లి పరిస్థితుల్ని చక్కబెట్టి వస్తాను" అన్నాడు.

కోకిల మాట్లాడలేదు.

డాక్టరే మళ్లీ పిలిచాడు "కోకిలా"

కోకిల జవాబు చెప్పలేదు.

డాక్టర్ లేచి ఇల్లంతా పరికించాడు.

ఎక్కడా మగతోడు జాడ కనిపించడం లేదు.

శమంత పిల్లవాడిని ఎత్తుకునే తన పని తను చేసుకుంటోంది. డాక్టర్ శేషాద్రి పసివాడిని దగ్గరికి పిలవగానే వాడు ముందు బిడియపడ్డాడు. శమంత వాడిని ఆయన చేతికిచ్చింది.

కోకిల రెప్పవేయకుండా చూస్తోంది.




ఏ సంబంధమూ లేని డాక్టర్ ఇంత శ్రద్ధ తీసుకోవడం ప్రాణానికి హాయిగా వున్నా ఈ బంధం కూడా తెగిపోతుందేమో అన్న భయం క్షణం వణికించింది.

తనెందుకు పారిపోయి వచ్చింది?

నవ్వుకుంది. 'అదంతే తన ప్రేమ గుర్తు వాడు. వాడిని పుట్టకుండానే చంపేస్తారనే భయంతో వచ్చేసింది. తన తెలివి తేటలు ప్రభు అందం... వాడు తన వూపిరి, ప్రాణం' తెగించి వచ్చేసింది. అప్పుడు వాడు కడుపులో వుండడంవల్ల ఒంటరితనం ఆలోచనే రాలేదు. కానీ ఇప్పుడు...

ఓహ్ తల పగిలిపోతోంది.

డాక్టర్ శేషాద్రి పిల్లవాడిని శమంతకి ఇచ్చి లోపలికి వచ్చాడు. "కోకిలా" అని పిలిచాడు.

కోకిల వులిక్కిపడింది.

"నేను సీరియస్‌గా చెబుతున్నాను మీ వాళ్ల అడ్రస్ ఇవ్వు"

కోకిల కళ్లు రెపరెప లాడించింది. శమంతవైపు చూసి "టీ తీసుకురా రెండు కప్పులు" అని "నేను జస్ట్ మొహం కడుక్కుని వస్తాను. ఓకే" అని అంటూ "ఇలాంటివి సినిమాల్లోనే సాధ్యం అవుతుంది. ఎక్కడ మీరు? ఎక్కడ నేను? ఏదైనా ఓ పని చేస్తే అతికినట్లుండాలి. సినిమాటిక్‌గా కాదండి బాబూ" అనేసి బాత్‌రూమ్‌వైపు దారితీసింది.

"కోకిలా అల్లరి చేస్తున్నావు" డాక్టర్ గట్టిగా అన్నాడు.

కోకిల విన్నదిగానీ జవాబు చెప్పలేదు. ఇరవై నాలుగు గంటలు ఓపిక పడితే మాధవ వచ్చేస్తాడు. ఆ తర్వాత ప్రభు సంగతి చూసుకోవచ్చు

"పాపం డాక్టర్‌కి ఎంత దయ"

డాక్టర్లు అందరూ ఇలాగే వుంటారా? లేక పిల్లలు సున్నితంగా వుంటారు కనుక పిల్లల డాక్టరే ఇలా వుంటారా. బాత్‌రూమ్ లోంచి వచ్చేసరికి కొంచెం ఓపిక వచ్చినట్లయింది కోకిలకి.

వేడివేడి టీ తీసుకున్నారు ఇద్దరూ.

"నువ్వు నాతో మా ఇంటికి వస్తావా కోకిలా" అన్నాడు డాక్టర్ శేషాద్రి.

"మరో షాకు. ఎందుకండీ బాబూ షాకులమీద షాకులిస్తూ నన్నిలా చంపుకు తింటున్నారు. ఇవన్నీ మన జీవితాల్లో జరిగే పన్లు కావు. ఓ పేషెంట్ ని హాస్పిటల్ కి పిలిచి ఆ తర్వాత ఆరోగ్యంతో ఇంటికి పంపేయాలి. అంతేగానీ డాక్టర్లు ఇంత దగ్గరగా పేషెంట్ల జీవితాల్లోకి వచ్చేయడం కుదర్దేమో"

డాక్టర్ లేచి పచార్లు చేస్తుంటే ఫక్కున నవ్వింది కోకిల.

"అకారణంగా ఎందుకు నవ్వుతున్నావు? "

కోకిల గంభీరంగా చూస్తూ "ఇలా కుర్చీలోంచో, సోఫాలోంచో లేచి పచార్లు చేస్తూ విషయాన్ని చెప్పడం కూడా వెండితెరని గుర్తు తెస్తుంది" అంది.

డాక్టరు చప్పున కుర్చీలో కూర్చుని నిశ్శబ్దంగా ఇంటిని పరికిస్తున్నాడు. మౌనం, నిశ్శబ్దం ఆ క్షణంలో చాలా నచ్చాయి కోకిలకి. డాక్టర్ లేస్తూ "కోకిలా మా ఇంటికి పోదాం" అని శమంత వైపు చూసి "పిల్లవాడిని తీసుకుని పదమ్మా" అన్నాడు.

శమంత అయోమయంగా చూసింది.

మంత్రం వేసినట్లు అతని వెనుక బయలుదేరి ఆయన పక్కనే ముందు సీట్లో కూర్చుంది.

మెడుల్లా ఆబ్లంగేటా పని చేయనట్లు శరీరం కదులుతోంది. మెదడు ఆలోచించడంలేదు. మొద్దుబారిపోయినట్లు అయింది.

డాక్టర్ కారు గేట్లోంచి వచ్చి ఆగింది. కారు డోర్ తెరచి రండి అని లోపలికి తీసుకు వెళ్లాడు. రేఖారాణి ఎదురు వచ్చి రండి కూర్చోండి అంది. శమంత ఒళ్లో పిల్లవాడు లేచి తిరుగుతుంటే గార్డెన్‌లోకి తీసుకువెళ్లింది.

డాక్టర్ రేఖారాణీ శేషాద్రి అక్కడే కోకిల పక్కన కూర్చుంది. కోకిల ఆవిడవైపు చూసింది. అచ్చం అమ్మలాగే వుంది ఈవిడ. శ్వాసని కూడా జాగ్రత్తగా అదుపులో పెట్టుకుని రెప్పవేయడం మరిచిపోయింది.

ఆవిడ కోకిల చేతిని తన చేతిలోకి తీసుకుని సున్నితంగా నిమిరి "డాక్టర్‌గారు చెప్పారు. ఆయన చెప్పినట్లు వినమ్మా" అంది.

"ఏం చెప్పారు? " తృళ్లిపడింది కోకిల.

"లేనిది చెప్పలేదు. ఉన్నదే. నువ్వు సుఖంగా వుండాలి. నీ గురించి కొత్త బెంగ ఏర్పడింది ఈయనకి"

"కొత్తబెంగా"

రేఖారాణి కళ్లు మెరుస్తున్నాయి. నీళ్లు తొణికి వస్తుంటే ఆవిడ కొంగు అడ్డుపెట్టింది.

కాఫీ, బిస్కట్లు ట్రేలో తీసుకు వచ్చింది ఆయా.

కోకిల తీసుకుంది. ఆ తర్వాత డాక్టర్ శేషాద్రి "వీణా" అన్నారు. వీణతో బాటు కొడుకూ వచ్చాడు.

"వీడు ద్వారక్, వీడూ పిల్లల డాక్టరే"

"అమ్మాయి వీణ, కార్డియాలజిస్ట్. దానికి గుండెల్ని సరిచేయడం ఇష్టం. దాని గుండె ఉక్కే"

"ఓ" అంది కోకిల ఇద్దరికీ ఒకేసారి నమస్కారం చేస్తూ.

ఈషూ ఆడుతున్నాడు. పనమ్మాయి బాల్ తీసుకువచ్చి శమంతతోబాటు వాడిని ఆడిస్తోంది. ద్వారక్ లేచి వెళ్లి వాడిని పట్టుకున్నాడు. ఒకప్పటి మర్ఫీబేబీలా, మరోసారి తమ హాస్పిటల్‌లో వున్న మోడల్ డాక్టర్లలా అందంగా, ఆరోగ్యంగా ముద్దుగా వున్నాడు కాలెండర్‌లో చిన్ని డాక్టర్లా.

"వీణ" డాక్టర్ చెబుతున్నాడు "మొగుడు" కోకిలకి అర్థం కాలేదు.

"అల్లుడు డాక్టర్. వరంగల్‌లో ఆస్తిపరులు, పేరున్న వాళ్లు, మంచివాళ్లు అనుకుని పెళ్లిచేశాం"

"ఓ" సర్వం అర్థం అయిపోయింది కోకిలకి. "వరకట్నం ప్రోబ్లం అంతేనా"

"డాక్టర్ ప్రశాంత్- ఓ వ్యక్తి నిన్నటిదాకా తాగేవాడు. వాడు నిన్నటివరకూ దొంగతనాలు చేశాడు. వాడు అమ్మాయిల్తో తిరిగేవాడు అని చెప్పగలం. అంటే ఈమధ్య మారిపోయాడు అని చెప్పడం అన్నమాట. డబ్బు దాహం వున్న వాడికి నీళ్లుపోయలేం. ఆ ధనదాహం తీర్చలేం. అంతే ఆ బాధల్ని వీణ మాత్రమే భరించగలదు. మరెవరికీ సాధ్యం కాదు. వీణ ఇంట్లో పని చేసే అమ్మాయి వచ్చి చెప్పేవరకూ మాకు తెలీదు. ఆ తర్వాత వీణని తెచ్చుకున్నాం. ఓ ఆడపిల్ల అందరిమధ్యా ఆనందంగా, హాయిగా వుండాలి. నరకం చూసింది నా కూతురు. నువ్వు అలా కాకూడదు. అతను మంచివాడే అయితే పట్టి తీసుకువచ్చి నీకు న్యాయం జరిగేట్లు చూస్తాం"

వీణ వింటోంది. నిరాడంబరంగా వున్న ఆమె మొహం ప్రశాంతంగా వుంది. పెద్ద తుఫాను తాకిడికి చెల్లాచెదరైపోయాక నిశ్శబ్ద ప్రకృతిలా కనిపిస్తోంది.

కోకిల డాక్టర్‌వైపు చూస్తూ అంది "ఇంక సినిమాలే చూడను"

డాక్టరు కనుబొమ్మలు ముడిపడిపోయాయి. 'అర్థంలేని ప్రసంగం కాదూ' అనుకుంటున్నాడు.

"సారీ డాక్టర్... ప్రతి విషయాన్నీ ఇలా నిజజీవితంలో జరగదు అనే మాటని వుపయోగించాల్సి వస్తోంది. ప్రామిస్. నా మెదడు పొల్యూట్ అయిపోయింది" కోకిల జుట్టులోకి చేతివేళ్లను పోనిచ్చింది.

"డాక్టర్"! కోకిల నవ్వింది.

డాక్టర్ "చెప్పు" అన్నాడు.

"ఫ్లాష్‌లోకి వెళ్లాల్సి వస్తుంది"

"కానీయ్"

అక్కడున్నవాళ్లు కోకిల ఏం చెబుతుందోనని జాగ్రత్తగా వింటున్నారు.

"నేను చెప్పే విషయాలు నిజం డాక్టర్. ఇక్కడికి అంటే కాజీపేటకి వచ్చిన రోజున నా ఒంటినిండా నగలు, కొంత కాష్ వుంది. వాటితో ఇల్లు వదిలి వచ్చేశాను. వస్తూ వస్తూ నా సర్టిఫికెట్లు తెచ్చుకోవడం మాత్రం మరిచిపోలేదు.

"రైలు దిగగానే ఏం చేయాలో తోచలేదు. దగ్గర్లో వున్న రైల్వే కాలనీలో వుండేందుకు వీల్లేక పోవడంవల్ల ఆ కాలనీవాళ్లు సిమెంట్ ఫాక్టరీ గురించి చెప్పారు. నేను పారిపోయి వచ్చాననుకోలేదు వాళ్లు. బంధువుల ఇంటికి వచ్చాననుకున్నారు.

"నా అదృష్టం బాగుండి శమంత పలకరించింది. అప్పటినుంచీ ఇప్పటివరకూ నాకు తల్లీతోడూనీడా అంతా తనే. ఆమె కనుక లేనట్లయితే ఆత్మహత్య చేసుకునేదాన్ని"

"మీ వాళ్లెవరో చెప్పడంలేదు కోకిలా నువ్వు పక్కదారి పట్టిస్తున్నావు" డాక్టర్ శేషాద్రికి కోపం వచ్చింది.

కోకిల నిట్టూర్చింది. "మీకు కోపం వచ్చినా ఫర్వాలేదు డాక్టర్? కమింగ్ టుద పాయింట్, అసలు ఈ వూరు ఎలా వచ్చానో అని మీరు మళ్లీ అడగకుండా ఇక్కడినుంచి ప్రారంభించానన్నమాట"

"ప్రభు గురించి చెప్పాలంటే మొత్తం మా స్నేహితుల గురించీ మా కాంపౌండ్, అక్కడి వ్యక్తులూ అవన్నీ చెప్పాలి కదండి" అని ఆగి మళ్లీ చెప్పింది. "నేనూ, ప్రభూ, మాధవా ఒకే ఉయ్యాల్లో పడుకుని ఒకే ఉగ్గు గిన్నెలో పాలు తాగిన వాళ్లం. ఒకే క్లాసులో వుండేవాళ్లం. నాకు సినిమాలంటే చాలా ఇష్టం. ప్రభుతో వెళ్లేదాన్ని.

"మాధవకి ఇలాంటివి గిట్టేవికావు. ప్రభు అంటే నాకు చాలా ఇష్టం. దేవదాసు నవల లెక్కలేనన్నిసార్లు చదివాను. సినిమా కూడా అంతే. ప్రేమ గురించి అనర్గళంగా మాట్లాడేదాన్ని. డిబేట్లుకైతే మాధవ కూడా ఫస్ట్




వుండేవాడు. ఇదిగో ఇలా అన్నమాట.



అక్కడ అన్ని కాలేజీల నుంచి వచ్చిన స్టూడెంట్స్ గుంపులుగుంపులుగా నిలుచున్నారు. ఆడపిల్లలు సీతాకోకచిలకల్లా, మగపిల్లలు కళ్లెం వదిలేసిన గుర్రాల్లా.

టీన్స్, జీన్స్, టీ షర్ట్సు, టైట్ పాంట్స్, ఫార్మల్ పాంట్స్, టకిన్.

కొందరు చేతులు తలకింద పెట్టుకుని ఓ కాలుమీద మరోకాలు వేసుకుని చెట్లకింద రిలాక్స్ అవుతున్నారు.

ఆడపిల్లలు మెట్లమీదా, గట్లమీదా కొంద రైతే రాసుకు వచ్చిన కాగితాల్ని బట్టీపడుతున్నారు. చేతులు అభినయంతో పైకి కిందికీ కదులుతున్నాయి.

టైమ్ అయిందన్నట్లు కాన్ఫరెన్స్ హాల్‌లో గంట వినిపించింది. ఆల్ ఇండియా యూత్ అసోసియేషన్ నిర్వహిస్తున్న డిబేట్. 'ప్రేమ'. ఈ రెండు అక్షరాల గురించీ యువతలో ఎటువంటి అవగాహన వుందో తెలుసుకునేందుకు స్పాన్సరర్స్ వున్నారు. ఇందుకు బాధ్యతగా తల్లితండ్రుల సంఘాలు వున్నాయి. మళ్లీ వాళ్లల్లో కూడా రెండు చీలికలు, ప్రేమించవచ్చనీ అవసరం లేదనీ...

మైకుముందు ఒక్కో జతే వస్తున్నారు. వేలమంది విద్యార్థుల్ని వడగొట్టగా మిగిలిన ఐదు జతల్లో ముగ్గురిని ఈ అవకాశం వరించబోతోంది.

పిల్లల తల్లితండ్రులూ వున్నారు.

వివేకానంద కాన్ఫరెన్స్‌హాల్ కళకళలాడుతుండగా మైకు ముందు నిలుచున్న కోకిల గొంతు సవరించుకుంది.

"ప్రేమ... ప్రేమంటే ఓ తీయని అనుభూతి. ఓ అద్భుతం అయిన రుచి. ప్రాణం, వూపిరి, సమస్తం. ఈ ప్రేమ ఓ స్త్రీ పురుషులకే పరిమితం అయింది కాదు. ఆ ప్రేమ కుక్కమీదా పిల్లిమీదా వుండచ్చు లేదా రాయిమీదా, రప్పమీదా కూడా వుండచ్చు హద్దులూ, సరిహద్దులూ లేక ప్రేమ తత్వం గురించి చెప్పాలంటే కావ్యాలకి కావ్యాలు రాయచ్చు

"రెండు ప్రాణుల మధ్య అవగాహన, ఇష్టం, ఆరాధన ఏదైనా కావచ్చు ప్రేమలేని జీవితం రాగంలేని పాటలాంటిది. శబ్దం లేని ప్రకృతి లాంటిది.

"ప్రేమ తత్వంతో ప్రేమతో బతకగల్గినప్పుడే ప్రేమకి పరాకాష్ఠ ఏమిటో తెలుస్తుంది. ప్రేమకి దాసుడైన భగవంతుడు భక్తులకి సాక్షాత్కారం ఇస్తాడు"

కోకిల గొంతు సవరించుకుని మళ్లీ మొదలుపెట్టింది. "ఈ ప్రేమ అనే పదాన్ని విడదీస్తే ప్రేరణలో మధురం లేదా మాధుర్యం అనుకోవచ్చు"

కోకిల అనర్గళంగా మాట్లాడింది.

చాలా మాట్లాడింది. ఎన్నో విషయాల్ని సోదాహరణలతో వివరించింది. ప్రేమలో భక్తినీ, రక్తినీ, ముక్తినీ చూపించింది. మెట్లు దిగింది.

చప్పట్లు. చప్పట్లతో హాలు మారుమ్రోగింది. వింటున్న జనం మొహంలో ఆనందం.

మైకులో వినిపిస్తోంది.




పైజామా లాల్చీ వేసుకున్న అతను ముందు సభకి నమస్కారం చేశాడు. ఆ పైన ప్రారంభించాడు. "ప్రేమ అనే భావనకి ఫుల్‌స్టాప్ లేదు. అది బీజం అయి మొలకై, మొక్కై వృక్షమై వూడలతో సహా పాతుకుపోతుంది. దాన్ని పెకిలించి వేరుతో సమూలంగా తీయడం అనేది అసాధ్యం అని నా నమ్మకం.

"ప్రేమించిన వ్యక్తీ, వస్తువూ ఏదైనా అంతర్వాణిగా కదలచ్చు. అది వర్ణించి చెప్పలేని సందేశం. బరువైన నల్లని మేఘాల్ని చూసినప్పుడు నెమలి నాట్యం చేస్తుంది. ఓ శ్రావ్యమైన పాటలో లీనం అయిపోయిన రాగధారలాంటిదీ ప్రేమ తత్వం.

"మండుటెండలో ఎటునుంచో వచ్చి మరెటో వెళ్లిపోయే సన్నని వడగాడ్పులో తీగలాంటి మరీచిక. జ్ఞాపకాల వుచ్చులో బిగించేది. అస్థిత్వాన్ని మరిపించేట్లు చేసేది. మహావాహిని వంటిది. ఆకలి, దప్పికా ఇవేవీ దరిదాపుల్లోకి రానీయని తత్వం. ప్రేమంటే ఆరొందల సినిమాలూ, మూడొందల హోటళ్లూ కావనీ, గళ్లచొక్కా జీన్స్‌పాంటూ, ఎగిరే జుట్టూ, రేబాన్ గ్లాసెస్, పరుగులు పెట్టించే యమహాలు అసలే కాదనీ చదువనే పునాది మీద వేయబోయే కాంక్రీట్ భవంతిలాంటి భవిష్యత్ అనీ నా నమ్మకం.

"ప్రేమ వెన్నెల గోదారి. అరేబియన్ బీచ్, ఈఫిల్‌టవర్, తాజ్‌మహల్ ఇవన్నీ కలిసిన సుందరమైన కల"

"ఓహ్హో" అరిచేశారు జనం. ఈలలూ, చప్పట్లూ, గెంతులూ, ఆనందాలూ కుర్చీల్లోంచి లేచి అతన్ని వాటేసుకున్నారు. భుజాల మీదికి ఎక్కించుకున్నారు.

హాలు మార్మోగేట్లు డ్రమ్స్ వాయిస్తున్నారు.

కొద్దిసేపటికి సద్దుమణిగింది.

కోకిలకి సెకెండ్ ప్రైజ్ ఇచ్చారు.

మాధవ ఫస్ట్‌ప్రైజ్ అందుకున్నాడు.

మూడో వ్యక్తి ప్రభు వచ్చాడు. అతను తన అభిప్రాయాల్ని టూకీగా చెప్పాడు. నిర్దిష్టం అయిన అతని భావాలు కొంతవరకూ స్టూడెంట్స్‌కి తృప్తిని ఇచ్చాయి. విషయం ఏమిటంటే ఈ ముగ్గురూ ప్రాణస్నేహితులు. ఒకే కాలేజ్‌లో చదువుతున్నారు.

ప్రభు చెప్పాడు. "ప్రేమించినప్పుడు తప్పవిడిగా ఎన్ని కావ్యాలు రాసినా అర్థంకాని ప్రశ్న ప్రేమ. అది కవుల వర్ణనల్లో ఇమిడిపోలేనంత విస్తృతమైన సందేశం"

బహుమతుల ప్రదానం కూడా జరిగింది.

విద్యార్థులూ, విద్యార్థినులూ వెళ్లిపోయారు.

నిర్వాహకుల సమావేశం ప్రారంభం అయింది. బిజినెస్ మాగ్నెట్, జంట నగరాల్లో ప్రముఖుడు అయిన విశ్వేశ్వరయ్య తన అభిప్రాయం బయటపెట్టాడు. "ప్రేమ అనే పదం గురించి ఇంత పెద్ద ఎత్తున ఇంత ఖర్చు పెట్టి, ఇంతమంది స్పాన్సరర్స్‌తో చేతులు కలిపి దాన్నో యిష్యూ చేయడం నాకు నచ్చలేదు.

"ఎదిగిన పిల్లల ఆలోచనా విధానాన్ని పక్కదారులు పట్టించే మాట ఇది. ఏదిపమైనా ప్రస్తుతం సమాజంలో... ఇదో బర్నింగ్ ప్రాబ్లం అని నేను అనుకుంటున్నాను.

"మరో విషయం. వెర్రి వేయి తలలు అంటారే అలాగే ఈ సినిమాలూ, ప్రోగ్రాంలూ, విహారయాత్రలూ, పిల్లలకి శృతిమించిన స్వేచ్ఛ ఇవ్వడాలూ వీటిని నేను జీర్ణించుకోలేకపోతున్నాను"

"ఫరెగ్జాంపుల్ మా మనవరాలు వస్తుంది. ఇంట్లోకి రావడం, బయటికి వెళ్ళడం, రెండు సమయాల్లోనూ గాలిదుమారం గుర్తు వస్తుంది. 'హాయ్ గ్రాండ్ పా' అంటుంది చేతిని గాల్లోకి విసిరేస్తూ. క్షణం కూడా ఆగదు. వంటింట్లోకి వెళ్ళి 'గ్రాండ్ మా' అంటుందంతే. వాళ్ళమ్మ కని

పించగానే 'హౌ స్వీట్ మామ్' అని ముద్దు పెట్టేసుకుంటుంది.

"ఈ దృశ్యాలు చూస్తుంటే తేళ్ళూ జెర్రులూ పాకినట్లుంటాయి నాకు. ఎక్కడా సహజత్వం కనిపించదు. అదో డ్యూటీలాగ. మా పిల్లలు ఇంగ్లీషు స్కూళ్ళలోనే చదివారు. అయితే ఏం? ఏదైనా సమస్య వస్తే దాని పరిష్కారం దొరికేవరకూ ఓచోట కూర్చుని ఆలోచించడం జరిగేది.

"మన భాష, మన సంస్కృతి వదిలిపెట్ట లేదు. ఇప్పటికీ వాళ్ళది అదే ధోరణి. ప్రేమ హోరు తగ్గితే బాగుండు. మీరేమంటారు" అని అక్కడున్నవాళ్ళని అడిగి తను కూర్చున్నాడు.

ఒక నిశ్శబ్దం ఏర్పడింది.

ఆయన బాగా చదువుకున్నవాడు. ఆలోచించగల్గినంత విజ్ఞానం ఉంది. సమాజం పోకడలు ఎటువైపు వెడుతున్నాయో, ఏదారి మళ్లిస్తున్నాయో ఆయన కనుక్కోగలడు. దీనికి అవసరమయిన చర్యలు తీసుకోగలడు. ఆయనకి ఆ సామర్థ్యం ఉంది.

"ఇప్పుడు మనం ఏం చేయగలం? " అని అడిగాడు దాసు. ఆయనో ఎగ్జిక్యూటివ్. ఆయన... బోలెడు పరపతీ, డబ్బూ ఉన్నవాడు. సాధ్యమయినంతవరకూ సమాజానికి ఏదైనా చేయాలన్న తపన ఉన్నవాడు.

"అందుకే కదా ఇక్కడ సమావేశం ఏర్పాటు చేయించింది" అన్నాడు స్టార్ హోటల్స్ అధినేత రాఘవరావు.

"అఫ్‌కోర్స్! పద్ధతి బాగుంది. ప్రేమని ఇష్యూ చేయవద్దని అన్నందుకు ఇప్పుడు బాధ పడుతున్నాను. ఈ రెండక్షరాలు పదునైనవి. వాటి వెనుక ప్రయోజనం ఉందో లేక ఏదైనా అపాయం ఉందో తెలుసుకునేందుకు ఇదో మార్గం అని ఇప్పుడు తెలుస్తోంది" అన్నాడు విశ్వేశ్వరయ్య.

అన్నపూర్ణ యూనివర్సిటీలో పని చేస్తోంది. ఆవిడ అధ్యయనం చేసిన సబ్జక్ట సైకాలజీ. మానసిక శాస్త్రాన్ని కాచి వడబోసింది. ఆవిడకు కూడా ఈ వ్యవస్థ మీద నమ్మకం పోతోంది. ఆవిడ లేచి నిల్చుంది. అందరూ ఆసక్తిగా ఆమె వైపు చూశారు. ఎవరికి వాళ్లే ఇప్పుడున్న పరిస్థితికి ఆందోళన పడుతున్నారు. అందరి అభిప్రాయాలూ తెలుసుకుంటున్నారు. ఆవిడ చెప్పడం ప్రారంభించింది. "ఆడపిల్లలు ముచ్చటగా వుండేందుకు ఒళ్ళు నిండిన ఏ బట్టలైనా అభ్యంతరం అనిపించదు. మాట తీరూ, నడతా వీటినే గదా మనం గమనించేది. మన పిల్లలు షో కేసుల్లో బొమ్మలై పోతున్నారు. చాలీచాలని బట్టలు వేసుకుంటున్నారు. వాటిని ఇష్టపడుతున్నారు. నాకు చాలా ఆశ్చర్యం వేస్తుంది. కొన్నికొన్ని సీరియల్స్‌లో అయితే తల్లిచేత నువ్వు వెళ్ళి బావకి లైను వెయ్యమ్మా అని చెప్పిస్తున్నారు.

"ఛ...! ఓ తల్లి పిల్లకి చెప్పే మాటలేనా ఇవి? ఆ పిల్ల అదో గొప్ప విషయంలా తల్లి చెప్పిన మాట విని తన ప్రయత్నం తను చేస్తూ 'మమ్మీ బావను బుట్టలో వేసుకున్నా' అంటుంది.

"ఇలా చెప్పే పేరెంట్సు కూడా వున్నారా? ఏం చేయాలి? దీన్ని ఎవరం ఆపగలం" అంది ఆవేశంగా.

"ఇదీ ముఖ్యమైన విషయమే" అంది గాయత్రి. ఆవిడ మార్కెటింగ్ చేస్తున్న గార్మెంట్స్ గరంపూరీల్లా అమ్ముడుపోతున్నాయి. అన్నపూర్ణ పక్కనే కూర్చున్న రచయిత్రి మైథిలి యిబ్బందిగా కదిలి మీరు అమ్మే డ్రెస్సుల్లో కూడా అభ్యంతరకరమైనవి వున్నాయి గాయత్రీ. లక్షల్లో బిజినెస్. మీరు నష్టాన్ని భరించలేరు. అలా అమ్మడం మీకూ ఇష్టం వుండదు. కానీ మీరేమీ చేయలేరు. అవునా... అలాగే,

"కట్నాలు ఇచ్చుకోలేని ఈ పరిస్థితుల్లో తల్లి పిల్లకి ఆ విధంగా చెబుతోంది. ఆవిడ తనదీ తప్పులేదంటుంది. వరుస అయిన వాడే కనుక పరిచయం పెంచుకోమన్నాను




తప్పో అని కూడా నిలదీస్తుంది. ఏమం టారు" అని అడిగింది జనాంతికంగా.

అంతా అయోమయంలో పడ్డారు.

గార్మెంట్స్ లాభాలు.

కట్నాలు తప్పించుకోవడాలు. ప్రజల నాడి గుప్పిట్లో పెట్టుకున్న నిర్మాతలు.

నిర్మాతల పెట్టుబడులు.

అందరికీ ఒకటే సమస్య.

ఎంతోకొంత సంఘాన్ని ఉద్ధరించాలని తీరా తమ దగ్గరికి వచ్చేసరికి అదో జటిల సమస్యలా తయారౌతోంది. ఆర్థికన్యాయం వాళ్ళ నోళ్ళు నొక్కేస్తోంది.

డబ్బు...

డబ్బు... ఎలా వుంటుంది?

డబ్బు లంకెలా...

అంటే?

చెయిన్

అర్థంకాదు.

"డబ్బు చెయిన్‌లా మొదలై ప్రపంచం అంతా లింకులతో ప్రయాణం చేసి మొత్తం తిరిగి బయలుదేరినచోటుకు చేరుకునే 'భూమి గుండ్రం' సూత్రంలా అన్నమాట. ఈ డబ్బువల్లే ఎవరూ స్వయం నిర్ణయాలు తీసుకోలేకపోతున్నారు"

అందరూ లేచారు. చాలామంది మాట్లా డడం విరమించుకున్నారు.

సమస్య పెద్దది.

దానికి ఎవరూ ఏమీ చేయలేరు. దీర్ఘంగా నిట్టూర్చడం తప్ప.

దీర్ఘంగా నిట్టూర్చారు.

అంతమంది ఆ హాల్లో నిట్టూర్చిన గాలి వల్ల హాలు వున్నట్లుండి వేడెక్కినట్లయింది.

కార్లు కదిలాయి.

డబ్బు వదులుకునే స్థితిలో లేరెవరూ

అయినా నష్టపోతున్నదేమిటో వాళ్ళకి తెలుసు.

ఆవాజ్ వుఠావ్...

నిలదీయండి.

అన్యాయాన్ని అరికట్టండి.

సంప్రదాయాల్ని చెత్తకుండీలపాలు చేయ కండి.

ఆడపిల్ల ఆకుచాటు పిందెలా వుండాలి సర్.

ప్రపంచదేశాలు వేనోళ్ళ కొనియాడే భార తదేశాన్ని అప్రతిష్టపాలు చేయకండి.

దూరంగా స్కూలు వదిలేసినట్లున్నారు. పిల్లలు ఎగిరేపావురాల్లా గేట్లోంచి వచ్చేస్తు న్నారు. రేపటి పౌరులు వీళ్లంతా.

పదండి ముందుకు పదండి తోసుకు అంటున్నారు శ్రీశ్రీగారు. నిజంగా ఆయన అక్కడే వుండి పిల్లల్ని నడిపిస్తున్న పుల కింత. ఏ భారతదేశ్ హై మేరా... ఎంత బావుందీ ఈ పాట...

ఇప్పటివరకూ ఉపన్యాసాలు ఇచ్చి అభి ప్రాయాలు చెప్పిన పెద్ద మనుషులు నిజా నికి సిగ్గుతో తల వంచుకుంటున్నారు. ఈ భూమ్మీద పుట్టిన ప్రభావంవల్ల పతనం అయిపోతున్న సాటివాళ్ళని చూసి గుండెలు బాదుకుంటున్నారు.

వాళ్ళు పెదవి విప్పడంలేదుగానీ 'బచావ్... రక్షించండి... కాపాడండి' అంటున్నారు.

"ఎవర్నీ?"

"సంస్కృతిని"

అందరి గుప్పిళ్ళూ బిగుసుకున్నాయి.

గంటలకాలం కద్దులుతోంది. రక్తసంబం ధంకంటే ఎక్కువగా స్పందించే మనుషులే వీళ్ళంతా.

మర్నాడు పేపర్లో నిన్న జరిగిన కాన్ఫ రెన్స్ హాల్లో ప్రేమ వార్త ప్రచురించడం జరిగింది.

బహుమతులు తీసుకున్న పిల్లల్ని మెచ్చు కున్నారు.

కోకిలా, మాధవ, ప్రభు కూర్చుని దీర్ఘంగా చర్చించుకుంటున్నారు. కోకిల అంది. "నేను ప్రేమలో పడ్డాను మాధవా! ప్రేమ ఎంత మధురం"

ప్రభు లేచి "మరి వెడదామా?" అనడి

గాడు

కోకిలతోబాటు ప్రభూ, మాధవా బయలు దేరారు.

ముగ్గురూ బళ్ళమీద ఇళ్ళు చేరుకున్నారు.

వరుసగా ఒకే రకంగా వున్న ఇళ్ళు అవి. ఆ కాలనీలో ఇంకా అటువంటి ఇళ్ళు ఓ యిరవైవరకూ వుంటాయి.

అక్కడ అరమరికలు లేవు.

కోకిల తాతగారూ, మాధవా, ప్రభూ తాత గార్లూ ఈ కాలనీలోనే వుంటూ రజాకార్ల మూవ్‌మెంట్‌లో పాల్గొన్నారు. యాభై ఏళ్ళ చరిత్ర వుంది ఆ కాలనీకి. పాత ఇళ్ళు కూలి పోయి కొత్త ఇళ్ళు ఏర్పడ్డాయి. జూబ్లీ హిల్స్, బంజారాహిల్స్ వీటికి ఉన్నంత ఘనకీర్తి వుంది ఆ ఇళ్ళకి. చిత్రం ఏమి టంటే అక్కడ వున్నవాళ్ళల్లో చాలామంది ఆ తరంవాళ్ళే. కల్లాకపటం లేని మనుషులు జీవితాన్ని చీకూచింతా లేకుండా గడిపేసిన వాళ్ళు. అనుమానాలకీ, అనవసర విషయా లకీ దూరంగా వుండేవాళ్ళు.

వేసవికాలం కనుక ఎవరి ఇళ్ళముందు వాళ్ళు పడుకున్నారు. ఇంట్లో అన్ని సౌక ర్యాలూ వున్నా ఆరుబయట పడుకోవడం ప్రకృతి ఒడిలో సుఖాన్ని దోచుకోవడం ఎంతో ఇష్టం వాళ్ళకి. ఒక్కోసారి చాలా పొద్దుపోయేవరకూ మాట్లాడుకుంటారు.

కోకిల కింద చాపమీద కూర్చుంది. ప్రభు, మాధవ కొంచెం దూరంగా కూర్చున్నారు.

కోకిల ఊపిరి పీల్చుకుంది. "మాధవా ప్రేమంటే నీ ఉద్దేశ్యం? "

ప్రభు మొహం చిట్లించడం చీకట్లో మిగి లిన ఇద్దరికీ కనిపించలేదు.

"మాట్లాడవేం? ప్రేమమీద నమ్మకం లేదా? అసలు ప్రేమంటే తెలీదా నీకు? "

"ఇప్పుడు ఈ కబుర్లెందుకు" అంటూ ప్రభు విసుక్కున్నాడు.

"అరె... తెలుసుకుంటే ఏమౌతుంది? సరే... ప్రభూ నేనంటే నీకు ఇష్టం వుందా లేదా? "

ప్రభు నవ్వి "ఇష్టమే" అని, "ప్రేమకీ దీనికీ సంబంధం ఏమిటి? "

మాధవ జోక్యం చేసుకున్నాడు. "అంత మందిని ఓడించాలని ఎన్నో పుస్తకాలు చదివి అనుకున్నట్లుగానే ప్రైజులు కొట్టేశాం ఇందులో తప్పేంలేదు. కోకిలా మనసు లోంచి తన్నుకువచ్చే భావాలంటూ నువ్వు ఉపయోగించావా? "

"సందేహమే లేదు. ప్రేమ విలువా, ప్రేమించడం ఇవన్నీ నాకు తెలుసు. పుస్త కాల్లో నేను చదివింది చాలా వుండివుం టుంది. కానీ నా మనసు కదలికల్ని మాత్రం ఆశువుగా చెప్పేశాను. నాకు ప్రేమంటే దేవుడితో సమానం. ఎక్కడ ప్రేమ వుంటుందో అక్కడ దైవత్వం వుంటుంది. ఆ ప్రేమకోసం నేను ఎంత కష్టాన్నైనా భరించగలను. మరి నీ సంగతే మిటి మాధవా? " అని అడిగింది.

మాధవ ఆవలింతకి చిటికె వేశాడు. "ప్రేమ... సమయం వచ్చినప్పుడు చెబు తాను. మరి పడుకుంటే బావుంటుంది. లేద్దామా? "

"నువ్వు వెళ్ళి పడుకో మాధవా! ప్రభుతో నేను మాట్లాడాలి"

"ఇంతరాత్రి అయింది పడుకుందాం కోకిలా" అన్నాడు ప్రభు.

"పడుకుందామా..." కోకిల చప్పున ఈల వేసింది.

"ఛీ... ఏమిటా మాటలు? " చిరాకుప డ్డాడు ప్రభు.

కోకిల కాళ్ళు చాపుకుని కూర్చుంది. "ప్రభూ నువ్వు కవితావేశంలో నాకు రాసిన ఉత్తరాలు చూపించనా? "

అతను కంగారుపడ్డాడు. చీకట్లో కనిపిం చలేదు కోకిలకి. ప్రభు తేరుకుని, "కోకిలా నీకు ఉత్తరాలు రాయడం అంటే నాకు చాలా ఇష్టం. నువ్వు వాటికి అద్భుతం అయిన జవాబులు రాస్తావు. వాటిని చదు వుతుంటే గాల్లో తేలిపోతున్నట్లు అనిపి

స్తుంది. ప్రేమో దోమో తెలీదుకానీ నీతో తప్ప మరెవరితోనూ మాట్లాడడం రాదు నాకు. కానీ..."

"కానీ", "చెప్పు... 'బట్'తో వదిలేయకు. కోపం వస్తుంది నాకు" కోకిల అతనేం చెబుతాడో అని ఎదురుచూసింది. అతను నిశ్శబ్దంగా లోపలికి నడుస్తూ, "రా కోకిలా" అన్నాడు.

కోకిల అతని వెనుకే వెళ్ళింది.

గదిలో లైటువేసి అతను ఖరీదైన సిగరెట్ తీశాడు. దాన్ని వెలిగించి 'ఉఫ్.. ఉఫ్' మంటుంటే కోకిల ఆశ్చర్యంగా, భయంగా చూసింది.

"నేను సిగరెట్ తాగుతాను కోకిలా! ఇట్స్ ఎ ప్లెజర్ ఫర్ మి. అప్పుడప్పుడు బీరు తీసుకుంటాను. నీకు ప్రేమలేఖలు రాస్తాను. ఎవరికీ తెలియకుండా ఇలా చేయడం తప్పేమో నాకు తెలీదు. కానీ ఇవన్నీ యిష్టం నాకు"

కోకిల రెప్పవేయడం మరిచిపోయింది.

"నీ చేయి పట్టుకుని నిన్నెక్కడికో తీసుకు వెళ్ళిపోగలను తెలుసా?"

"బాప్‌రే. నాకు భయం వేస్తోంది ప్రభూ"

"ఇంతక్రితం ఏమన్నావో గుర్తులేదూ?"

"ఛ..." కోకిల కంగారు కంగారుగా అంది. "వట్టిగా అన్నాను. నువ్వంటే ప్రేమ వల్ల అన్నాను. అంతే... అంతే. నాకు భయంతో ఏ పని చేసినా నచ్చదు ప్రభూ"

"నిర్భయంగా చేస్తే"

"ఏయ్" కోకిల కసురుకుంది. "డ్రాపిట్. వదిలేయ్"

"ఎలా వదిలేయగలను కోకిలా. నేను నిన్ను ప్రేమిస్తున్నాను సరేనా?"

"మీ నాన్నగారితో చెబుతావా?"

"హు..." నవ్వాడు అతను. "అక్కడే రాజీపడలేను. ఆయన ఆప్కారీ ఇన్‌స్పెక్టరు. ధాం, ధూం అని అరుస్తారు. ఆయన గొంతు విప్పితే బండబూతులు తట్టుకోలేం' ప్రభు లేచి పచార్లుచేస్తున్నాడు. సిగరెట్ పొగని గాల్లోకి సున్నాలు సున్నాలుగా వదులుతున్నాడు. కళ్ళు బాగా చిట్లించి ఎగురుతున్న సున్నాల్ని చూస్తూ చెప్పాడు.

"చిన్నప్పటినుంచీ అంతే"

"ఓ..."

"కోకిలా. ఓ విషయం చెబుతాను విను. నాన్నగారు చాలా బావుంటారు అవునా?"

"ఊ...చెప్పు"

"మీకేంరా మీ నాన్న జీపులో తిరుగుతారు. కోరినవన్నీ కొనిస్తారు అంటుండే వాళ్ళు మన క్లాస్‌లో పిల్లలు. ఓసారి ఇలాగే వాళ్ళంతా నన్ను ఊదరగొట్టేస్తుంటే యింటికి వచ్చి 'నాన్నగారూ' అంటూ ఆయన మెడ చుట్టేశాను.

"ఆయనేం చేశారో తెలుసా.. నా రెండు చేతుల్నీ పట్టుకుని ఇవతలకి లాగేసి ఛీ... డర్టీ ఫెలో, డర్టీ హాండ్స్ అని విసుక్కున్నారు. అప్పట్నించీ ఆయన దగ్గరకే వెళ్ళ లేదు. ఐ హేట్ హిమ్. అప్పుడు నాకు పన్నెండేళ్ళు.."

కోకిల వింటోంది.

"ఆయన పనివాళ్ళతో, సబార్డినేట్స్‌తో మాట్లాడినట్లే మాట్లాడతారు. మా అమ్మ వినయంగా ఆయనకి సపర్యలు చేస్తుంది. ఆ సీన్ చూస్తే ఒళ్ళు మండుతుంది నాకు"

"ఆమెని ఏమీ అనరు అవునా?" అని అడిగింది కోకిల.

"ఊహూ... అదో సెంటిమెంట్. ఈయన పెళ్ళిపీటలమీద కూర్చున్నార్ట. ఆ పెళ్ళికూతురు, అంటే మా నాన్నగారికి నిశ్చయం అయిన అమ్మాయి ఎవర్నో ప్రేమించిందట. సరిగ్గా ముహూర్తం సమయానికి ఆ ప్రేమించిన వాడిని పెళ్ళిచేసుకుని వెళ్ళిపోయిందట. నలుగురిలో నవ్వుల పాలైపోతామనే భయంతో అక్కడ పెళ్ళికి వచ్చిన పిల్లల్లో మా అమ్మ నిద్రపోతుంటే లేపి తయారుచేసి నాన్నగారితో పెళ్ళి చేశారు"

"వెరీ ఇంటరెస్టింగ్"



"అమ్మ చక్కనిది. ఆవిడ వచ్చాకే నాన్న గారికి ప్రమోషన్లు రావడం మొదలయింది. పట్టుకున్నది బంగారం కావడంవల్ల అమ్మని ఏమీ అనరు"

"మరి పిల్లలంటే విసుగు దేనికి? "

ప్రభు చిత్రంగా శబ్దం చేస్తూ నవ్వాడు. "నెలకి యిరవై ఐదురోజులు తిరుగుతుం టారు. ఇంటికి రాగానే అమ్మతో మాట్లాడేం దుకు వీల్లేకుండా మేం చుట్టూ వుండడంవల్ల ఈ కోపం అయి వుంటుంది. ఏనీవే కోకిలా! మా నాన్న మాకు శత్రువులా కనిపిస్తాడు. నా ఒక్కడికే కాదు. మా ఐదుగురు అన్న దమ్ములకీ, చెల్లెళ్ళకీ కూడా"

కోకిల నిట్టూరుస్తూ, "బావుంది. మా ఇంట్లో మా నాన్నా, అమ్మా భలే బాగా చూస్తారు. మేం ఆడింది ఆట పాడింది పాట"

"అదిగో నాకు మింగేయాలన్నంత కోపం వస్తుంది. మీ నాన్నలా మా నాన్న ఎందుకు వుండడు? పోనీ మా నాన్నలా మీ నాన్న వుంటే ఏం? మాకు లేని సుఖం మీ అందరికీ ఎందుకు?" అతను కొంచెం



సేపటికి మామూలు మనిషయ్యాడు.

"కోకిలా" అతను అటూఇటూ పచార్లు చేయడం ఆపి ఆమె దగ్గరగా వచ్చి ఆమె బుగ్గమీద చిటికె వేశాడు.

తెల్లబోయింది కోకిల. అతని స్పర్శ ఆమెను చాలాదూరం తీసుకువెళ్ళింది.

వెంటనే లేచి అక్కడినుంచి వెళ్ళిపోయింది.

ఆ రాత్రేకాదు మరో వారం రోజులవరకూ నిద్రపట్టలేదు ఆమెకు. ఈ వారం రోజులూ కాలేజ్‌కి కూడా వెళ్ళలేదు. అసలు ఇంట్లోంచి బయటికే రాలేదు.

"నువ్వు కాలేజ్‌కి వెళ్ళడం లేదు. ఏమైంది నీకు?" అని అడిగింది రాజ్యలక్ష్మి. ఆవిడ కోకిలకి తల్లి. రోజులో చాలాసేపు మంచంమీద పడుకుంటున్న కోకిలని చూసి కంగారుపడి ఒంటిమీద చేయివేసి ఒళ్ళు వెచ్చబడిందేమో అని చూసింది.

కోకిల తండ్రి శ్రీనివాసమూర్తి కూడా భయపడ్డాడు. ఇంట్లో అన్నావదినలక్కూడా కాళ్ళూ చేతులూ ఆడడం లేదు. వాళ్ళందరూ కాలుకాలిన పిల్లుల్లా తిరుగుతున్నారు. మాధవా, ప్రభూ కోకిల సంగతి విని కోకిలని చూడాలని ప్రయత్నం చేసి మానుకున్నారు.

మంచంమీద పడుకున్న కోకిల పగలూ, రాత్రీ కలలు కంటోంది. ప్రేమించిన వ్యక్తి కోసం ఏం చేసినా అది ఆ ప్రేమ విలువ పెరిగేందుకేగానీ స్వార్థం కాదనే నిర్ణయానికి వచ్చింది. ప్రేమజ్వరం ఆమెని మంచం పట్టేట్లు చేసింది.

కళ్ళు మూసుకున్నా, తెరిచినా బుగ్గమీద వేసిన చిటికె ఆమెను ఆలోచించనీయడం లేదు. 'నాది' అనే భావం కూడా ప్రేమలోంచి పుట్టుకువస్తుందనే విషయం అర్థం అయింది.

రాజ్యలక్ష్మి కోడల్ని పిలిచి నెమ్మదిగా చెప్పింది. "సబితా దానికేమైందమ్మా. నువ్వైనా దాన్ని అడిగి తెలుసుకో. ఆడుతూ పాడుతూ బొంగరంలా తిరిగే పిల్ల ఇలా మంచానికి అతుక్కుపోతే బెంగగా వుంది. 'లివర్' చెడిపోయి కామెర్లు వచ్చేముందో లేదా కామెర్లు ముదిరిపోతేనో ఇలా మంద కొడిగా వుంటారు. పోనీ మీ వదిన డాక్టరు కదా ఆవిడ దగ్గర్కైనా తీసుకువెళ్ళమ్మా"

సబిత కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి. అత్తగారు మెట్రిక్ వరకూ చదివి ఆపేశారు. రోజూ పేపరు చదువుతుందావిడ. నెలలో వచ్చే వార, మాస పత్రికలు తప్పకుండా కొని చదువుతుంది. ఆవిడని ఒక విధంగా పుస్తకాల పురుగు అనచ్చు. డాక్టరు సలహాలు, ప్రశ్నోత్తరాలు, వంటావార్పులు, కుట్లూ, అల్లికలూ, పాత కొత్త పాటలు... అన్నీ... అన్నీ చదువుతుంది. ఆమె చేయలేని పనంటూ వుండదు. కోకిలకి ఏరికోరి ఆ పేరు పెట్టింది ఆవిడే. మామగారు ఉద్యోగరీత్యా మద్రాసులో వున్నప్పుడు పుట్టింది ఆ పిల్ల. సంగీతం మీద మక్కువతో, అక్కడ తరచు వినిపించే పేరుకావడంవల్ల బంగారు బొమ్మలా వుండే పిల్లకి కోకిల అనే పేరు పెట్టుకుంది.

ఆవిడ ముచ్చట పడ్డట్లు కోకిల బాగా పాడుతుంది కూడా. చిన్నది కావడంవల్ల కొంచెం గారాబం ఎక్కువ. అందుకే ఆవిడ ఇలా తల్లడిల్లిపోయి తనకున్న పరిజ్ఞానంతో కోకిలకి వచ్చిన రోగాన్ని నిర్ణయించేసింది.

"సబితా వింటున్నావా?" అని అడిగింది రాజ్యలక్ష్మి.

చప్పున ఈ లోకంలోకి వచ్చింది సబిత. "వదిన సాయంత్రం డిస్పెన్సరీలో వుంటుంది అత్తయ్యగారూ! అలాగే తీసుకు వెడతాను. మీరు బెంగ పెట్టుకోకండి" అంది ఓదార్పుగా.

కోకిల గదిలో వున్న తల్లీ వదినా మాట్లాడుకుంటున్న మాటలన్నీ వింది. నవ్వుకుంది. తనకి ప్రేమజ్వరం పట్టుకుంది తనకి. "అయ్యో అమ్మ... ఈ టీనేజ్ సైకాలజీ ఎందుకు తెలుసుకోవడంలేదు?" అను

కుంది.

పడుకున్న మంచంమీద నవలలూ, పత్రికలూ తన అభిమాన రచయితా, రచయిత్రీ రాసినవి అవి, వాటిమధ్య కళ్ళెం వదిలిన గుర్రంలా మనసు ఊహాలోకంలో పరిగెడు తోంది.

సాయంత్రం ఆరు గంటలైంది. ఇంట్లో లైట్లు వెలిగించింది సబిత. వెలిగిన లైట్లకి దండం పెట్టింది. లైట్లు వెలిగించే ముందు పెరటి వాకిలి మూసేసి వీధి వాకిలి తెరుస్తుంది. దీపం వెలిగించాక తను బొట్టు పెట్టుకుని గుమ్మాలకి పెడుతుంది. ఆ తర్వాత వాకిలి తలుపు వేసేస్తుంది. రోజూ లాగే ఈవాళా చేసింది.

కోకిల "సో వదినా వీధిలోంచి వచ్చిన శ్రీమహాలక్ష్మి పెరట్లోంచి వెళ్ళిపోకుండా, మళ్ళీ వీధిలోంచి పారిపోతుందేమో అని ఎంత జాగ్రత్తగా కట్టు దిట్టం చేశావో అవునా? " అని అడిగింది.

సబిత నవ్వేసింది. "మా ఫ్రెండ్ గీత తమిళుల అమ్మాయి. తను చెప్పింది ఇలా చేయాలని. ఇందులో మనం నష్టపోయేదేమీలేదు కోకిలా. ఇదో పద్ధతి... సంప్రదాయం, సంస్కృతీ మంచిదేకద"

"వదినా నువ్వు అన్నయ్యని ప్రేమించే పెళ్ళిచేసుకున్నావా? "

ఉలిక్కిపడింది సబిత. మోకాళ్ళచుట్టూ చేతులు వేసుకుని వదిన మొహంలోకి చూస్తోంది ఆ పిల్ల. సబితకి ఆశ్చర్యం వేసింది. ఈ ఇంట్లో అరమరికలు లేవు. ఏ కారణంవల్లో సంపత్‌కీ కోకిలకీ మధ్య పదేళ్ళ వ్యత్యాసం వుంది. సంపత్ దగ్గర గారాలుపోయే కోకిల ఒక్కోసారి బిడ్డలాగే కనిపిస్తుంది. తన దగ్గరా అంతే.

సబిత ఎమ్.ఎస్.సి. చదివింది. లెక్చరర్‌గా పనిచేస్తోంది. పెళ్ళయ్యాకే డాక్టరేట్ చేసింది ఓ పెళ్ళికి వెళ్ళినప్పుడు సంపత్ ఆమెను చూశాడు. సరిగ్గా అప్పుడే తనూ చూసింది. అతను ఇంజనీరింగ్ పాసై హైద్రాబాద్‌లో వున్న హెచ్.ఎం.టి.లో పని చేస్తున్నాడు.

"అసలేమైందంటే..." అంది సబిత.

"చెప్పు వదినా... రింగులు రింగులు రింగులూ, లేదా పొగలోంచి ఫ్లాష్‌బాక్"

"చుప్ బుద్ధిగా విను అంతే"

"ఓ. కే..."

★ ★ ★

"పక్కాలా నిలాబడీ" పెళ్ళిలో శ్రావ్యంగా పాడుతోంది సబిత. పెళ్ళివారు గానకచేరీ ఏర్పాటుచేశారు. వినత, సబితా ఇద్దరూ ఆంధ్రా సిస్టర్స్... వాళ్ళ పాటకి చెవి కోసుకుంటారు తెలుగువాళ్ళు. సంపత్ అప్రయత్నంగా వెళ్ళిపోయి ఆమె పక్కనే కొద్దిదూరంలో కూర్చుండిపోయాడు.

గంటసేపు కచేరీ అయిపోయింది. అసలు సబితకి పెళ్ళికూతురు స్వయానా పినతల్లి కూతురు. పెళ్ళికోసమే కాకుండా వీళ్ళ పాట వినేందుకు వచ్చినవాళ్ళూ వున్నారు. అందులో రాజ్యలక్ష్మిగారు ఒకరు.

రాజ్యలక్ష్మి సంబరం పట్టలేక ఆ పిల్లల్లో పెద్దది సబితని రెండు చేతుల్తో వాటేసుకుని, "అబ్బ... ఎన్నాళకెన్నాళ్ళకి? మెడ్రాసులో విన్నాను మీ కచేరీ. తుప్పు వదిలిపోయిందమ్మా సబితా. మీ అమ్మ ఎక్కడ? " అని అడిగేసింది సంబరంగా.

ముందు తెల్లబోయిన సబిత తర్వాత తేరుకుంది. "మీరా... గుర్తు పట్టలేకపోయాను సారీ... ఆంటీ" అంది.

"అమ్మ ఎక్కడా? "

"పెళ్ళికూతురు దగ్గర ఉంది"

ఆవిడ యింక అటువైపు పరిగెత్తినట్లే వెళ్ళిపోయింది. కొంచెం దూరంలో సంయుక్త కూర్చుని పెళ్ళికూతురి మెడలో చిక్కులుపడిపోయిన బంగారు గొలుసుల్నీ పుస్తెల తాడునీ జాగ్రత్తగా వేరుచేస్తోంది.

"హలో సంయుక్తా" అని రాజ్యలక్ష్మి పిలిచేసరికి వెనక్కి తిరిగి చూసింది సంయుక్త.

రాజ్యలక్ష్మి కనిపించగానే చప్పున లేచి రెండు చేతులూ చాపి "ఎన్నాళ్ళకెన్నాళ్ళకి?" అంది.

రాజ్యలక్ష్మి ఆమెని చుట్టేసింది. "మీ పిల్లలు భలే పాడుతున్నారు సంయుక్తా. వీళ్ళ పాట వినాలని వచ్చాను. నిన్నూ చూశాను. ఇంతకీ మీ ఆయన ఏరీ?"

"గాడి పొయ్యి దగ్గర వున్నారు. ఇన్నేళ్ళు మెడ్రాసులో వున్నా ఈ వైపు రాగానే ఆయనకి చిత్తులు కలుగుతాయి. పైసలు పడేస్తే బోల్డు దొరుకుతాయి. పనసపొట్టు కొనుక్కోలేమా చెప్పు? వేలూ లక్షలూ పెళ్ళి పేరిట ఖర్చుచేస్తున్నాం. తనమాటే చెల్లించుకుంటారు"

"ఏవిటి పనసుపొట్టు కూరా..." రాజ్యలక్ష్మి సంబరంగా అడిగింది. సంయుక్త దీర్ఘంగా నిట్టూర్చింది "సరిపోయింది" అంటూ.

"సంయుక్తా! మనం కొన్ని విషయాల్ని ఇట్టే తీసిపారేస్తాం కానీ నిజం చెప్పాలంటే మనపెద్దవాళ్ళు చెప్పేవన్నీ యథార్థాలే. పనసకాయలు తెచ్చి పిడికి వూస దిగేసి కత్తితో చెక్కిపారేసి ఆ పొట్టుకి పసుపూ, నూనె కలిపి. ఆపైన వండుకుని తింటే ఆ రుచే వేరు

బజారు సరుకు బజారు సరుకే... ఇంకా చెప్పు" అంది.

"ముందు నువ్వు కూర్చో రాజ్యలక్ష్మీ. నిన్ను నిలబెట్టి మాట్లాడేస్తున్నాను" అంది తను తిరిగి పెళ్ళి కూతురి దగ్గర కూర్చుంటూ.

రాజ్యలక్ష్మికి మహదానందంగా వుంది. సబిత, వినతా మొహం తిప్పుకోలేనంత అందంగా వున్నారు. రెండు గండుకోయిలలు కూసినట్లే! ఎంత బాగా పాడారని.

అసలు సిసలు సంప్రదాయాల్ని పాటిస్తున్నారు. మారుతున్న కాలంతో మార్పు కోరుకోవడం వేరు, బతకడం వేరు. ఇలా అప్పుడప్పుడు పూర్వీకుల సంప్రదాయ ఖజానాని తెరిచి చూస్తే ఎంత బావుంటుందని...

"లేవండి లేవండి భోజనాలు వడ్డించేస్తున్నారు" హడావుడి పడిపోతున్నాడు చంద్రమౌళి. అతను ప్రస్తుతం వంటావార్పూ హడావుడిలో వున్నవాళ్లని గైడ్ చేస్తున్నాడు. "విస్తళ్లు వొద్దురా బాబూ అరిటాకుల్లో వడ్డించండి"

"బఫే కాదా"

"సింగినాదం కదూ" చంద్రమౌళి నవ్వుతూనే చెప్పాడు. "హాయిగా నేలమీద కూర్చుని తిని చూడండి. ఆ తృప్తి తెలుస్తుంది"

భోజనాలు వడ్డిస్తున్నారు.

సంయుక్త పక్కనే రాజ్యలక్ష్మి కూర్చుంది. "వంటలన్నీ భేషుగ్గా వున్నాయి. ఇదీ ఓ కళే. వండడం ఓ ఎత్తు, వండిన వాటిని వర్ణించి చెప్పి నోరూరిస్తూ తినిపించడం మరో ఎత్తు. ఏమైతేనేం చాలా ఏళ్లకి మంచి భోజనం చేశాం" అంది రాజ్యలక్ష్మి.

సంయుక్త సంతోషపడింది.

కుర్రకారు ఆడపిల్లలకి వడ్డిస్తూ ఛమక్కులు విసురుతున్నారు. సబిత దగ్గరకి వచ్చిన సంపత్ "బాగా పాడారు. పైగా బాగా కూడా వున్నారు. షేక్స్పియర్ చెప్పినట్లు నేను నా మనసు పారేసుకున్నాను. నన్ను పిచ్చివాడిని చేయకండి ప్లీజ్" వడ్డిస్తున్నట్టు వొంగి అనేశాడు.

సబిత బిత్తరపోయింది. యిటూ అటూ చూసింది. ఆ క్షణంలో యిటుపక్క కూర్చున్న చెల్లెలు వినతా, అటుపక్క కూర్చున్న అన్న గోవిందూ ఈ లోకంలో లేనట్లు భోజనం చేయడంలో మునిగిపోయారు.

"అమ్మకి చెబుతాను. మీరు కాదనకండి ప్లీజ్" అతను చప్పున వెళ్ళిపోయాడు. సబిత అటువైపు చూసింది. దడదడలాడిన గుండె చప్పుడు క్రమంగా యథాస్థితికి వచ్చింది.




కొంచెం సేపటి తరువాత చూస్తే సంపత్ దూరంగా తల్లితో మాట్లాడుతున్నాడు. కొడుకు మాటలు వింటూ అటూఇటూ చూస్తోంది ఆవిడ. బహుశ ఆవిడకి తన గురించే చెబుతున్నట్లున్నాడు. సబిత అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

"అదీ సంగతి. చాలా సింపుల్. మీ అన్నయ్యా మీ అమ్మా నాన్నలకి చెప్పి ఆపైన మా అమ్మా నాన్నలతో మాట్లాడి నన్ను పెళ్ళాడారు" అంటూ ముగించింది సబిత.

ఆవిడ కళ్ళల్లో అన్న పట్ల ప్రేమ కనిపిస్తోంది కోకిలకి.

అయినా "ప్చ్" అంది పెదవివిరుస్తూ. "చప్పగా వుంది మీ ప్రేమ. పార్కులకీ, హోటళ్ళకీ, సినిమాలకీ వెళ్ళడాలూ వుత్తరాలు రాసుకోవడాలూ ఇలాంటివేమీలేకపోతే అదేం ప్రేమ వదినా" అని అడిగింది.

సబిత నవ్వింది. "నిజమైన ప్రేమ స్వచ్ఛమైన సెలయేరులాంటిది. అందులో ఏ కల్మషాలూ లేనట్లే మా ప్రేమలో కూడా ఏ ఒడుదుడుకులూ వుండవు. ప్రేమకి పరాకాష్ఠ పెళ్ళి కదా. ఇక మాకు అవకాశం ఏదీ ఉత్తరాలకీ షికార్లకీ"

"మరి మీ భావావేశాలు ఎలా వెల్లడించుకున్నారు వదినా"

"బాప్‌రే... తెలుగు కఠినంగా వుంది కోకిలా. నీకేదో పైత్యం ప్రకోపించినట్లుంది అవునా"

నవ్వింది కోకిల "ఓ వదినా ఈ ప్రేమ సబ్జక్ట్ చాలా పవర్‌ఫుల్. చూశావా నేను తెలుగు కఠినంగా మాట్లాడతానని చెప్పి నువ్వూ ఆ పనే చేస్తున్నావు"

సబిత గంభీరంగా చూసింది "కొంచెం కొంచెం అర్థం అవుతోంది. ప్రేమ...కాషన్... ప్రేమ ప్రమాదకరం అయిందనే హెచ్చరిక కూడా వుంది"

కోకిల కూర్చున్న చోట్నుంచి లేచింది. రెండుచేతులూ బార్లా చాపి గుండ్రంగా తిరిగి హాయిగా నిట్టూరుస్తూ సబితని చుట్టేసి ఆమె పక్కనే మంచంమీద వాలిపోయింది.

సబిత కన్నార్పడం మరిచిపోయి చూస్తోంది. ఇంత ఉత్సాహంగా, ఆనందంగా గాల్లో తేలిపోతున్నట్లు ఎప్పుడూ చూడలేదు. కొంచెం గంభీరంగా ఒక్కోసారి ముభావంగా వుండే కోకిలని రెండోవైపు చూస్తోంది.

ప్రేమ...

సబితకంటే కోకిల చాలా చిన్నది. ఒకరిని నొప్పించడం ఎరగని మంచి పిల్ల. ఇటువంటి పిల్లలు లెక్కల్లో వుంటారు. అపురూపంగా చూస్తూ "కోకిలా... బాగా చదువుకోవాలి. ఓసారి మనసు పారేసుకున్నాం అనుకో చాలా సమస్యలు ఎదురౌతాయి. ఈ టీన్స్‌లో అన్నీ రంగుల కలలే కనిపిస్తాయి. రెక్కల్లేకుండానే ఆకాశంలో ఎగిరిపోతాం. లాహిరి లాహిరి అంటూ వెన్నెల షికార్లు చేస్తాం. అబ్బో ఒకటేమిటి బోల్డు పైత్యప్రకోపాలు నిద్రపోనీయవు. కూర్చోనీయవు. నిల్చోనీయవు. ఎండమావులు వెంటే పరిగెడుతున్నామో నిజంగానే చూస్తున్నామో తెలీదు" అంది.

"ప్లీజ్ వదినా! నన్ను ఖంగారు పెట్టెయద్దు. భయపెట్టద్దమ్మా, ప్రేమ ఎవరికి పడితే వాళ్ళకి ఎప్పుడుపడితే అప్పుడు దొరికేది కాదు. నేనిప్పుడు కొంపలంటుకుపోయేంత పీకలవరకూ మునిగిపోయేంత ప్రేమలో చిక్కుకుపోలేదు తల్లీ"

"తెలుస్తూనే వుంది. నీలో మార్పుని నేను గమనించలేనంత పసిపిల్లను కాను. ఇద్దరు పిల్లల తల్లిని"

కోకిల జవాబు చెప్పలేదు. వెళ్ళి కిటికీ గూట్లో కూర్చుంది. చీకటిని చీల్చుకుంటూ వెన్నెలని కురిపిస్తూ చంద్రుడు పైపైకి వస్తున్నాడు. సబిత కిటికీ దగ్గరకి వచ్చి కోకిల భుజంమీద చేయివేసింది. "పద భోజనాలకి టైము అయింది. నువ్వు రాకపోతే మీ

అమ్మా, నాన్నా, అన్నయ్యా, పిల్లలూ నన్ను చంపుకుతింటారు. పద పోదాం"

కోకిల యిబ్బందిగా చూసింది "ఆకలి లేదు వదినా"

"ప్లీజ్ కోకిలా"

డైనింగ్ హాల్లో కంచాలముందు కూర్చున్నారు. శ్రీనివాసమూర్తి భార్యవైపు ప్రశాంతంగా చూశాడు. వారం రోజుల్నుంచీ ఇంట్లో ఎవరికీ మనశ్శాంతి లేదు. ఆరోగ్యంగా చలాకీగా లేడిపిల్లలా పరిగెత్తే కోకిల మూడంకె వేసి పడుకోవడం యింటిల్లిపాదికీ బెంగతెచ్చిపెట్టింది.

"రేపు కాలేజీకి వెడతావామ్మా కోకిలా" అని అడిగాడు శ్రీనివాసమూర్తి.

"మరోవారంరోజులు ఇంట్లోనే వుంటాను నాన్నా" అంది కోకిల కంచంలో అన్నాన్ని చేత్తో కెలుకుతూ.

సంపత్ ఓసారి చెల్లెలివైపు చూసి మొహం తిప్పుకున్నాడు. ఏదో గందరగోళంగా వుంది. చెల్లెలంటే అతనికి చాలా యిష్టం, ప్రేమ. ఆడపిల్ల కొంచెం కట్టుబాట్లలో వుంటే బావుంటుందని అతని అభిప్రాయం. తనూ ప్రేమించి పెళ్ళిచేసుకున్నాడు. ప్రేమించడం నేరమూ కాదు, తప్పు అసలేకాదు.

ప్రేమికుల అంతరాత్మ ఎప్పుడూ పరిశుద్ధంగా, నిష్కల్మషంగా వుండాలనేం రూల్ లేదు. ప్రేమ పేరుతో ముసుగువేసుకుని ఆడపిల్లల అమాయకత్వాన్ని కాష్ చేసుకునే మహానుభావులూ వున్నారు. ఇది ప్రేమ మైకంలో పడింది. ఆ జ్వరంతోనే బాధపడుతోంది అనుకున్నాడు.

సంపత్ పైకి గంభీరంగా వుండేందుకు ప్రయత్నం చేసినా ఎంతోసేపు అక్కడ వుండలేక పోయాడు. కంచంలో చేయి కడుక్కుని వెళ్ళిపోయాడు.

ఆఖరికి కోకిల మామూలు మనిషైపోయింది.



మాధవ గదిలో కూర్చుని కోకిలవైపు దీర్ఘంగా చూస్తూండిపోయాడు. కోకిల నిర్భయంగా, సిగ్గుపడకుండా చెప్పేసింది. "అదేమిటో మాధవా పదిహేను రోజులక్రితమే ప్రభు ఎలా వుంటాడో అర్థం అయింది. ఇంతకాలం నేను చూసిన ప్రభుకీ ఇప్పటి ప్రభుకీ ఎంత బేధం వుందో తెలుసా? "

మాధవ విసుక్కున్నాడు "కోకిలా నువ్వేం చెప్పాలనుకుంటున్నావో నాకు అసలు అర్థం కావడం లేదు. ప్రభు ఎలా వుండేవాడు? ఇప్పుడెలా వున్నాడు? ఇక ముందు ఎలా వుండబోతాడు? యిదో పెద్ద కొంపలంటుకుపోయే విషయం కాదే. నీ ధోరణి నాకేం నచ్చడం లేదు. మనం ఎంత? మన వయసెంత? వాడూ మన ఫ్రెండే. వాడి గురించి నిద్రా, నీళ్లూ, కాలేజ్ మానేసి యీ పదిహేను రోజులూ ఇంట్లో కూర్చుని రీసెర్చ్ చేస్తుండిపోయావా?

కోకిల నవ్వి "లొ... ఐ లవ్ హిమ్. ఐ లివ్ విత్ హిమ్. అతనే నా ప్రాణం. నా వూపిరి అతని గుండెల్లో చిక్కుకుపోయింది. అతని పేరు వుచ్చరించని క్షణాలు లేవు.

ఇంచుమించు ప్రభు శబ్దం జపమాల అయి పోయింది తెలుసా?" అంది.

"ఓ! గాడ్" మాధవ వులిక్కిపడ్డాడు. భయపడ్డాడు. చుట్టూచూశాడు. తల్లీ తండ్రీ మధ్యాహ్నం భోజనం చేశాక ఓ కునుకు తీసేందుకు మేడమీద గదిలోకి వెళ్ళారు.

కోకిల మాత్రం ఆ హాల్లో వున్న సోఫాలో కాళ్ళు పైకి పెట్టుకుని బాసింపట్టు వేసి హాయిగా మాట్లాడేస్తోంది. మాధవని గమనిస్తోంది. మాధవ మొహం తుడుచుకున్నాడు. కర్చీఫ్‌ని మడతపెడుతూ, విప్పుతూ దిక్కులు చూస్తూ కిటికీ దగ్గర నిలుచున్నాడు.

"ఎందుకంత భయపడుతున్నావు?"

"నీ పైత్యం చూసి. అమ్మ వింటే..."

"వింటే ఏమౌతుంది మాధవా?"

అతను చిరాకుగా జుట్టు పీక్కున్నాడు. "నీకు అర్థంకాదు"

"ఎందుకు అర్థంకాదు మాధవా? ప్రేమ గురించి సముద్రపు లోతుల్నీ, హిమశిఖరాల ఎత్తునీ, ఆకాశం అంత విశాలాన్నీ, భూదేవంత బేస్‌నీ సోదాహరణలతో అధ్యయనాన్ని సమర్పించుకున్నాం. ప్రైజులు అందుకున్నాం. నేనైతే, మొక్కుబడిగా చెప్పలేదు. ఆ అనుభూతిని ఆస్వాదిస్తూ దాదాపు 'ప్రేమ' పాశంలో చిక్కుకుపోయి ఆ సమయంలో ప్రేమని నిర్వచించాను"

"బాప్‌రే" అతను రెండు చేతుల్తో చెవులు మూసుకున్నాడు. "నీకు పిచ్చెక్కింది" అన్నాడు ఆవేశంగా.

కోకిల చిన్నగా శబ్దం చేస్తూ నవ్వింది. వెంటనే గంభీరంగా మారిపోయింది. "ప్రభు నా బుగ్గమీద వేసిన చిటికె ఈ జన్మలో మరచిపోను. నేనతన్ని పెళ్ళి చేసుకుంటాను"

మాధవ ఆశ్చర్యపోయాడు "ఈ విషయం వాడు నాకు చెప్పలేదు. అసలు నీకు బుద్ధి వుందా? యింత చిన్న విషయాన్ని భూతద్దంలోంచి చూస్తున్నావు. నువ్వు అందరి పిల్లల్లాంటి దానివి కాదనుకున్నాను. పోనీ... నీకు చదువుకోవాలని వుందా? లేదా?"

"ప్రస్తుతం ఏదో చదివేసి, ఎవర్నో వుద్ధరించాలని మాత్రం లేదు" తాపీగా అంది.

"మనం చదివేది బోడి ఇంటర్మీడియట్. ఈ విషయం మీ ఇంట్లో తెలిస్తే మీ వాళ్ళేమీ అనరా?"

కోకిల వంటింట్లోకి వెళ్ళి చెంబుతో మంచి నీళ్ళు తెచ్చుకుంది. "నోరు ఎండిపోతోంది. మంచి నీళ్ళైనా అడగడం చేతకాదు. మిగిలిన విషయాల్లో భలే చురుగ్గా పని చేస్తుంది బుర్ర... మా వాళ్ళ గురించి నాకు తెలీదు. తెలిస్తే... అంత దూరం ఆలోచించడంలేదు. నా ఆలోచనలు ప్రభు చుట్టూ తిరుగుతున్నాయి.

"నేనూ ప్రభూ ఓ యింట్లో హాయిగా వుంటూ, తింటూ మామధ్య మా ఇద్దరి రూపాలు అలా కలియ తిరుగుతూ వుంటే ఎక్కడుంది సుఖం. యింతకంటే వేరే ఎక్కడుంది సౌఖ్యం, అంటూ పాడేసుకోమూ" అంది.

మాధవకి కళ్ళు బైర్లు కమ్మాయి. 'చిన్నప్పటినుంచీ వేలు పట్టుకుని, అతి జాగ్రత్తగా నడిపిస్తూ వచ్చిన స్నేహితురాలు. ప్రభు కూడా తనలాగే కోకిలకి మంచి స్నేహితుడు. ఆ విషయం కోకిల మరిచిపోయింది! కోకిల అందమైన మొహంలోకి తేరిపార చూస్తుండిపోయాడు. కొంచెం పొగరు, మరికొంత గర్వం, బోల్డు అమాయకత్వం, కడిగిన ముత్యంలాంటి మనసు. యిన్ని ఓ మనిషిలో వున్నాయంటే ఆ మనిషి నిస్సందేహంగా కోకిల తప్ప మరెవరూ కాదు.

అతనికి బాధేసింది. ఆ పిల్ల చేతిని పట్టుకుని సోఫాలో కూర్చోబెట్టాడు. "ఈమధ్య ఏ సినిమా చూశావు కోకిలా"

కోకిల విసురుగా తల తిప్పి కళ్ళు పెద్దవి చేసి చూస్తూ "టాపిక్ మారినట్లుంది

అవునా" అని అడిగింది.

"అదేంలేదు. తెలుసుకుందామని"

"తెలుసుకుని? "

"సైకియాట్రిస్టు దగ్గరకి తీసుకువెడదామని"

"ఛీ!" కోకిల అసహ్యించుకుంది. "నేనేమీ మానసిక రోగిని కాదు. నన్ను ఇన్‌డైరెక్ట్‌గా పిచ్చిదాన్నంటున్నావు. అవునా? "

"అయ్యో!" మాధవ నెత్తి మొత్తుకున్నాడు. "నన్నర్థం చేసుకో కోకిలా. ఇంత చిన్న వయసులో ప్రేమ, పెళ్ళి, సంసారం ఈ ఝుంఝూటంలో పడి పోవడం నేను



యాక్సెప్ట్ చేయలేకపోతున్నాను. ఓ.కే. ఆ విషయం వదిలేద్దాం. నీ జీవితం నీ యిష్టం. నేనెవర్ని మధ్యలో నిన్నేదో వుద్ధరించాలనుకునేందుకు"

"నేను వెళ్ళొస్తాను"

"నీ యిష్టం"

"నా యిష్టాన్ని గురించి కూడా ఆలోచించు మాధవా. ప్రపంచంలో బంధువులకీ, అయినవాళ్ళకీ, కన్నవాళ్ళకీ, మనల్ని కన్నవాళ్ళకీ కూడా దూరం అయి బతకగలమేమో గానీ ప్రాణస్నేహితుల్ని వదిలేసి బతకడం



మాత్రం కష్టం. 'నేను వెడుతున్నాను' అని చెప్పగానే నువ్వు నీ యిష్టం అన్నావు. నన్న సలు వెళ్ళనిచ్చేవాడివా? "

మాధవ నిశ్శబ్దంగా వుండిపోయాడు.

"మాట్లాడు మాధవా? ఈ పదిహేన్రోజు ల్నుంచీ నేనెంత హైరాన పడిపోయానో తెలుసా? ప్రేమ పంచుకుందుకు ఓ ఫ్రెండ్ చాలా అవసరం అని కూడా అర్థం అయింది" కోకిల మొహంలో రక్తం తోడేసినట్లు అయిపోయింది. అప్పటిదాకా అల్లరిగా మాట్లాడిన ఆ పిల్ల క్షణంలో సామ్రాజ్యాన్ని పోగొట్టుకున్న మహారాణిలా కనిపించింది మాధవ కంటికి. అతను జాలిగా చూశాడు.

కోకిల చున్నీ కొసతో వేలిని చుడుతూ తీసేస్తోంది. మాటల్ని కూడదీసుకుని "నాకెందుకో బెంగగా వుంది మాధవా. అసలే ప్రభు నాన్నగారు విశ్వామిత్రుడిలా, దూర్వాసుడిలా కనిపిస్తారు. అసలింతవ రకూ ప్రభు ఒక్కసారి కూడా మా ఇంటికి రాలేదు. నువ్వంటే వూళ్లో లేవనుకో" అంది విచారంగా.

మాధవకి కోపం వస్తోంది. చేతి గుప్పెళ్ళు బిగించి తెరుస్తూ కోపాన్ని పోగొ ట్టుకునే ప్రయత్నం చేస్తున్నాడు. మొహం మీదా, కంఠం మీదా, పిడికిళ్ళ మీదా రక్తంతో నరాలు నిండిపోయి వుబ్బెత్తుగా కనిపిస్తున్నాయి. తనను తాను కంట్రోల్ చేసుకుని స్వచ్ఛంగా నవ్వాడు. "పోనీ కోకిలా, ముందీవిషయం చెప్పు. ఈ మధ్య ఏం సినిమాలు చూశావు? "

"నువ్వేమిటి? నేను సీరియస్‌గా ఏదో విషయం చెప్పబోతుంటే ఏం సినిమా చూశావని అడుగుతున్నావు? అసలే నా మనసు బావులేదురా అని నేను ఏడుస్తుంటే నీకేం తమాషాగా వుందా? "

"లేదు కోకిలా వట్టినే తెలుసుకోవాల నుంది. ఈ మధ్య నాకు ఐడియా వచ్చింది కోకిలా. ఓ సినిమా తీయాలని"

కోకిల విషయం వింటూనే నిటారుగా అయింది. నమ్మలేనట్లు అతని వేపే చూస్తుండిపోయింది. మాటలన్నీ గొంతు కడ్డు పడిపోయాయి. పెగిలి రావడంలేదు.

"చెప్పు కోకిలా ఏ సినిమాలు చూశావో విని నేనో ప్రణాళికని సిద్ధంచేసుకోవాలమ్మా"

"నమ్మశక్యం కావడంలేదు మాధవా? "

"కోకిలా నువ్వు నమ్మాలి. ఈ వ్యాపా రంలో ఎంత లాభం వుంటుందో తెలుసా? "

కోకిల కనుబొమ్మలు ముడిపడ్డాయి "మాధవా ఈ టాపిక్ బొత్తిగా బాగులేదు. అసంబద్ధంగా వుంది. నువ్వేమిటీ? సిని మాలు తీయడం ఏమిటి? "

మాధవ లేచి "అలా బయటికి పోయి మాట్లాడుకుందాం" అన్నాడు. అతను వాకిట్లో వున్న చిన్నపాటి తోటలోకి దారితీ శాడు. అక్కడున్న మొక్కలు 'స్పెషల్'గా వుంటాయి. కోకిల వాటివైపే చూస్తోంది. మే నెల పదిహేను తర్వాత ఎర్రటి పూలు పూస్తాయి. అవి గుండుసూదులు ఒక దాంట్లో మరోటి గుచ్చినట్లువుండి ఎర్రగా మెరుస్తూంటాయి. ఓవైపు మొటాంగో తీగలు పందిరిలా అల్లుకుని ఎండని ఆపే స్తున్నాయి. "ఇక్కడ చాలా బావుంది" అంది కోకిల.

"చెప్పు ఏయే సినిమాలు చూశావు"

కోకిల దీర్ఘంగా నిట్టూర్చింది. "వదలవన్న మాట. అయితే విను. "నీ ప్రేమ గుళ్ళో నీకు గుడి కడతా", గుండెకి చిల్లుపడింది. "ఈ గుండెనీదే" నీ ప్రేమా నా పెళ్ళీ,

"అయ్యబాబోయ్" తేలుకుట్టినట్లు అరిచే శాడు మాధవ.

హడిలిపోయింది కోకిల. "ఎంత గట్టిగా అరిచావో తెలుసా? ఆంటీ, అంకుల్ లేచి వచ్చేస్తారేమో. మరీ అంత గుండె బాదు కుంటావేం? "

"ఆ పేర్లు చూసి"

"కథలు బావున్నాయిగా"

"కోకిలా ఈ టైటిల్స్‌లో అర్థం ఏమైనా వుందా? "

"మాధవా నీలాంటి వెజిటేరియన్లకేం తెలుస్తుంది? సినిమా చూడాలనే ఇంటరెస్ట్ వుంటే అప్పుడు మాట్లాడచ్చు ప్లీజ్! ఆబాల గోపాలాన్నీ అలరించి ఆనందపరిచే ఏకైక సాధనం సినిమా. కనీసం ఆ విషయం తెలుసా? "

"నువ్వూ మీ ఫ్రెండ్స్ విజయలక్ష్మీ, శారదా వీళ్ళు మేధావులండీ. చెప్పొచ్చారు"

"నువ్వూ చూస్తావుగా ఇంగ్లీషు సినిమాలు"

"నీ అంత పిచ్చి లేదు"

"ఏ రాయి అయితేనేం తల పగలకొట్టుకోవడానికి"

మాధవ చిరాకుపడ్డాడు. "రేపు కాలేజ్‌కి వస్తున్నావా? "

కోకిల ఆలోచనలో పడి వెంటనే తేరుకుంది. "నువ్వు సినిమా తీస్తానని చెప్పినట్లున్నావు? "

మాధవ వ్యంగ్యంగా నవ్వాడు. "చిన్నప్పుడు టీవీ వచ్చిన కొత్తలో పెద్దవాళ్లు యిలాగే తెగ బాధపడిపోయేవాళ్లు"

"ఎలాగట? " అంతకంటే వ్యంగ్యంగా అంది కోకిల.

"టీవీ చూసి. చిన్ననోట పెద్దార్భులు అని... సరేనా? "

కోకిల లేచినిలుచుంది. "బుద్ధి గడ్డితిని యిలా వచ్చాను. ఇంట్లో వుంటే తిన్నది అరగదు కదా"

మాధవ శాంతంగా ఆమె వైపు చూసి "సారీ కోకిలా. నువ్వీమధ్య బాలేవు. అందుకే నిన్ను యిన్నిరకాలుగా యిబ్బంది పెట్టాల్సివచ్చింది. నీ విషయంలో నేను జోక్యం చేసుకోవడం నచ్చకపోతే చెప్పు. నా హద్దులో నేనుంటాను" అన్నాడు.

కోకిల బయలుదేరింది.

"రేపు తప్పకుండా రా. నేను కాలేజ్‌కి వెళ్ళడంలేదు"

కోకిల మూతితిప్పి గిరుక్కున తిరిగి వెళ్ళిపోయింది.

మాధవ తల్లీతండ్రీ కిందికి వచ్చారు.

కాత్యాయని అడిగింది. "కోకిల ఎప్పుడు వచ్చిందీ, ఎప్పుడు వెళ్ళిపోయింది? "

"గంటలతరబడి టైమ్ వేస్ట్ చేసుకోవడం ఎందుకురా మాధవా! ఈ రోజుల్లో పెద్ద చదువులు చదవాలంటే అన్నం నీళ్లు తాగడం కూడా మరిచిపోవాలి. పనికిరాని కబుర్లతో కాలం వృధాచేసుకుంటే ఫ్యూచర్ వుండదు" నారాయణరావు కోపంగా అన్నాడు.

మాధవకి మొహంమీద నీళ్ళు చల్లినట్లయింది. 'తన తల్లీతండ్రీ యింత నిశితంగా చూస్తున్నారనుకోలేదు. ఇవాళ కొత్తగా ఏం మాట్లాడలేదే. రెండురోజుల్లో కోకిల ప్రేమ జ్వరం వూరంతా వ్యాపించిపోయింది. ఆ పిచ్చిది యిష్టం వచ్చినట్లు ఎక్కడ పడితే అక్కడ వాగినట్లుంది. ఇది తల్లీతండ్రీ నోటీసుకి వచ్చి వుంటుంది. అందుకే అమ్మా నాన్నా హెచ్చరికలు చేస్తున్నారు.

"ఏవిట్రా అలా మాటా పలుకూ లేకుండా అయిపోయావు. మా ఫ్రెండ్స్ పిల్లలందరూ ట్యుటోరియల్స్‌లో చేరుతున్నారు. కొంత మంది పిల్లలైతే టెన్త్ నుంచీ వెడుతున్నారు. అసలు నీకు చదువుకునే వుద్దేశ్యం వుందా లేదా? " ఆయనకి చికాకుగా వుంది.

మాధవ తేరుకున్నాడు. "నేనూ, ప్రభూ, కోకిలా మాట్లాడివచ్చాం డాడీ. నారాయణగూడా, వై.ఎమ్.సి.ఎ ప్రాంతాల్లో పేరున్న ఇన్‌స్టిట్యూట్స్ వున్నాయి. అక్కడికి వెళ్ళి తెలుసుకుంటే బాచెస్ నెక్ట్స్‌మంత్ నుంచీ మొదలౌతాయని చెప్పారు"

నారాయణరావు కనుబొమ్మలు ముడిపడిపోయాయి. "ఇంత వరకూ కలిసి చదివింది చాలు. ఇంక వాళ్ళిద్దరితో నీకెందుకు? నువ్వు మాత్రం వాళ్ళిద్దరూ చేరే ట్యుటోరియల్స్‌లో చేరనవసరం లేదు"

"ఎందుక డాడీ... వాళ్లు"

# ఏరిన ముత్యాలు

★ ఆత్మవిచారణే లక్ష్యసిద్ధికి దారితీస్తుంది

– పతంజలి

★ సుఖం ఆనందం కాదనీ, ఆకర్షణ సౌందర్యం కాదనీ గుర్తించు

– ఠాగూర్

★ మేలుకున్నవారికే ఉషోదయం అవుతుంది

– అగ్నిస్ గిల్ ఫోయిల్

★ ఆగ్రహం తాత్కాలిక ఉన్మాదం

–హోరేస్

★ సాహసం వల్ల పౌరుషం, వెనుకంజ వెయ్యడంవల్ల భయం పెరుగుతాయి

– ప్యూబ్లియన్ సైరస్

★ కలలు నిజం చేసుకోవడానికి ఉత్తమమైన మార్గం మేలుకోవడం

– ఐన్‌స్టీన్

★ తప్పు చెయ్యడంకన్న వాయిదా వెయ్యడం ఉత్తమం

– జెఫర్‌సన్

★ నీ వ్యక్తిత్వంలో గుప్తంగా ఉన్న భాగమే నీ నిజమైన స్వరూపం

–డ్వైట్ ఎల్.మూడీ

★ అనిశ్చితమైనదానిని నమ్మి నిశ్చితమైనదానిని కోల్పోతే రెండూ నీకు దక్కవు

–సంస్కృత సామెత

★ నీ ప్రధానమైన దుర్గం నీ మనసు. దాన్ని కోల్పోతే పోరాటంలో ఓటమి తప్పదు

– రాజాజీ

★ దుబారా దారిద్ర్యానికీ, దారిద్ర్యం పారతంత్రానికి, అటుపై అవినీతికీ దారి తీస్తాయి

– జాన్సన్

★ కచ్చితమైన రోగ నిర్ధారణ ముప్పాతిక చికిత్సతో సమానం

– మహాత్మాగాంధీ

★ మన అభివృద్ధికి బద్ధ విరోధి అసహనం

– డా॥రాధాకృష్ణన్

★ మోసగాడిని మోసగించడం రెండింతల ఆనందాన్నిస్తుంది

– లాఫొంటేన్

★ కలవాడికీ లేనివాడికీ మధ్య అగాధాన్ని పూడ్చకపోతే స్వరాజ్యానికి అర్ధం లేదు

– అబుల్ కలాం అజాద్

సేకరణ: పి.వి.రమణకుమార్

"చెప్పింది విను" ఆయన గర్జించాడు. మాధవ జవాబు చెప్పలేదు. నారాయణ రావు అంతటితో ఆగక భార్యతో గొంతు పెంచి "ఇదిగో ఇన్నాళ్లూ వీణ్ణి అమ్మాయి దగ్గరకి పంపించి ఆ ఇంజనీరింగేదో డొనేషన్ కట్టి అయినా చదివించాలనుకున్నాను" అన్నాడు బుసలుకొడుతున్నట్లే.

"చేయి జారిపోతున్నారీ కాలం పిల్లలు. అయినా పిల్లలెప్పుడూ తల్లితండ్రుల అదుపులో పెరిగితేనే మంచిది." బెంగాల్ టైగర్‌లా కనిపిస్తున్నాడు తండ్రి మాధవ కంటికి. అతను కిక్కురుమనలేదు.

'నిన్నటివరకూ అద్భుతంగా అనిపించిన జీవితం యివాళ చేదు మింగినట్లుగా వుంది. ఎప్పటికీ కలిసే వుంటారనుకుంటే యిలా చీలిపోవడం ఏమిటి? '

అంతటితో వూరుకోలేదు నారాయణ రావు.

"ఒకటికి రెండు సార్లు ప్రయత్నం చేయి. ఎం. సెట్‌లో రాకపోతే అప్పుడు బి.ఎస్సీ చేద్దువుగాని. నిన్నో ఇంజనీరుగా చూడాలనుకున్నాను. నీకు వయసొచ్చిందన్న విషయం వాళ్ళు మరచిపోయారో ఏంపాడో చూడు మాధవా" నారాయణ రావు అన్నాడు.

మాధవ తలెత్తాడు "చెప్పండి డాడీ"

"మొన్నటిదాకా ఆ పిల్లని అదే కోకిలని నీ సైకిలుమీదా, స్కూటరుమీదా తీసుకువెళ్ళావు. తీసుకువచ్చావు. నీతోబాటే ఆ ప్రభుగాడు కూడా చెట్టాపట్టాలేసుకుని తిరిగాడు. ఇంక చాలు. వెర్రివెర్రి వేషాలు వేయకుండా ఎవరి దారిన వాళ్ళు వుండండి. ఆ అమ్మాయి మనింటికి యికముందు చీటికీ మాటికీ రానవసరంలేదు. అర్థం అయిందా? "

"సరే డాడీ"

"సరే కాదు నువ్వు ఫోన్ చేసి ఈ విషయం చెబితే యిట్స్ ఓ. కే. లేదంటే ఆ పిల్ల తల్లితండ్రులకి నేను చేయాల్సివస్తుంది"

హడిలిపోయాడు మాధవ, "నేను చెబుతాను లెండి" అన్నాడు.

కాత్యాయనికి ఏం చేయాలో తోచలేదు. ఎక్కువగా మాట్లాడని అతను యివాళ లెక్చరిచ్చినట్లు కొడుకుని కడిగి పారేస్తున్నాడు. తగిన కారణం లేకపోతే ఎందుకు అరుస్తాడాయన? అక్కడినుంచి వెళ్ళిపోతూంటే "ఇదిగో" అని పిలిచి "పిల్లలవైపు ఓ కన్నేసి వుంచాలని తెలియదూ? " అని విసుక్కున్నాడు. ఆమె మాట్లాడలేదు. అతను చెప్పిన విషయం ముఖ్యమైనదే. తన బాధ్యత కూడా ఉంది.

"మీకు కాఫీ ఇవ్వనా? " అని అడిగింది.

అతను "ఇవ్వు" అన్నాడు.

అప్పటికి అతని ఆవేశం తగ్గింది.

మాధవ లేచి వెళ్లి టీవీ ఆన్ చేసి కూర్చున్నాడు. హితబోధలు తలకెక్కి చిరాకు తెప్పిస్తున్నాయి.

★ ★ ★

గుడికి ఎదురుగా గోడ పక్కగా వేప చెట్టు, రావిచెట్టు ఎప్పటినుంచో ఉన్నాయి. చీకటైతే అందరూ లోపల తలుపులు వేసుకుంటారు. వేసవిలో ఉన్న సందడి ఉండదు. చలికాలం అయితే త్వరగా పనులు పూర్తిచేసుకుంటారు.

రెండుమూడు రోజులనుంచీ కోకిల తల పగిలిపోయేటట్లు ఆలోచిస్తోంది. పగలూ, రాత్రీ కూడా ప్రభు కనిపించడంలేదు. ఎక్కడికి వెళ్లాడో ఎవర్ని అడిగితే బావుంటుంది? ఎవరు చెబుతారు? మాధవని పంపించాలంటే మాధవ రావద్దనీ, తల్లీ తండ్రీ మండిపడుతున్నారనీ చిన్న చీటీ యాదమ్మ కొడుకుతో పంపించాడు. ఆ విషయం తెలియనట్లయితే ఎప్పటిలాగే కూనిరాగాలు తీస్తూ వాళ్లింటికి వెళ్లేది. ఆ తర్వాత కొంపలంటుకుపోయేవి.

ఆ నారాయణరావు తననీ, తల్లిదండ్రుల్నీ దుర్భాషలాడితే కాంపౌండ్ మొత్తం చోద్యం

చూసేది. అదృష్టంకొద్దీ ఆ ప్రమాదం తప్పిపోయింది.

ఇప్పుడు అర్జంటుగా ప్రభుని కలుసుకోవాలి. కలుసుకుని ఏంచేయాలో నిర్ణయించేసుకుంటే ఓపన్నైపోతుంది. కోకిల కాలుకాలిన పిల్లిలా తిరుగుతూంటే సబిత అడిగింది. "ఒంట్లో బాగుండలేదా కోకిలా? ఎందుకలా పచార్లు చేస్తున్నావు? "

పరధ్యానంగా ఉన్న కోకిల ఓసారి కెవ్వుమంది.

"ఏమైంది కోకిలా? అంత భయపడుతున్నావేమిటీ? "

"ఏంలేదు వదినా! ఏదో ఆలోచిస్తోంటే... ఉలిక్కిపడి అనుకోకుండా అరిచేశాను"

సబితకి జాలేసింది. మాధవ తండ్రి నడిరోడ్డులో సంపత్‌ని పట్టుకుని దులిపేశాడు. తట్టుకోలేక తనూ ఛెడామడా తిట్టానని సంపత్ తనతో చెప్పాడు. ఇంకానయం మామగారికీ అత్తగారికీ అసలీ విషయాలేవీ తెలియవు. కోకిల చదవడంలేదు. దేనిమీదా శ్రద్ధ ఉండడం లేదు. పుస్తకాలు ముందు వేసుకుని చదువుతున్నట్లు నటిస్తోంది. అత్తగారు ఇవన్నీ ఆలోచించదు. ఆవిడ అసలు సిసలు సత్తెకాలపు మనిషి.

"కోకిలా! అన్నం తిందాం వస్తావా? "

భోజనాల టైము అయిందంటే రాత్రి ఎనిమిదిగంటలవుతోందన్న మాట. కోకిలకి ఏడుపు వస్తోంది. 'ఇప్పుడున్న పరిస్థితుల్లో తను డైనింగ్ టేబిల్ దగ్గరకు రాకపోతే అందరూ ఒకళ్ల తర్వాత మరొకళ్లుగా జాలి చూపించేస్తారు'

'కాళ్లు నొప్పా? తలనొప్పా? అని సపర్యలు చేస్తారు. అసలు ప్రభు లేకపోతే ఎలా? '

"ఏమ్మా చదువుకుని వచ్చావా? కళ్లు చూడు ఎంత ఎర్రగా వున్నాయో. ఈ ఏడు కాకపోతే వచ్చే ఏడు చదువుకుందువుగాని. ఆరోగ్యం పాడుచేసుకుని చదవకు" శ్రీనివాసమూర్తి కూతుర్ని చూసి బాధపడ్డాడు.

"అదేం లేదు డాడీ. నిద్రపోవాలనుకుంటే మైకులో పాటలు డిస్టర్బ్ చేశాయి. నిద్ర చెడిపోయింది" అంది.

శ్రీనివాసమూర్తికి ఛుర్రుమంది. "సంపత్! పొద్దుటినుంచీ చూస్తున్నాను. చెవులు చిల్లులు పడిపోతున్నాయి. ఇన్ని ఇళ్లూ, ఇంతమంది జనం ఉన్నారు. ఒకళ్లయినా ఈ సౌండ్ పొల్యూషన్ గురించి చర్య తీసుకోరేమిట్రా? వాళ్ల ఇళ్లల్లోకూడా పిల్లలున్నారు. వాళ్లైనా పట్టించుకోరేం?

"గవర్నమెంట్ ఇంత సౌండ్ కూడదని చెప్పినా రూల్స్ పాటించరేం? ఈ సౌండ్ పొల్యూషన్‌తో తలనొప్పి, మానసిక బాధలూ ఉన్నవాళ్లకి ఎంత బాధాకరంగా ఉంటుందో ఆలోచించరేం? "

"డాడీ!" సంపత్ నెమ్మదిగా అన్నాడు. "పొద్దుట్నుంచీ మీరీ విషయమే పట్టించుకోలేదు. ఇప్పుడు మీ కూతురు కంప్లయింట్ ఇవ్వగానే మీరు వాళ్ల మీద ధ్వజమెత్తుతున్నారు. మన కోకిలకే కాదు, ఇరుగు పొరుగు పిల్లలు కూడా బాధపడతారని ఆలోచిస్తున్నారా? వాళ్లకోసం మీరే వెళ్లి వాళ్లకి చెప్పి రావచ్చు ఏమంటారు? "

"సంపత్! నువ్వు వెళ్లి చెప్పిరా. బావుంటుంది"

"ఓహో" సంపత్ దీర్ఘం తీశాడు. "నేను వెళ్ళలేను డాడీ. వాళ్ళ ఇంట్లో జరిగే శుభకార్యం. అందులో భాగంగా వాళ్ళందరూ సంతోషంతో ఛిందులు వేస్తుంటారు. వాళ్ళ ఆనందంలో నేను నీళ్ళు పోయలేను. ఇదే మీ రోజువారి కార్యక్రమం కాదు. పోనీండి మనమే ఓర్చుకుంటే పోలేదూ"

శ్రీనివాసమూర్తి మాట్లాడలేకపోయాడు. రేపొద్దున్న కోకిలకి పెళ్ళి చేస్తే డప్పూ డోలుతోపాటు సిక్కుబాండ్ పెట్టిస్తాడు. సన్నాయిమేళం కూడా వుంటుంది. రాత్రి ఊరేగింపుకి తీసుకువెళ్ళేప్పుడు తూటాలు, చిచ్చుబుడ్లూ ఇవన్నీ ఏర్పాట్లు చేస్తాడు. పది మందీ ఘనంగా చెప్పుకోవద్దూ. ఈమాటే

కోకిలకి చెప్పాడు. కోకిల గుండె జారిపోయి నట్లయింది. నెమ్మదిగా జారుకుంది. మరో ముద్ద తిని వుంటే భళ్ళుమన్న వాంతితో బాటు అన్ని విషయాలూ బట్టబయలు అయిపోయేవే.

కోకిల తన గదిలోకి వెళ్ళి మంచంమీద వాలిపోయి దుప్పటి ముసుగులో దూరింది. కళ్ళ నీళ్లు తలగడని తడుపుతున్నాయి. తండ్రి గారాబం చేశాడనీ, ఈగ వాలనీయ డనీ తెలుసు. కానీ ఇంత దూరం ఆలో చించి తనమీద ఇన్ని ఆశలు పెట్టుకున్నా డని తెలీదు. అసలు ఆలోచించనేలేదు. ఇప్పుడీ సమస్యకి పరిష్కారం ఎలా? ప్రభుని రేపు ఎలాగైనా కలుసుకుని తీరాలి. కోకిల అప్పటికి తేరుకుంది.

'రేపు ప్రభుని కలుసుకుంటుంది దట్సాల్'

★ ★ ★

బిర్లామందిర్ గుడి ఆవరణలో కూర్చుని తరిగిపోయే నీరెండనీ, వెలుగుతున్న విద్యు ద్దీపాలనీ చూడడం ప్రభుకి ఇష్టం, ప్రభుతో పాటు తనకి కూడా.

ప్రభు కళ్ళద్దాలు కర్చీఫ్‌తో తుడుచుకుని మళ్ళీ పెట్టుకోవడం కోకిల కంటపడింది.

అల్లంత దూరంనుంచి అమ్మాయి పరిగె త్తుకుని వచ్చి అబ్బాయిని వాటేసుకుని 'ప్రభూ... ప్రభూ... ప్రభూ, ఐ లౌయ్యూ సోమచ్' అనేందుకు ఇది సినిమా కాదు జీవితం అనుకుంది. నవ్వూ ఏడుపూ కలిసి ఆమెని ఊపిరాడనీయడంలేదు. మెట్లెక్కి అతని దగ్గరకి వెళ్ళింది.

చాలా సేపటినుంచి ఆమెకోసమే ఎదురు చూస్తున్న ప్రభు "రా, కోకిలా..." అని కొంచెం వెనుకకి జరిగి తను కూర్చుంటూ "కూర్చో" అన్నాడు.

కోకిల చెంపలు వేసుకుని దణ్ణం పెట్టు కుంది.

"ఇప్పుడు చెప్పు ఏమైంది? ఎందుకు కబురు చేశావు? కోకిలా చాలారోజులు నీతో గడిపాను. తప్పుఒప్పుల సంగతి నాకు తెలీదు. కానీ నిజం మాత్రం తెలిసింది"

కోకిల కనుబొమ్మలు ముడివడ్డాయి. "నీకీ విషయం తెలుసా? నేనెంత అవసరం వుంటే నీకు ఫోన్ చేశానో, కబురు చేశానో ఆలోచించావా? నువ్వు తెలుసుకున్న నిజం ఏమిటి? త్వరగా చెప్పు. ఇంకా నీతో కబుర్లు చెబుతూంటే టైమ్ గడిచిపోతుంటే టైమ్ గడిచిపోయి నా కొంపలంటుకుపో తాయి"

అతను చుట్టూ చూశాడు. అంతకంతకు భక్తులతో రద్దీ పెరుగుతోంది. కూర్చోవడం కూడా అంత బావుండదు. భక్తులుండాల్సిన ప్రదేశంలో ప్రేమ పక్షులుంటే ఏం బావుం టుంది. ప్రభు లేచి నిలుచుని "ఓసారి స్వామి దర్శనం చేసుకుని వెడదాం పద" అన్నాడు చేతిని అందిస్తూ. మరో సమ యంలో అయితే ఆ చేతిని అందుకునేది కాదు కోకిల.

తనకి తనే భారంగా వుంది. నేలమీద కూర్చుంటే ఆసరా కావాలనిపిస్తోంది.

"ఆ తర్వాత ఎక్కడికి వెడదాం ప్రభూ! నీతో ఏమని చెప్పాను? నీ అవసరం నాకు చాలా వుందని చెప్పలేదూ. నా మాట విన కుండా తాపీగా మాట్లాడుతున్నావేమిటి? "

"కోకిలా ముందు గుళ్ళోకి వెళ్ళి తర్వాత మాట్లాడుకుందాం"

కోకిలకి కోపం వచ్చింది. వెంటనే సర్దు కుంది. క్రమంగా అక్కడ 'క్యూ' పెరుగు తోంది. ఆ క్యూలో నిలబడటం, ముందుకు జరగడమే కష్టంగా వుంది. మాట్లాడుకో వడం అంత సులభం కాదని కళ్ళు మూసు కుంది.

దేవుణ్ణి దర్శించుకుందుకు అరగంట పట్టింది. కోకిల ఆ మెట్లు, రెండువైపులా చిన్న గోడా వీటిని చూస్తూ నెమ్మదిగా నడు స్తోంది. ప్రభు చేతిని పట్టుకుని పరిగెత్తిన రోజులు గుర్తు వస్తున్నాయి. తొమ్మిది గంటలకి కాలేజీలో స్పెషల్ క్లాసులున్నా



యని చెప్పి బయలుదేరి బాలాజీ గుడి దగ్గర ఎదురుచూసేది. అల్లంత దూరం నుంచే నవ్వుతూ వచ్చే ప్రభుని ఆ టైమ్‌లో ఆ రోడ్‌లో వెళ్లే కాలేజీ పిల్లలు కూడా చూసేవారు.

ఇద్దరూ కలిసి గుళ్ళో దండం పెట్టుకుని దేవుడికి నైవేద్యం పెట్టిన ప్రసాదం, పాలకోవాని దాచుకునేవాళ్ళు. ఇక్కడా అక్కడా అని గమ్యం లేకుండా వూరంతా తిరిగేవాళ్ళు.

హోటళ్లూ, సినిమాలూ, గుళ్ళూ, పార్కులూ-డబ్బుని మంచినీళ్ళలా ఖర్చుపెట్టేవాళ్ళు. కోకిలకి ఆయాసంతో నిట్టూర్పు వచ్చింది.

అప్పుడైతే అతను గట్టిగా పట్టుకునేవాడు.

'ఇప్పుడు చెయ్యి వదిలేశాడేవిటి? '

'అదంతే... ప్రతి మనిషిలో రెండో మనిషి ఎప్పుడూ తొంగిచూస్తూంటాడు. అవసరం అనిపించినప్పుడే పైకి వస్తాడు. తనకి చేయి ఇచ్చాడు. ఆ వాలకంచూస్తే అసలు ప్రభు ఇతనేనా అనిపిస్తోంది.

కోకిలకి ఎదురుదెబ్బ తగిలి ముందుకు పడబోయింది. వెంటనే తమాయించుకుంది.

ప్రభు నిశ్శబ్దంగా వస్తున్నాడు.

ఒకప్పుడు "జాగ్రత్త కోకీ" అనేవాడు. ఇప్పుడు తను జాగ్రత్తపడుతున్నాడు.

నడుస్తూంటే దారి ఎంతకీ తరగడంలేదు.

"ఇప్పుడు ఇంత రాత్రవుతూంటే ఎక్కడికి వెడదాం? " కోకిలకి గాబరాగా వుంది.

"పార్కులో కూర్చుంటే పోలీసులు పట్టుకెళతారు"

"నీకేమైనా కొత్తా? మా ఇంటికిరా ప్రభూ. మా ఇంట్లో నా గదిలో ఎప్పటిలాగే కూర్చుని మాట్లాడుకుందాం. ఎవరూ ఏమీ అనరు"

నడుస్తున్నవాడల్లా కాళ్ళు నేలకి అతుక్కుపోయినట్లు ఆగిపోయి "నీకేమైనా మతిపోయిందా. మా నాన్నగారు మనల్ని చాలా సార్లు చూశార్ట. నీకా పిల్లతో ఏంపనిరా? అని కేకలు పెట్టారు. నన్నసలు నోరెత్తనిస్తేగా..."

"అయితే ఏం? నువ్వు భయపడ్డం దేనికి? "

"కోకిలా... నాకంత ధైర్యం వుందనే అనుకుంటున్నావా? "

"అందరూ ఇటే చూస్తున్నారు ప్రభూ. నువ్వు మా ఇంటికి నాతో వస్తున్నావు"

"నీకు మతిపోయింది"

"సంతోషం..." కోకిలని ఉక్రోషం, ఆగ్రహం సివంగిని చేశాయి.

"ఇదివరకు వచ్చినట్లు మీ ఇంటికి ఇప్పుడు రాలేను"

"నా సమస్య పరిష్కారం చేసి, ఆ తరువాత ఏమైనా చేయి"

"ఛాయిస్ నాదే అయినప్పుడు సమస్యా... దానికి పరిష్కారం అనే ప్రశ్నే లేదు. ఆ పాట్లేవో నువ్వే పడు. కోకిలా నాకు టైమ్‌లేదు. నేను టైమ్‌కి ఇంట్లో వుండకపోతే నాన్నగారు చంపేస్తారు"

కోకిల అతనివైపు చూసింది. "నేను రెండు పన్లు చేయగలను. ఒకటి నీ కాలరు పుచ్చుకుని ఇంతమందిలో నీ పరువు పోయేట్లు చేయడం... జన్మలో తలెత్తుకోలేవు. నీమీద నాకున్న ప్రేమ నన్ను అంత దూరం పోనీయడం లేదు. రెండవది మీ నాన్నగారి దగ్గరకు పోలీసుల్ని పంపించడం..."

"కోకిలా...!" అతను నమ్మలేనట్లు చూశాడు.

"అందుకని సమస్య.... పరిష్కారం... అంటూ కూర్చోకు. ఏదో ఒకటి చేయాల్సిన బాధ్యత నీకుంది"

"రైట్" అన్నాడు ప్రభు. "టూరిస్ట్ హోటల్ కెడదాం. అక్కడ మాట్లాడుకుందాం..."

అతని బైక్‌మీద కూర్చున్నా కోకిల అతని మెడచుట్టూ, భుజంమీదా, తొడమీదా, నడుం ఒంపులో చేతిని వెయ్యలేదు. బైక్‌ని

అనుకూలంగా ఉన్నచోట గట్టిగా పట్టుకుంది.

అతను రివ్వున పోనిస్తుంటే కోకిల మండిపడింది. "ఇంత స్పీడుగా తీసుకువెడుతున్నావు. పడితే చచ్చిపోతాననుకుంటున్నావేమో ప్రభూ... మరణవాఙ్మూలం ఇస్తే గానీ ప్రాణాలు వదలను"

ప్రభు వేగాన్ని తగ్గించేశాడు.

టూరిస్టు హోటల్‌లోకి వెళ్లగానే మళ్లీ జ్ఞాపకాలు ముసురుకున్నాయి. ప్రభు చెబుతున్నాడు... తను వింటోంది.

"కోకిలా! చాలామంది భోజనం, టిఫిను, ఇలా ఏదో ఒకటి హోటల్‌లో తీసుకునేటప్పుడు చెప్పులు వదలరు."

"అయితే? "

"నువ్వు చాదస్తం అనుకో, తెలివి లేదనుకో, కానీ అలా చేయడం మంచి పద్ధతి కాదు. అన్నం పరబ్రహ్మ స్వరూపం. ఆ అన్నంకోసం ఎన్నో తిప్పలు పడతాం... అటువంటి అన్నానికి మనం మర్యాద ఇవ్వాలి అర్థం అయ్యిందా? "

అనుకోకుండా చెప్పులు వదిలేసింది కోకిల. ఇప్పుడు కూడా అతను ఎప్పుడూ కూర్చునే కార్నర్‌లో కూర్చున్నాడు.

హోటల్‌లో సర్వర్లందరికీ ఈ జంట తెలుసు. మెనూ చెప్పకుండానే రెండు ప్లేట్ల ఇడ్లీ తెచ్చిపెట్టి వెళ్ళిపోయాడు.

"నాకు భయం వేస్తోంది"

"నిమిషానికి తొంభైసార్లు భయం అంటూనే వుంటావు. ఆ తరువాత ఏమిటో అది చెప్పు" విసుక్కుంటూ వాచీ చూసుకున్నాడు. అతను నవ్వితే పువ్వులు జలజలా రాలినట్లూ, ఆ పూలవానలో తను తడిసినట్లూ వుండేది. ఇప్పుడు అతను మాట్లాడుతూ, మాట్లాడుతూ చేతివాచీ చూసుకుంటున్నాడు. కనుబొమ్మలు చిట్లిస్తున్నాడు. ఎందుకలా?

"చెప్పు కోకిలా..."

కోకిల చేతిగోళ్ళు చూసుకుంటూ ఆ చిన్న లైటు కాంతిలో మొహంలో హావభావాలు కనిపించనీయకుండా జాగ్రత్తపడింది.

"చెప్పవేం" ఖస్సుమన్నాడు అతను.

కోకిల గొంతు విప్పింది "నౌ ఐయామ్ కారియింగ్ యువర్ బేబీ, యూ నో..."

ఆ హోలు దద్దరిల్లింది. పలచగా వున్న జనాలు ఒక్కసారిగా ఇటు తిరిగారు. రెండు చేతుల్తో మొహం కప్పుకుని నిలుచుంది కోకిల. ఏడుస్తోందో, నవ్వుతోందో తెలీడంలేదు. అసలా అమ్మాయి నిజంగా అందో, తమాషా చేస్తోందో ఎవరికీ అంతు చిక్కలేదు.

బిల్ తీసుకుని కౌంటర్‌లో కట్టాడు. బిల్లుతెమ్మని ఎప్పుడు చెప్పాడో కూడా అర్థం కాలేదు. తెల్లబోయి చూస్తున్న వాళ్ళతో బేరర్ గొణుగుతున్నట్లు అన్నాడు. "పతా నహీ... క్యా హువా కీ... సాబ్"

పిక్చర్ షూటింగేమో అని కూడా చుట్టూ చూశారు.

కోకిల అతని బైక్ ఎక్కలేదు. ఆటోని పిలిచింది. ఎగిరిపడ్డట్లు అందులో కూర్చుని 'పోనీయ్' అంది.



సంపత్ బెంగాల్ టైగర్‌లా అటూ

ఇటూ పచార్లు చేస్తున్నాడు. అతనికి సెగలూ, పొగలూ శరీరాన్ని దూసుకుని బయటికి వస్తున్నట్లు ఆరాటంగా వుంది.

గేటు తలుపు తెరుచుకుంటూ కిర్రుమన్న శబ్దం వినిపించగానే అతను అటువైపు చూశాడుగానీ పచార్లు చేయడం ఆప లేదు. "ఏమైందండీ" సబిత అప్పటికి పది సార్లు అడిగి వుంటుంది.

"సబితా అది ఎక్కడికి వెళ్ళిందో కనుక్కో" అన్నాడు పళ్ళు కొరుకుతూ. ఈలోగా గుమ్మందాటి లోపలికి వచ్చింది కోకిల. సబిత తలెత్తి కోకిల వైపు చూసి, "విన్నావుగా ఎక్కడనుంచి వస్తున్నావు? " అని అడిగింది.

"ఫ్రెండ్ ఇంటినుంచి" కోకిల తొణకలేదు.

"ఖర్మ..." సంపత్ విసుగ్గావచ్చి సోఫాలో కూర్చున్నాడు. చెప్పులు విసిరేసి తనగది లోకి వెళ్ళిపోయింది కోకిల. తలుపు గడియ పెట్టడం వినిపించింది.

"డాడీలేరు నయం... అమ్మ కూడా లేదు బతికిపోయాను. నా పిల్లల్ని కంట్రోల్ లో పెంచుతున్నాను. కానీ కోకిలని ఓ దెబ్బ ధైర్యంగా వేయగల్గే హక్కు చిన్నప్పటినుంచీ అమ్మానాన్నా ఇవ్వలేదు. అప్పటికీ అది హద్దు మీరినప్పుడు తిడుతూనే వున్నాను. ఏంచేయను? ఛీ" అతను తల పట్టుకు న్నాడు. సబిత నిశ్శబ్దంగా వెళ్ళిపోయింది.

కోకిల లైటు తీసేసింది. ఆ గదిలో ఒంట రిగా భయంగా అచ్చం సినిమాలోలా మంచంమీద పడుకుని పైకి చూస్తూ వ్రేళ్ల లెక్క పెట్టుకుంటోంది. కొన్నాళ్లుంటే తనింక తలెత్తుకోలేదు.

పరుపుమీద ముళ్లు గుచ్చుకుంటున్నట్లే. మెత్తని ఫోమ్ బెడ్ అంపశయ్యలా చురు క్కుమని గుచ్చుకుంటుంటే లేచి కిందకి దిగింది. బ్రీఫ్‌కేస్‌లో బట్టలు సర్దుకుంది. తనకి చేయించినవీ, ఇంట్లో వున్నవీ పర్సులో వేసుకుంది. ఆ నెల ఖర్చుకోసం అన్న ఇచ్చిన డబ్బు కూడా వదిలిపెట్టలేదు. అర్థరాత్రి నిశ్శబ్దంగా ఆ గదిలోంచీ, ఇంట్లోంచీ ఆ కాంపౌండ్‌లోంచి, తనదైన జీవితం వెతుక్కుంటూ, బయటి ప్రపంచం లోకి వచ్చేసింది. నిశ్శబ్దంలో శబ్దంకోసం చీకట్లో వెలుతురుకోసం అందరూ పదేపదే అనే 'మాతృదేవోభవ' సార్థకంచేస్తూ తన పొట్టలో రూపుదిద్దుకుంటున్న పాపకోసం ఆ తల్లి బయటపడింది.

★ ★ ★

"పాపం! ఆడపిల్ల మోసపోయింది" డాక్టర్ శేషాద్రి తల అటూ ఇటూ తిప్పాడు.

"అచ్చం నాగేశ్వరరావుగారిలాగానే" ఫక్కున నవ్వింది కోకిల. మిసెస్ శేషాద్రీ వాళ్ళ పిల్లలూ నిర్ఘాంతపోయారు.

డాక్టర్ శేషాద్రి కూడా నాగేశ్వరరావుగారు నవరాత్రి సినిమాలో నవ్వినట్లు నవ్వాడు.

రేఖారాణి నెత్తి మొత్తుకుని, "చాలు, ఆపండి" అంది.

"కడుపునిండా నవ్వడం, ఏడవడం కూడా ఆరోగ్య లక్షణాలు. ఐ మీన్ ఆరోగ్యానికి టానిక్‌లాంటివి" అన్నాడు డాక్టర్ శేషాద్రి.

రేఖారాణి ఈసారి కోకిలవైపు చూసింది. హద్దులు దాటిన కష్టాలు రెండు రకాలు. ఒకటి కోకిల... జలపాతంలా నవ్వేస్తూ, హాయిగా రోజుల్ని గడిపేస్తూన్నట్లు నటిం చేస్తూ... రెండవరకం నిశ్శబ్దంలో కాలాన్ని గురించి ఆలోచించకుండా చెక్కుచెదరని పర్వతంలా... అదంతే. మరి డాక్టర్‌గారు సినిమాల్లో ఏ సంతోషాన్ని వెతుక్కుంటు న్నారో అడగాలి.

కోకిలతో మాట్లాడుతూంటే రేఖారాణికి జవాబు దొరికింది. "కోకిలా! మొదట్లో ఓ అలవాటు, కాలక్షేపంగా చూసే సినిమా. చివరికి అది నా స్నేహితురాలు, నా ఆరా ధ్యదైవం అయిపోయింది"

ఈసారి కోకిల తెల్లబోయింది.

"నిజమమ్మా మా అమ్మాయి. చాలా ముద్దుగా పెంచాం. దాన్ని ఆ త్రాష్టుడు



పెట్టిన హింసకి నేను పడ్డ బాధ మరిచిపో యేందుకు సినిమా నాకు తోడు అయింది" రేఖారాణి చెప్పింది.

"కోకిలా" పిలుపు విని ఇటు చూసింది. డాక్టర్ పిలిచారు.

"చెప్పండి డాక్టర్" అంది.

"నిన్ను మీ వాళ్ళకి అప్పజెప్పాలి. మంచి కుటుంబంలోంచి వచ్చి నువ్వు ఇన్ని కష్టాలు పడుతుంటే మనిషిగా నా బాధ్యత ఏమిటో అది నేను చేస్తాను. సరేనా...? "

కోకిల పొట్ట పట్టుకుని నవ్వుతుంటే అందరూ నిశ్శబ్దం అయిపోయారు. శమంత మొహంలోకి చూస్తున్నాడు ఈషా. శమంతకి అర్థంకాలేదు. నవ్వి నవ్వి... నవ్వుకి ముందు కామా తర్వాత ఫుల్‌స్టాప్ పెట్టి నవ్వడం ఆపింది కోకిల.

రేఖారాణి ఆ పిల్ల భుజంమీద చేత్తో తడుతూ, "మనం భోజనం చేయాలి కోకిలా! నవ్వుల్తో కడుపు నింపుకుంటే వండిన వంట కాలు మిగిలిపోవూ" అంది.

కోకిల స్వరం తగ్గించి చెప్పింది. "నా బతుకైతే మొత్తానికి డిటో సినిమా అయిపో యింది. సినిమాటిక్‌గా డాక్టర్‌గారు చూడండి దారినపోయే కోన్, కిస్కో దాన్ని, నన్ను గురించి ఇంత చేస్తుంటే ఈ లోకాన్నే మరిచిపోతున్నాను"

"కోకిలా ఒంటరిగా ఎలా వున్నావమ్మా... ఎలా వుండగల్గావు? "

"బోర్ కొట్టడంలేదూ"

"దేనికీ? "

"నా సమస్యలు, నా గురించి వింటూంటే"

"ఊహూ..."

కోకిల చెప్పింది. "ఇల్లు వెతుక్కున్నాను. ఆ ఓనరు ఇక్కడ వుండరు. ఫారిన్‌లోలాగా వంట ఇల్లు, సామానూ అన్నీ వాడుకో వచ్చు. గాస్, అల్మైరా, ఫర్నిచర్ దేనికీ లోటులేదు. అద్దె వెయ్యి రూపాయలు. డీజిల్ ఫోర్‌మన్ శాస్త్రిగారికి అద్దె ఇవ్వాలి. ఇంటి రిపేర్లు, బాగోగులూ మిస్టర్ శాస్త్రి చూసుకుంటారు.

"నా పర్సనల్ విషయాలు అడగరు. వాళ్ళ టీవీ కూడా నేను వాడచ్చు. ఒకటేమిటి ఫ్రిడ్జ్, టూ ఇన్‌వన్, ఎప్పుడూ వాగుతూనే వుంటాయి. టీవీలో ప్రోగ్రాంలు వుంటూనే వుంటాయి. ఈ గోల, సందడి ఎంతోమంది మనుషులున్న ఫీలింగ్‌ని తెప్పిస్తుంది. అంతే... రోజులు గడిచిపోయాయి"

"రేపు నేను వచ్చి నిన్ను మీ ఇంట్లో దిగ బెడతాను"

"థాంక్యూ" అంది కోకిల.

ఆ పగలంతా, సరదాగా, సందడిగా గడి చిపోయింది.

పదిమందీ కలిసి కబుర్లతోబాటు భోజ నాన్ని కూడా కడుపులోకి పంపిస్తే ఇంత ఆనందంగా వుంటుందని అప్పటివరకూ తెలియనివాళ్లలా కాలాన్ని గుప్పిట్లో పెట్టుకో వాలని ఆశపడుతున్నారు. నవ్వులూ, సంతోషం ఈ ప్రపంచంలో ఏమాత్రం మిగ ల్చకుండా అనుభవిస్తున్నవాళ్లల్లా కూడా వున్నారు.

శమంతకి కావల్సిన ఏర్పాట్లు పనమ్మాయి చూసింది. "ఇంటిదగ్గర డ్రాప్ చేసిరా..." అన్నాడు డాక్టర్ శేషాద్రి కొడుకుతో.

కారులో కూర్చున్నప్పుడు 'ఈషూ' ముందు సీట్లోకి వొంగుతూంటే నువ్వు కూడా "ముందు కూర్చోమ్మా. కొన్నిసార్లు సర్దుకుపోవాలి. ఈషూకి వాడు కావాలి" అన్నాడు ఆయన.

"అర్థం కాలేదు" కోకిల ఆమాటే చెప్పింది.

"ఈషూ చాలా చిన్నపిల్లాడు అవునా"

"అవును"

"వాడు ముందు కూర్చుంటానంటున్నాడు"

నవ్వింది కోకిల. "అలాంటిదేం లేదండీ. వాడికి ఏడాది కూడా లేదు"

"ఒక్కనిమిషం" అని "హలో ఇటూ, ఇటూ" అని రెండు చేతులూ చాపాడు డాక్టర్ శేషాద్రి. కారు ఇంకా కదలలేదు.

కిలకిలా నవ్వేసి శమంతని తోసేసి ఒక్క




ఉరుకులో చాచిన డాక్టర్ చేతుల్లోకి ఉరి కాడు.

"చూశావా?" అన్నాడు కోకిలవైపు చూస్తూ. కోకిల ఆశ్చర్యపోయింది. డాక్టర్‌ని ఈమధ్యే చూశాడు వాడు. అంత పరిచయంలేదు. అయినా ఎప్పటినుంచో తెలిసినట్లు ఆయన భుజాలచుట్టూ చేతులు వేసి గట్టిగా కౌగలించుకుని ఆ భుజంమీదే తల వాల్చి 'తాత్తాత్తా' అంటూంటే కోకిల దృష్టి మరల్చుకోలేకపోయింది. డాక్టరు డాక్టర్లా లేడు. సొంత మనవడిని హత్తుకున్నట్లు దగ్గరకి తీసుకుని తన్మయత్వంతో మురిసిపోతున్నాడు.

శమంత "అమ్మా పోదాం, చిన్న పోరలు గిట్లనే చేస్తరమ్మా. గా పోరలకన్ని ఎర్కనే. చిన్నయ్యకి నాయ్న గావాల్నని"

"మైగాడ్" కోకిల అనేసింది.

డాక్టర్ శేషాద్రి పిల్లవాడిని కొడుకు పక్కనే కూర్చోబెట్టి "జాగ్రత్తగా తీసుకువెళ్లు" అన్నాడు. గేటు వరకూ వచ్చి మిసెస్ శేషాద్రి, ఆయనా టాటా చెప్పారు. కోకిల వాడినే చూస్తోంది. వాడు కూర్చున్నట్లే కూర్చుని అతని ఒళ్లో తలవాల్చేసి పడుకుంటున్నాడు. అతని తొడమీద చేత్తో కొడుతున్నాడు జోకొట్టినట్లు. మెల్లగా మోకాళ్లమీద నిలుచుని భుజాలు పట్టుకుంటున్నాడు. దూరంగా జరపాలని కోకిల ప్రయత్నం చేసింది. వాడు అతన్ని వదలలేదు.

సంధ్య చీకట్లు పరుచుకుంటున్నాయి. కోకిల అటువైపే చూస్తోంది. డాక్టర్‌గారు పిల్లల డాక్టర్. ఆయనకి వాళ్ల సైకాలజీ బాగా తెలుస్తుంది. తనకి కొంచెం కూడా తెలియలేదు. పిల్లలకి పుట్టుకతోనే తన వాళ్లు కావాలన్నమాట.

"ఎలా తెలుస్తుందో?"

"తను తల్లి అని తెలియడంలో గొప్పేం లేదు. పుట్టినప్పటినుంచీ వాడు తనని అంటిపెట్టుకుని వున్నాడు కనుక. వాడికి తండ్రి కావాలని తాపత్రయపడుతున్నాడా? ప్రభూ! నువ్వెక్కడున్నా వెతికి తీసుకువచ్చి ఈషూ ఫాదర్‌వి అని చెప్పే వరకూ నిద్రపోను. ఐయామ్ కోకిల. పేరు మార్చుకుంటాను" అనుకుంది.

కారు మెత్తగా కదులుతుంటే అతని తొడ మీద పడుకున్నాడు. నిశ్చింతగా తన భారాన్ని అతని మీద వేసేసి హాయిగా గాలి పీల్చుకుంటున్నాడు. కోకిల గుండె భారం అయిపోయింది. కారు ఇంటికి రాగానే డోర్ తెరుచుకుని నిద్రపోతున్న ఈషూని భుజంమీద పడుకోబెట్టుకుని కిందకి దిగి "థాంక్యూ డాక్టర్" అని "శమంతా దిగు ఇల్లు వచ్చేసింది" అంది.

శమంతకి నిద్రో, పరధ్యానమో వదిలిపోయింది. తను కూడా కిందికి దిగింది.

కనీసం మర్యాద కోసం అయినా రండి ఇల్లు చూద్దురుగానీ అని కూడా చెప్పలేదు.

అప్పటికే క్వార్టర్స్‌లో ఇళ్ల తలుపులు తెరుచుకున్నాయి. అందరూ బయటికి వచ్చేశారు. ఏదో జరుగుతోంది.

"కొత్తకారు"

"ఎవరబ్బా?"

"ఆమధ్య వచ్చినబ్బాయే అయివుంటాడు"

"ఆ అబ్బాయికాదు కొత్తతను"

"కొత్తతనుకాదు, పాతతనూ కాదు. డాక్టర్ శేషాద్రిగారబ్బాయి"

"ష్యూర్"

"నిస్సందేహంగా"

"నీకెలా తెలుసు?"

"ఎలా తెలియాలన్నా పరిచయం అక్ఖర్లేదు. శేషాద్రిగారబ్బాయి ఆయనలాగే వుంటాడు. ఎన్నోసార్లు తండ్రి పక్కన కూర్చుని డ్రైవ్ చేస్తూ వెళ్లడం చూశాను"

"అక్కడేం పనో"

"అడిగిరానా?"

"జోకా"

అన్నేసి మాటలు అంతమంది నోట్లోంచి బాణాల్లా వంటికి తగులుతూ మనసులోకి దూసుకుపోతున్నాయి.

"ఎలా వున్నారు? బాబుకేమైంది?" అని ఒకళ్లు... ఒక్కళ్లైనా అడగగల్గారా? శమంత తాళం తీసింది. కోకిల అందరి మొహాల్లోకీ చూసింది. అక్కడున్నవాళ్ల తలలు వొంగిపోయాయి. వెనక్కి అడుగులు వేస్తూ లోపలికి వెళ్లారు.

శమంత "బాధపడకమ్మా! ఇంటికి పోయి మల్లొస్త" అని వెళ్లింది.

ఈషూ కోసం పాలు వెచ్చబెట్టి పట్టించింది. వాడికోసం డాక్టర్ శేషాద్రి బ్యాగ్‌లో టిఫిన్ బాక్స్ పెట్టించాడు. అనుకోకుండా బ్యాగ్‌లో చేయిపెట్టగానే చేతికి తగిలింది.

వాడు బాగా అలిసిపోయాడు. వాడు పుట్టినప్పటి నుంచీ ఇంతమందిని ఎప్పుడూ చూడలేదు. కోకిల చెంపలు గట్టిగా వేసుకుంది. పంతాలూపట్టుదలలూ, సాంఘిక మర్యాదలూ, కట్టుదిట్టాలూ ఏవీ ఏవీ సరిగా పాటించలేదు. ఇప్పుడీ చిన్నవాడికి తండ్రీ బంధువులూ వీళ్లందర్నీ ఎక్కడినుంచి తీసుకు వచ్చి చూపిస్తుంది? అంత చిన్న పిల్లవాడికి ఎంత కష్టం తెచ్చిపెట్టింది?

కోకిల నిశ్శబ్దంగా ఏడుస్తూనే వుంది.

డాక్టర్ ఎంత గొప్పవాడు? ఆయనే చెప్పకపోతే తను తను తెలుసుకోలేకపోయేది. ఇప్పుడు వాడికి ప్రభు కావాలి.

వాడు బాగా నిద్రపోయాడని తేల్చుకున్నాక ఫోన్ తీసుకుంది.

"హలో" డాక్టర్ శేషాద్రి గొంతు అది.

"డాక్టర్ నేను కోకిలని"

"చెప్పమ్మా"

"..."

"ఏడుస్తున్నావా కోకిలా! నువ్వు ఏడవకూడదు. ధైర్యంగా సంఘంలో తలెత్తుకుని ఓ బిడ్డకి జన్మ ఇచ్చావు. అదేం మామూలు విషయమా! పరిస్థితులు అనుకూలిస్తే అన్నీ చక్కబడతాయి"

"మీరు నాకోసం చాలా శ్రమ తీసుకుంటున్నారు. ఎందుకు డాక్టర్. నేను మీకేమౌతానని ఇంత చేస్తున్నారు?"

"తెలీదు" నవ్వారాయన. "పిచ్చిదానా మనమధ్య చుట్టరికమే వుండాలా ఆపదలో ఆదుకుందుకు... ఋణం అంతే"

"థాంక్యూ డాక్టర్. నేనో మాట చెప్పనా?"

"చెప్పమ్మా"

"ఈషూ! ఇప్పుడు ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. నేను ఇన్నాళ్లూ కనుక్కోలేకపోయాను. ఏం చేయను సర్? వీడికి వీడికి ప్రభుని ఎలా చూపించను?"

"కోకిలా కూల్ డౌన్ ప్లీజ్. కోకిలా ఏడవద్దు. రేపటివరకూ ఓపిక పట్టలేవూ. నీకు నేనున్నాను"

"డాక్టర్‌గారూ, మనం చీటికీ మాటికీ జీవితం వేరూ, సినిమా వేరూ అంటుంటాం. నేను మీతోబాటు మీ ఆనందాన్ని, నా కోసమే మీరు చేస్తున్న ప్రయత్నంలో పంచుకుంటూ వస్తున్నాను. చూడండి సర్. కొన్ని కొన్నేమిటి ఎన్నెన్నా జీవితంలో జరగవు. అది నిజం అని మనిద్దరికీ కూడా తెలుసు. మీరు చేస్తున్న సహాయం నేను జన్మలో మరచిపోను. మీరు మన కథని నిజం చేశారు. ఇంక నిజం కాకూడదని కూడా ప్రార్థిస్తున్నాను"

"కోకిలా! అర్థం కాలేదమ్మా"

కోకిల క్షణం ఆలోచించింది. ఆఖరికి చెప్పేసింది. "మీ ఇంటికి వచ్చి అందర్నీ పరిచయం చేసుకున్నాను. మీరు అడిగారని నా గురించి మొత్తం చెప్పేశాను. మీరు అంతటితో వూరుకోకుండా మీ అబ్బాయిని నాతో పంపారు. సినిమాలో హీరోలా... ఇది మాత్రం నచ్చలేదు. ప్లీజ్ నన్ను అపార్థం చేసుకోవద్దు"

ఘొల్లున నవ్వాడాయన. ఫోన్‌లో అంత దగ్గరగా నవ్వగానే కోకిల ఒక్కసారి వులిక్కిపడి చెవి మూసుకుంది. ఆయన నవ్వుకి కర్ణభేరి పగిలిపోతుందేమో అన్నంత అనుమానం కూడా వేసింది.

"నో... నో బేబీ" అని "కోకిలా ప్రస్తుతం నాకే వుద్దేశ్యం లేదు. మనం నిమిత్తమా

త్రులం. సరేనా"

"రేపు మనం వెడుతున్నాం కదంకుల్"

"ఇదేమిటి ఇంత దూరం వచ్చాక ఇప్పుడు అనుమానం ఎందుకు వచ్చింది? "

"తెలియదు" కోకిల చెప్పింది.

"మరి హాయిగా నిద్రపోమ్మా. ఏ ఆలోచనలూ దగ్గరకి రానీయకు సరేనా? "

"సరే" అంది నిశ్శబ్దంలోకి జారిపోతూ.



రాత్రి కరిగి వెలుగురేకలు పైకి వస్తున్నాయి.

ఈ వాతావరణం, ఇల్లూ, ఈ స్టేషన్, వచ్చేపోయే రైళ్లు... అమ్మే వాళ్ల కేకలు ఎంత మధురమైన అనుభవం. చటుక్కున కోకిలకి శాస్త్రిగారు గుర్తు వచ్చారు. శాస్త్రిగారికి ఫోన్ చేసింది. అప్పటికి ఉదయం ఆరు గంటలైంది.

"హలో అంకుల్ మీరోసారి రాగలరా"

అవతలినుంచి శాస్త్రిగారు అడిగారు "అర్జంటామ్మా"

"అవును అంకుల్"

"బయలుదేరి వస్తున్నానమ్మా" అన్నారాయన.

పది నిమిషాల్లో శాస్త్రిగారు ఆ ఇంటి ముందు వున్నారు.

"రండి అంకుల్" అని పిలిచింది.

ఆయన లోపలికి రాగానే విషయంలోకి వచ్చింది. "నేను వెళ్లిపోతున్నాను. అంకుల్, మీరు ఇల్లు ఇచ్చి నాకు ఉపకారం చేశారు. ఇంకా డబ్బు ఏమైనా నేను బాకీపడితే చెప్పండి" అంది వుపోద్ఘాతం లేకుండా.

"డబ్బు బాకీలేం లేవమ్మా! అంతా సరిగానే వుంది. నీలాంటి టెనెంట్ వుండడం కూడా యోగమే" అని లేస్తూ "తాళం ఇంటికి పంపించమ్మా శమంత వస్తుందిగా" అన్నారు.

"వస్తుంది అంకుల్" కోకిలకి ఉద్వేగంగా వుంది.

"వుంటానమ్మా" అని గడపదాటారాయన. ఆయన స్వభావమే అంత. ఎవరి గురించీ ఆరాతీయరు. అవసరం అయితే చేతనైన సహాయం చేస్తారు. లేదంటే జోక్యం చేసుకోరు.

ఆయన మలుపు తిరగగానే డాక్టర్ శేషాద్రి కారులో వచ్చాడు. ఆయన కారు శబ్దం విని కోకిల క్షణంలో తయారైంది. బ్రీఫ్‌కేస్‌లో బట్టలు సర్దుకుంది.

ఇంతకాలం తనని కన్నతల్లి కడుపులో దాచుకున్నట్లు ఆశ్రయం ఇచ్చిన ఆ చల్లని ఇల్లుకి దండం పెట్టింది. పరిగెత్తుకుంటూ వచ్చిన శమంత కొంగుతో కళ్లు తుడుచుకుంటూంటే కోకిల ఆమె భుజం చుట్టూ చేయివేసి దగ్గరికి లాక్కుంది. చేతికి వున్న వుంగరాల్లో ఓ వుంగరాన్ని ఆమె చేతికి తొడిగింది.

సూట్‌కేస్ తెరిచి అందులోంచి రెండు చీరలు ఇచ్చింది. "సల్లగుండమ్మా! ఈషు భద్రమమ్మ" అంది. అనుకోకుండా కోకిల రెండు చేతుల్తో దండం పెట్టింది.

తట్టుకోలేకపోయిన శమంత చప్పున అరుగుమీద చతికిల బడిపోయింది. కోకిల తాళం ఇస్తూ "జాగ్రత్తమ్మ శమంతా! రుక్కుని అడిగానని చెప్పు" అంది.

శమంత తలూపింది. కోకిల పిల్లవాడితో

శేషాద్రి పక్కన కూర్చుంది. కారు హైద్రాబాద్ దారిపైన పరిగెత్తుతోంది.



ఆ ఇంటిముందు పెద్ద షామియానా వేశారు. షామియానాకి మధ్యలో కొబ్బరి ఆకులతో పెళ్లిపందిరి వేశారు. పెళ్లివారు అట్టహాసంగా వున్నారు. సెంటువాసన ఘుబాళింపు ఆ వీధి చివరిదాకా పరిగెత్తింది. పట్టుచీరల రెపరెపలు గాజుల గలగలల్లో కలిసి పోయాయి. ఓ వైపు మంత్రోచ్చారణ జరుగుతోంది. బ్రాహ్మణుడు మైకులో మంత్రాలు చదువుతున్నాడు.

వీడియోగ్రాఫర్ పెళ్లి వేడుకల్ని అందులో బంధిస్తున్నాడు. బ్రాహ్మణులు యాంగిల్ కి తగినట్లు కూర్చున్నారు. ఈ ఫొటోలు తీసుకుని తీసుకుని ఫోజులివ్వడం బాగా అలవాటైపోయింది వాళ్లకి.

పెళ్లికూతురు తరపువాళ్లు వెండిపళ్లెం, వెండి బిందె పెట్టారు. కాళ్లు కడిగే పళ్లెం, చెంబు అన్నమాట. ఆ పక్కనే మరో రెండు బిందెలున్నాయి. పానకం బిందెలు అవి.

పెళ్లి కొడుకూ, పెళ్లికూతురూ ఉంగరం కోసం చేతులు ముంచి దెబ్బలాడుకుంటారు.

బాండ్‌మేళం, సన్నాయి... ఆర్కెస్ట్రా ట్రూప్ దద్దరిల్లుతోంది ఆ ప్రదేశం అంతా. వంట సువాసనలు మరోవైపుకు మేఘాలతో బాటు కదులుతున్నాయి.

ప్రభు వెడ్స్ అప్సర

రంగురంగులపూలు పరచుకున్నాయి. అక్కడ రాజకీయ నాయకుల కార్లు బార్లు తీరి వున్నాయి. మరోవైపు ఆబ్కారీ సిబ్బంది. ప్రభు తండ్రి ఆచితూచి మాట్లాడుతున్నాడు. అతని కనుకొలుకుల్లోంచి దర్పం, గర్వం పోటీపడుతున్నాయి.

మేడమీద గదిలో పెళ్లికొడుకు ప్రభు పట్టుపంచె మార్చి మధుపర్కం కట్టుకుంటున్నాడు. ఈల వేస్తూ పారవశ్యంతో కలల్లో తేలిపోతున్నాడు. మాధవ అతన్ని పట్టుకోగల్గాడు. గదిలోకి తోసుకుని వస్తున్న అతన్ని ప్రభు చూస్తూ మాధవా అన్నాడు.

మాధవ చెప్పాడు "నీతో ఎక్కువ మాట్లాడేందుకు, నీ పెళ్లి శుభాకాంక్షలు తెలియజేసేందుకు రాలేదు. నా వెంట స్టూడెంట్స్ వున్నారు. లాయరున్నారు. ప్రభూ! కోకిలని దాని ఖర్మానికి వదిలేస్తే ఆ చంటివాడితో ఎలా బతుకుతుంది"

ప్రభుకి కోపం వచ్చింది. అతను తలుపు వేసి బయటివాళ్లు లోపలికి రాకుండా జాగ్రత్తపడ్డాడు. ఆవేశంతో వూగిపోతూ "అసలు నువ్వు మందీమార్బలంతో వచ్చానని బెదిరిస్తున్నావేమిటి? ఇదేమైనా హీరోయిన్ ఓరియంటెడ్ పిక్చర్ అనుకున్నావా? బయట చూశావుగా మా ఫాదర్‌కి ఎంత పలుకుబడి వుందో? ఇదిగో ఇలా... ఇలా... లేపేస్తారు" గాల్లో చిటిక వేస్తూ అన్నాడు గర్వంగా.

మాధవ "ఓహో" అని "అంటే ఇక్కడున్న వాళ్లందరూ గాజులేసుకోలేదు. ఇప్పుడు సైన్స్ ఎంత డెవలప్ అయిందో నీక్కూడా తెలుసు. నీ పొగరుతో కోకిలమీద నిందలు వేసినా చెల్లవు. డి.ఎన్.ఎ పరీక్షలున్నాయి. కోర్టులున్నాయి. మహిళా కోర్టులు, ఫామిలీ కోర్టులు, అంతెందుకు అన్యాయం అయిపోతున్న ఆడపిల్లలకి గొడుగుపట్టి దగ్గర తీసుకుని అలా చేసిన వాడికి శిక్షవేసేందుకు స్వచ్ఛంద సంస్థలున్నాయి. సో ఈ పెళ్లి అయిపోతుందనుకుని మురిసిపోకు ప్రభూ" మాధవ క్షణంలో సగంసేపు చల్లబడ్డాడు. దగ్గరగా వెళ్లి "ప్రభూ! కోకిలకేం తక్కువ? చదువుకుంది, చక్కనిది. పైగా మన చిన్ననాటి స్నేహితురాలు. నీకు అభ్యంతరం దేనికి? " అని అడిగాడు.

"నాక్కాదు మా నాన్నగారికి. ఆయన పలుకుబడి గురించి ఎవర్నీ అడగక్కర్లేదు. అప్సర ఎవరనుకున్నావు? ఎం.పి కూతురు. చాలు ఆ క్వాలిఫికేషన్"

"అయితే కోకిలని వెంటేసుకుని సినిమాలకీ, పార్కులకీ ఎందుకు తిరిగావు? "

"ప్రేమ అనుకున్నాను. అరేయ్ మాధవా విను. నేను దాని వెంటబడి ప్రేమించమని చెప్పలేదు, అదే నా వెంటబడింది. చూడు మాధవా! నాకో గర్ల్‌ఫ్రెండ్ వుందనడం గొప్ప. అది నేను యుటిలైజ్ చేసుకున్నాను. తిరిగాను, ఎంజాయ్ చేశాను. ఆడపిల్ల కనుక బయొలాజికల్‌గా స్త్రీ శరీరానికి తగ్గట్టు పిల్లాడిని కంది. ఆ ప్రాసెస్ నాకుంటే నేనూ కనేవాడినేమో. నన్నే తప్పు పడతావెందుకూ? "

"సిగ్గులేదూ చెప్పేందుకు" మాధవ శరీరం కోపంతో కుతకుతలాడుతోంది.

"నేను ప్రేమించలేదు. చెబితే వినవేం? ఆకలి వేస్తున్నప్పుడు అన్నం పెడితే తిన్నట్లే నాకు కావాల్సిందిచ్చింది. నోమోర్ కామెంట్స్"

"నువ్వీ రూమ్ వదిలి ఎలా వెడతావో నేను చూస్తాను" మాధవ తలుపు దగ్గరకి వెళ్లగానే అవతల జనంతో క్రిక్కిరిసిపోయిన పందిరి కనిపించింది. తోసు

కుంటూ వస్తున్నారు. పత్రికలు కాగడాల్లా వెలుగుతున్నాయి.

ఎవరో అంటున్నారు "ఈ పత్రికలే లేక పోతే నిజాలు సమాధై పోయేవి. ప్రత్యక్షసాక్షులు ఇవే" పత్రికాభిమాని ఇస్తున్న కితాబు.

క్షణంలో మండిన రెల్లుగడ్డిలా, పందిరి దావానలంలా అయింది. ప్రభు కిందికి వద్దామనుకున్నా ఆ ఇరుకులోంచి రాలేకపోయాడు. అటువైపునుంచి ఆడపెళ్లివారు పవర్ చూపిస్తూ ప్రయత్నం చేస్తున్నారు.

మాధవ పులిలా ఎగిరి ప్రభుమీద పడ్డాడు. ఒకళ్లమీద ఒకళ్లు పడి ఆజన్మ శత్రువుల్లా కొట్టుకుంటున్నారు.

పందిరి కూలిపోయింది.

వెడ్డింగ్ బెల్స్ మోగడం ఆగిపోయాయి.

ప్రభు వెడ్స్ అప్సర అన్న బోర్డు నేలమీదపడింది. దాన్ని తొక్కేస్తున్నారు. అంత క్రితం వున్న ఆర్భాటం ఇప్పుడు లేదు. భూకంపానికి నిలువెత్తు సౌధాలు కూలిపోయి కూరుకుపోయినట్లుగా ఆ ప్రదేశం అంతా సర్వనాశనం అయిపోయింది. ఆఖరికి వండిన వంటకాలు కూడా నేలపాలైపోయాయి.

పోలీసులు వచ్చినా అక్కడ ఏమీ చేయలేకపోయారు. ప్రభుని ఓ గదిలో బంధించారు.

మాధవ "పదండి" అన్నాడు అక్కడున్న ఫ్రెండ్స్‌తో. అతని మాట కోసం నిలుచున్న వాళ్లల్లా మరుక్షణం ఆ స్థలాన్ని ఖాళీచేసి వెళ్లిపోయారు.

అవమానంతో తలెత్తుకోలేక పోయాడు ప్రభు తండ్రి. బూతులు తిడుతూ పిచ్చివాడిలా అరుస్తున్నాడు. ప్రభు మొహం పైకెత్తలేదు. అక్కడినుంచి మరో గదిలోకి వెళ్లి తలుపులు బిగించుకున్నాడు.

మాధవ ఇంటికి వెళ్లేసరికి అతనెప్పుడు వస్తాడా అని ఎదురుచూస్తున్నట్లు కనిపించారు ఇంట్లో వాళ్లందరూ.

నారాయణరావు సోఫాలో తాపీగా కూర్చున్నాడు. అక్కడ తనెప్పుడూ చూడని వ్యక్తిని పోల్చుకుందుకు చాలా ప్రయత్నం చేశాడు మాధవ. ఎంత ఆలోచించినా అంతుచిక్కడంలేదు. అతను డాక్టర్ శేషాద్రి.

తండ్రి అడుగుతున్నాడు "ఇంతకీ ఎక్కడ బస చేశారు? "

మాధవకి తెలీని ఆ కొత్తాయన చెబుతున్నాడు.

మాధవని నారాయణరావు చూశాడు. అయినా నిశ్శబ్దంగా వున్నాడు. చూసినా నోరు తెరవడం లేదేమిటి? కలోనిజమో తెలియలేదు. ఆశ్చర్యంతో గుమ్మందగ్గరే నిలబడిపోయాడు మాధవ.

"వీడే మా ప్రబుద్ధుడు" నారాయణరావు కొడుకుని శేషాద్రికి పరిచయం చేశాడు.

ఆయన కాస్త ముందుకు జరిగి "గ్లాడ్‌టూ మీట్‌యూ" అని చేతిని అందించాడు. మాధవ ఆ చేతిని గట్టిగా పట్టుకున్నాడు.

"ఈయన డాక్టర్ శేషాద్రి. ఇన్నాళ్లూ నువ్వు బెంగపెట్టుకున్నావు చూడు. ఆ కోకిలని ఈయనే కాపాడారు. నువ్వు తిరగబడడం ఆయనకి చాలా నచ్చిందిట. నాకీ విషయం తెలీలేదు" నారాయణరావు చెబుతుంటే మాధవకి నమ్మశక్యం కావడంలేదు.

డాక్టర్ శేషాద్రి మధ్యలో కల్పించుకున్నాడు. "ఇప్పుడు నాకు అరవై ఏళ్లు పైబడ్డాయి"

"మాధవా నువ్వు కూర్చో" ఆయనే అన్నాడు.

మాధవ అలసిపోయాడు. అందర్నీ కూడ గట్టుకుని ఆ పెళ్లి ముక్కలయ్యే వరకూ అక్కడే వున్నాడు. అంత మందిలో నలిగిపోతూ నేలమీదపడి దొర్లి, మట్టితో దుమ్ముతో మాసిపోయి చెదరిపోయి ఎంత ఛండాలంగా వుండాలో అంతకి తీసిపోలేదు.

మాధవ కూర్చుని "చెప్పండి" అన్నాడు.

"మా చిన్నతనంలో మా తల్లితండ్రులు

కూడా చాలా ఆంక్షలు విధించే వాళ్లు. స్ట్రిక్ట్ రూల్స్ అన్నమాట. పుస్తకాలు కూడా చదవనిచ్చే వాళ్లుకాదు. నాలెడ్జ్ అంటే సింగినాదం అనేవాళ్లు. పుస్తకాలని క్లాసు పుస్తకాల్లో పెట్టేసి దీక్షగా చదువుతున్నట్లు నటించేవాళ్లం. ఒక్కో టైమ్‌లో ఒక్కో జాడ్యం" అని హాయిగా వూపిరి తీసుకున్నాడు. మాధవ ఆయన్నే దీక్షగా చూస్తున్నాడు.

డాక్టర్ గొంతు సవరించుకున్నాడు. "ఇప్పుడు కోకిల ఇంత కష్టాన్ని భరిస్తోందంటే అదీ అంతే. సినిమాల ప్రభావమే. ప్రియుడు వచ్చేసి పసుపుకొమ్ము కట్టి పిల్లవాడికి చేతులు అందించి ముద్దులతో ముంచెత్తుతూ 'ఐ లౌ మై చైల్డ్... ఐ మిస్డ్ యూ ఎలాట్' అనేసి బోలెడు సారీలు చెప్పేస్తాడని ఆశ.

"మనమ్మాయి నూటికి నూరు పైసలూ భారతీయ సంస్కృతిని జీర్ణించుకున్న సగటు ఆడపిల్ల. ఇన్నేళ్ల కష్టాన్ని దిగమింగేసి 'అయ్యయ్యో ఎంత మాటండి? మీరలా అనకూడదు. ఏం చేస్తాం? ఖర్మ. అందుకే ఇలా జరిగింది' అని యమ బాధ పడిపోతూ ఉల్టా అదే" ఆయన క్షణం బుర్ర గోక్కుంటూ "అదనంగా... కరెక్ట్... అతని కాళ్లకి మొక్కేస్తుంది. బహుశా కోకిల కూడా ఆ ముగింపు కోసం అక్కడ చేసే శుభం కోసం ఎదురు చూస్తోందేమో"

"ఛ, కోకిల అలా చేయదండి. తనకి ఈగో, సెల్ఫ్... ఇలా చాలా వున్నాయి. తప్పు చేస్తే క్షమించాలని కొందరంటారు. కోకిల తప్పు రైటైపోదు. శిక్ష అనుభవించడం వల్ల ఆ కష్టం ఎలాంటిదో తెలుస్తుంది" అని "ఇంతకీ కోకిల" అంటూ తండ్రి వైపు చూశాడు మాధవ.

ఆయనేమంటాడో అని అతని ప్రాణాలు గుట్కొగుట్కొమంటున్నాయి. అవి లబ్ డబ్ అనడంలేదు.




డాక్టర్ శేషాద్రి చెప్పాడు "అసలీ పెళ్లి వ్యవహారం మాకు తెలియదు. ఎప్పటి నుంచో నాకీ ఆలోచన వుంది. కోకిలకి ఎలా అయినా రక్షణ కల్పించాలని. సరిగ్గా ఆ టైమ్‌లోనే"

మధ్యలో మాధవ "చెప్పండి డాక్టర్. కోకిల ఎక్కడ? " అని ఆయన్ని పూర్తిగా చెప్పనివ్వలేదు. అతనికి కంగారుగా వుంది.

"కోకిల హోటల్ రూమ్‌లో వుంది. నయం ఇక్కడికి డైరెక్ట్‌గా తీసుకురాలేదు. ఈ గలాటాలో ఆ పిల్లని గూండాలు ఎత్తుకుపోవడం బెదిరింపులూ, బ్లాక్‌మెయిల్స్... ఇంత తతంగం జరిగేది. బచ్‌గయా బతికిపోయాను"

మాధవతోబాటు నారాయణరావు కూడా నవ్వాడు.

డాక్టర్ వాళ్లవైపు ప్రశ్నార్థకంగా చూడగానే మాధవ చెప్పాడు. "మీరు సినిమాలు బాగా చూస్తారని తెలిసిపోతోంది. మక్కికీ మక్కీ ఓ సినిమాని చూపిస్తున్నారు. అసలు మీరే హీరోలా వున్నారు"

"ముసలి" అని నవ్వాడు డాక్టర్. "కోకిల అంత గుండె నిబ్బరంతో ఎలా వుందో ఓ పట్టాన అర్థం కాలేదు నారాయణరావు గారూ. చివరికి నేను చదివిన సైకాలజీ పుస్తకాలూ ప్లస్ నా ప్రవర్తనా... నైజం ఇవన్నీ కోకిలని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడ్డాయి"

"భలేవారే మీరు" మాధవకి సంతోషంగా వుంది.

"నువ్వు నాతో వస్తావా మాధవా" అని అడిగాడు ఆయన.

టైము తెలియలేదు. అక్కడ పెళ్లివారు టెంట్లు లేపేశారని కబురు వచ్చింది. ప్రభ తలుపు బిగించుకుని బయటికి రావడం లేదు. ప్రభ తండ్రి షాక్‌వల్ల కళ్లు తిరిగి పడిపోయాడని చెబుతూంటే డాక్టర్ శేషాద్రి నవ్వాడు. "షాకా, పాడా పరువు ప్రతిష్ఠలండీ... ఈగో... ఇవన్నీ హీరో తండ్రి లక్షణాలు"

మధ్యాహ్నం మూడు గంటలౌతోంది. శేషాద్రి అందరినీ ఆకట్టుకున్నాడు. కుర్రకారైతే మరీ... ఈమధ్య కాలంలో టీన్స్‌లో వున్న పిల్లలు హీరోహీరోయిన్ల వర్షిప్‌తోటే సరిపెట్టుకోవడంలేదు. డైరెక్టర్, డాన్స్‌మాస్టర్, సంగీతం, ఫొటోగ్రఫీ, కాస్ట్యూమ్స్, మేకప్ ఒకటేమిటి అన్ని రంగాల టెక్నీషియన్స్‌కీ ముఖ్యంగా బానర్... విభాగాలకీ ప్రాముఖ్యం ఇస్తున్నారు" శేషాద్రి చెప్పే విషయాలన్నీ కాక్‌టెయిల్ మత్తులో ముంచుతున్నాయి కుర్రాళ్లని. కళ్లు ఆర్పి విశ్రాంతినీయడం మరిచిపోయారు. నోళ్లు తెరిచేశారు.

కాత్యాయని కూడా శ్రద్ధగా వింటోంది. అదో పెద్ద కాన్ఫరెన్స్ హాల్ అయిపోయింది.

"కోకిల ఏం చేస్తోందో" అని "కోకిల పేరెంట్స్ ఏమంటారు? " అని డాక్టర్ అడిగాడు.

నారాయణరావు ఓ నిట్టూర్పు వదిలాడు. "కొన్నిసార్లు మూర్ఖంగా ప్రవర్తిస్తారు. గడప దాటిన ఆడపిల్లని నువ్వులూ నీళ్లతో వదిలేయాలి అని శ్రీనివాసమూర్తి చెబుతున్నాడుట. అక్కడికే చాలామంది నచ్చచెప్పాలని ప్రయత్నం చేస్తే మళ్లీ గుమ్మంతొక్కద్దని వాళ్లతో కఠినంగా చెప్పాడని విన్నాను"

"అయితే మనం వెళ్లి కోకిల గురించి మాట్లాడదామా" అని డాక్టర్ మళ్లీ అడిగాడు.

"వినడు"

"ప్రయత్నం చేద్దాం"

"మియర్ వేస్ట్" నారాయణరావు అన్నాడు "వృధాశ్రమ".

కాత్యాయని లేచి వంటింట్లోకి వెళ్లి టీ, టిఫిన్ తెచ్చింది.

డాక్టర్ టీ తీసుకుని "మిమ్మల్ని కష్టపెడుతున్నాను. సారీ... నాకూ కోకిలలాంటి కూతురు వుంది. అందుకే ఇంతదూరం వచ్చాను" అన్నాడు.

"మీరు కనుక చేశారు. నాలాంటి వాడైతే అస్సలు పట్టించుకోడు" నారాయణరావు నిజాయితీగా చెప్పాడు.

టీ కప్పు కిందపెట్టేసి శేషాద్రి తలెత్తి "ఈ ఒక్కసారీ రిస్క్ తీసుకుందాం. కోకిల జీవితాన్ని బాగుచేద్దాం. ఒకవేళ ఆమె తల్లితండ్రులు ఏమైనా అంటే నేనే నా ఇంటికి తీసుకువెళ్లిపోతాను. నాకు ఇద్దరు ఆడపిల్లలున్నారనుకుంటాను. వాళ్లు ఘర్షణకి దిగినట్లయితే జస్ట్ మీరలా కూర్చోండి, మీకు సంబంధం లేనట్లే. నేను చూసుకుంటాను. ఆ తిట్లో దీవెనలో నేను భరిస్తాను" అన్నాడు.

నారాయణరావు భార్యని పిలిచి "మేము అలా వెళ్లొస్తాం" అని చెప్పి "పదరా మాధవా" అన్నాడు కొడుకుని చూస్తూ.

మాధవకి పట్టరాని ఆనందంగా వుంది. తండ్రి అద్దంలో చూసుకుని క్రాపు దువ్వుకుంటుంటే శేషాద్రితో బయటికి వచ్చి "నాకు కోకిల విషయాలు తెలుస్తూనే వున్నాయండి. కాజీపేట అంటే ఎంతదూరం? స్పెషల్ క్లాసులున్నాయని చెప్పి అక్కడికి వచ్చి శమంతని అడిగి తెలుసుకునేవాడిని. మీ అడ్రసూ, ఫోన్ నంబరూ తెలుసుకోవడం కష్టంకాలేదు. అందుకే పెళ్ళిరోజుకి మీరు రావడం బావుంటుందని ఏర్పాట్లు చేశాను"

శేషాద్రి కారు డోర్ తెరిచి "మీ నాన్నదగ్గర లీక్ చేస్తాననుకున్నావుకదూ. అంత పిచ్చివాడినా... ఎనీవే ఓ స్నేహితుడంటే నీలా వుండాలని నిరూపించావు. యింత చిన్న వయసులో నువ్వు చేసిన పని సామాన్యం అయినది కాదు" అని. "మీ నాన్న వస్తున్నారు. నువ్వు తర్వాత రూమ్‌కి వచ్చేయ్" అన్నాడు.

మాధవ ఫ్రెండ్స్ చుట్టూ చేరి "అన్నా! మేం రావాల్నానే" అని అడిగారు. డాక్టర్ శేషాద్రి కల్పించుకుని "కోతిమూక... కిష్కింధ కాండ" అని నవ్వేశాడు.

వాళ్ళూ నవ్వి ఆగిపోయారు. "అన్న

నువ్వొచ్చేతలకు మేముండాల్నానే"

"అవసరం అయితే చూద్దాం. ఇప్పుడింక వెళ్ళిపోండి. జాగ్రత్త. అసలే ప్రభుగాడి తండ్రికి బాగా యిన్‌ఫ్లుయన్స్ వుంది" అని చెప్పాడు.

ఐదునిమిషాల్లో కారు శ్రీనివాసమూర్తి ఇంటిదగ్గర ఆగింది. కారు శబ్దం విని గేటు తీసింది సబిత. ఆమె వెనుక సంపత్, తరువాత కోకిల తల్లీతండ్రీ నిలుచుని చూస్తుండిపోయారు. ముందుగా తేరుకున్నది సబిత "రండి అంకుల్.. రా మాధవా... రండి సర్" అంది నవ్వుమొహంతో.

"హలో"

"హలో"

"హలో"

చేతులు కలుసుకున్నాయి.

లోపలికి దారితీశారు.

ఆఖరికి హాల్లో సోఫాల్లో చోటుచేసుకున్నారు.

నారాయణరావు కొంచెం నిశ్శబ్దం తర్వాత శేషాద్రిని పరిచయం చేశాడు. "ఈయన డాక్టర్ శేషాద్రి. పిల్లల డాక్టర్. కాజీపేటలో హాస్పిటల్‌లో వుంది. కోకిలని తీసుకుని వచ్చారు"

శ్రీనివాసమూర్తి తేలుకుట్టినట్టు ఎగిరిపడ్డాడు.

"తమాషాగా వుందా? అది పాపిష్టిపని చేసి దానిదారి అది వెతుక్కుంది. మా పరువు ప్రతిష్టల గురించి ఆలోచించలేదు. అటువంటి పిల్లలు వున్నా లేకున్నా ఒకటే.

"చూడు! నారాయణరావు... నాకంటే మీ అందరికీ ఆ పిల్లమీద ప్రేమా అభిమానం వుంటాయనుకోను. ఇదో ఫార్స్. చిత్తగించండిలా. నేను దాన్ని ఇంట్లోకి రానీయను. అరుస్తాను. వారిస్తాను... నా మాట మీరు లెక్కజేయకుండా పదేపదే కోకిల తరపున వకాల్తా పుచ్చుకుంటారా. మండిపడతాను. నలుగురూ పోగౌతారు. ఇంతే జరిగేది. చివరికి మెత్తబడి నా కూతుర్ని లోపలికి తీసుకువెడుతూ 'థాంక్స్' చెబుతాను. యింత వూహించారు. అవునా? "

నారాయణరావు నోరెత్తలేదు.

డాక్టర్ శేషాద్రి కల్పించుకున్నాడు. "కోకిల కొడుకు ఈషాకి చెవిపోటు వచ్చినప్పుడు నేనే వాడికి ట్రీట్‌మెంట్ ఇచ్చాను. కోకిలే మిటో మొత్తం అర్థం అయింది. కోకిలమీద సమాజ ప్రభావం కూడా వుంది. మన సొసైటీ... టీన్స్‌లోనే అన్ని విషయాలూ తెలిసిపోవడం, థ్రిల్లింగ్ మూవీస్, స్నేహాలూ, నేల విడిచి సాము చేయడంలా హెచ్చులు... యిన్ని... యిన్నిటి ప్రభావం

"ఇంతవయసు వచ్చినా మనం కోరికల్ని చంపుకోలేకపోతున్నాం. అంత చిన్నపిల్ల ప్రేమలో మోసపోతే తల్లితండ్రులో, తోడబుట్టిన వాళ్లో చేరదీయాల్సింది పోయి గాలికి వదిలేయడం న్యాయమా? " అన్నాడు డాక్టర్ శేషాద్రి.

ఆయనకి చాలా కోపం వచ్చింది. అసలే ప్రయాణం చేసి వచ్చాడు. ఆ పైన అక్కడ పెళ్ళి చెడింది. అటునుంచి గంటలతరబడి నారాయణరావు ఇంట్లో కూర్చోవడంవల్ల చాలా అలిసిపోయాడు. గొంతు పెంచి "మిష్టర్ శ్రీనివాసమూర్తీ" అన్నాడు. "ఇప్పుడు ఇక్కడికి రావడంవల్ల పరిష్కారం అవుతుందనుకున్నాను. అంతకంతకీ సమస్య జటిలం అయిపోతోంది"

శ్రీనివాసమూర్తి తక్కువ తినలేదన్నట్లు మండిపడ్డాడు. "మీరంతా కట్టకట్టుకుని నా ఇంటిమీద విరుచుకుపడి నా మీద రంకెలు వేయడం ఏం బాగులేదు. నాయిష్టం... అది నా కూతురే కాదు. గంగలో దూకనీయండి. నాకు లేని బాధ మీకెందుకండీ... నేనేమీ నా బిడ్డను తీసుకురమ్మని మీ అందరినీ ప్రార్థించలేదే? "

"లిసన్ టు మీ... శ్రీనివాసమూర్తీ... నీ కూతురు హోటల్‌లో వుంది. నేను అక్కడ వదిలేసి వెళ్ళిపోతే ఎవరో ఒకరు ఆ పిల్లని 'క్యాష్' చేసుకుంటారు. అరే... తండ్రిగా




కాదు ఓ మనిషిగా ఆలోచించండి"

"ఈ నీతులు నా దగ్గర చెప్పకండి. తన దాకా వస్తేగానీ తలనొప్పి బాధ తెలియదు. మోసేవాడికిగానీ బరువు తెలియదండీ. అయినా మా ఇంటి విషయాలలో మీరంతా తలదూర్చుతారెందుకండీ. మీరేమైనా సంఘసంస్కర్తలా? వెళ్ళిపొండి. దయచేసి అందరూ వెళ్ళిపొండి" రోషంతో ఆయాసప డుతూ రెండు చేతుల్తో తల పట్టుకుని కూర్చున్నాడు శ్రీనివాసమూర్తి.

మాధవ చప్పున లేచి నిల్చున్నాడు. "అంకుల్ వెళ్ళిపోదాం. హోటల్ రూంలో కోకిల ఎంత అవస్థపడుతోందో ఏమో" అని. "మనం లాయరు దగ్గరకు వెళితే ఎలా వుంటుంది అంకుల్" అని అడిగాడు.

డాక్టర్ శేషాద్రి మెల్లగా లేచి వెర్రినవ్వు నవ్వాడు. శ్రీనివాసమూర్తివైపు చూస్తూ, "ఎందుకయ్యా పిల్ల గీతదాటింది గీతదా టింది, అని తెగ బాధపడిపోతున్నావు? మనలో ఎంతమంది నిగ్రహంగా వుంటారు? అరవైఏళ్ళు రాగానే ఆశ్రమా లకు ఎందుకెళ్ళరు? పులుపు చావదు సార్. మనకి తిండి పెట్టడానికీ, మన బాగో గులు చూడ్డానికి మనకో తోడు కావాలను కుంటున్నాం కదా! మరి ఆ చిన్న పిల్లలు వ్యామోహంలోపడి పొరపాట్లు చేస్తే ఎందుకు అర్థం చేసుకోరు? నేను వెళ్ళాక ఏమాత్రమైనా ఆలోచించే వారైతే "రూం నెంబరు ట్వంటీ, హోటల్ కాకతీయాకి" ఫోన్ చేసి చెప్పండి. లేకపోతే మీకెప్పటికీ దొరకను. దొరికినా కోకిలను ఇవ్వను. చివ రిగా ఓ మాట చెప్పనా మీలాంటి వాళ్ళు పురిట్లోనే సంధి కొట్టిపోతే ఇన్ని సమస్యలు వుండవు. గాడ్ బ్లెస్‌యూ" అంటూ ఆవే శంగా బయటకు వచ్చేశాడు.

నారాయణరావు లేచి శేషాద్రి వెనకే మాధవతో బయటికి వచ్చేశాడు.

కారు కదిలింది. నిశ్శబ్దంగా వుండిపో యారు ముగ్గురూ. ఆ నిశ్శబ్దంలో శ్రీనివాస మూర్తి ఇంట్లోంచి ఇద్దరు ఆడవాళ్ళు హృద యవిదారకంగా ఏడవడం వినిపిస్తూ గుండెల్ని కోస్తోంది.



కొంతదూరం వెళ్ళాక నారాయణరావు డాక్టర్‌వైపు చూస్తూ "సిన్సియర్‌లీ ఎక్కడో గానీ మీలాంటి వాళ్ళుండరండీ... కోకిల ఎవరు? మీరెవరు? నిజానికి మాధవ ఆ పిల్లతో ఉండడం మాకు కష్టమనిపించిం దండీ. చదువుకునే వయసులో కెరీర్ పాడు చేసుకుంటూ ఆ అమ్మాయితోనే గడిపేస్తే చివరికి ఏమైపోతాడో ఏమో అనే భయంతో వాణ్ణి కొట్టినంత పనిచేశాను. సొసైటీలో దర్జాగా బతకాలంటే చదువుకదా ముఖ్యం. ఈ స్నేహాలూ, సినిమాలూ తిండి పెట్టవు. మీకు ఎంత డబ్బుందీ అని అడ గరు. మీరేం చదివారు అని అడుగుతారు. నాదో పాలసీ... సరస్వతిని గుప్పిట్లో పెట్టుకో, లక్ష్మి తనంతటతానే పరిగెత్తుకొ స్తుందని. బాగా చదువుకుని అభివృద్ధిలోకి వచ్చాక వాడికి నచ్చినట్లు చేయమనండి. అప్పుడు నేనెందుకంటాను? " అన్నాడు.

"నిజంనిజం" మనస్ఫూర్తిగా ఒప్పుకు న్నాడు. డాక్టర్ శేషాద్రి కారు మలుపు తిరిగి

నాంపల్లిమీదుగా వస్తూంటే నారాయణరావు అన్నాడు. "ఓ పని చేద్దాం. ఆ పిల్ల చిన్న ప్పట్నించీ మాధవతోపాటు మా ఇంట్లో పెరిగింది. ముక్కూమొహం తెలీని మీరే ఇంత శ్రమ పడుతూంటే చిన్నప్పుడు ఎత్తుకుని తిప్పిన నాకు మాత్రం బాధ్యతలేదూ! కోకిల సంగతి నన్ను కూడా పట్టించుకోనీయండి."

మాధవ విచారంగా కిటికీలోంచి బయటికి చూస్తున్నాడు. 'ఎంత చిత్రం? ప్రభుగాడికి చీమకుట్టినట్టుగా కూడా లేదు. ఊరు



విడిచి వెళ్ళిపోయాడని సెల్‌లో ఫ్రెండ్స్ చెప్పారు. కోకిలకి దిక్కెవరు?'

"ఏయ్... హలో... మిష్టర్ వెంకటేశం", మాధవ మొహంముందు చిటికవేసి తనవైపు తిప్పుకున్నాడు డాక్టర్ శేషాద్రి. అప్పుడప్పుడు పిల్లల్ని గిరీశం స్టయిల్‌లో పిలుస్తాడాయన.

ఇటు తిరిగాడు మాధవ.

"నువ్వేం బెంగపెట్టుకోకు. ఆ ప్రభుగాడినీ, వాళ్ళ నాన్ననీ, శ్రీనివాసమూర్తినీ మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాను. కోకిలకి



ఏమీ కాదు. మనం ఇంత మందిమి వున్నాం. కౌన్ కిస్కాగాళ్ళు ఎంతమం దుంటే మనకేం?" అని నారాయణరావు వైపు చూశాడు డాక్టర్. "మీ భయంలో అర్థంవుంది. మా పిల్లలు సెటిల్ అయ్యారు. అయినా మీ మనసు గొప్ప దండీ. ఓ పని చేద్దాం. కోకిలకయ్యే ఖర్చుని నేను భరిస్తాను. వారానికోసారి వస్తాను. మనం 'కేసు'పెడదాం. అంతవరకూ ఆ పిల్లని మీ ఔట్‌హౌస్‌లో వుండే ఏర్పాటు చేయగలరా?"

నారాయణరావు క్షణం మాట్లాడలేదు.

తరువాత అతనే అన్నాడు. "కోకిలను మా ఇంట్లో వుంచుకున్నా, ఔట్ హౌస్‌లో ఉంచినా మాధవ ఆ పిల్లతోడిదే లోకం అనుకుంటాడు. చదువూ, పుస్తకాలూ మూల పడేస్తాడు. చంటివాణ్ణి ఎత్తుకుంటాడు. ఇక వాడి చదువు సాగినట్టే. భగవంతుడు నాకు చాలా డబ్బు ఇచ్చాడు. కోకిలకోసం ఆ మాత్రం ఖర్చు నేను చేయగలనండీ. చిక్కల్లా మా మాధవ తోటే"

"ఓకే... ఓకే... ఓకే" అన్నాడు డాక్టర్ శేషాద్రి. "అర్థమైపోయింది. మనం హోటల్ కెళ్ళి కోకిలని చూద్దాం. ఆ తరువాత మీరు అటూ నేను యిటూ"

కారు హోటల్‌ముందు ఆగింది. డాక్టర్ శేషాద్రి రూమ్ తలుపు తట్టి "కోకిలా" అని పిలిచాడు. తలుపు తీసిన కోకిల నవ్వబోయి ఆగిపోయింది. ముగ్గురూ లోపలికి వెళ్ళి విశాలంగా వున్న ఆ గదిలో సోఫాలో కూర్చున్నారు.

"ఏమైంది సర్" జారిపోతున్న పిల్లవాణ్ణి భుజంమీద వేసుకుంటూ అడిగింది కోకిల.

"ఏమౌతుంది? ఏమీ కాలేదు" డాక్టర్ శేషాద్రి నిట్టూర్చాడు. "నారాయణరావు గారూ, మాధవా నిన్ను చూడాలని వచ్చారు. మనం మనవూరు వెళ్ళిపోదాం"

కోకిల స్పృహ తప్పిన దానిలా సోఫాలో వాలిపోయింది. ఓవైపు చంటివాడు నలిగిపోతున్నాడు.

మాధవ నిర్ఘాంతపోయాడు. నారాయణరావు కంగారుగా ఆ పిల్లని పట్టుకున్నాడు. పిల్లవాడిని భుజంమీద వేసుకున్నాడు డాక్టర్ శేషాద్రి. ఓసారి కోకిల చేతిని అందుకుని వదిలేశాడాయన. కోకిలకి నీరసం వచ్చింది.

నారాయణరావు జగ్గులో వున్న నీళ్ల గ్లాసులో పోసి "కోకిలకి యివ్వు మాధవా" అన్నాడు.

మాధవకి బెంగగా వుంది. డాక్టర్ వైపు చూశాడు. "మన పనులు మనం చక్కబెట్టుకోవడమే కష్టంగా వున్న ఈ రోజుల్లో కోకిల గురించి మీరు చాలా బాధ్యత తీసుకుంటున్నారు"

"అసలేమైంది డాక్టర్‌గారూ" అని అడిగాడు నారాయణరావు.

"నథింగ్‌టు వరీ... స్ట్రెయిన్, నీరసం, బెంగ, ఆలోచనలు... ఇవే కారణం. ఇంత అనుభవం వుండి మనమే తట్టుకోలేం. ఆ పిల్ల భరించలేదు"

"పొద్దున్నుంచీ తిన్నదోలేదో" మాధవకి కాళ్ళూ చేతులూ ఆడడం లేదు. "పోనీ కాఫీ తెప్పించనా అంకుల్" అని అడిగాడు.

"త్వరగా... మనకి కూడా తీసుకురమ్మని చెప్పు" డాక్టర్ అన్నాడు.

మాధవ ఇంచుమించు పరిగెత్తాడు...

అదీ సంగతి.

★ ★ ★

ఒక్కనిమిషం...

ఆగండాగండి...

ఇదండీ కథ...

అసలేమైందంటే...

ఇదిగో... యిటు చూడండి.

ఈయన డాక్టర్ గోవర్ధన్‌రెడ్డి.

రెడ్డిగారి వయసు నలభై ఐదుకి అటూ ఇటూ...

ఆకర్షణీయమయిన విగ్రహం.

కళ్ళు సూదంటురాళ్లు.

అవి ఎక్స్‌రేలా పనిచేస్తాయి. అయస్కాంతంలా ఆకట్టుకుంటాయి. ఆత్మీయంగా పలకరిస్తాయి, ఓదారుస్తాయి. కరుణ వర్షాన్ని కురిపిస్తాయి.

వాటి నీడలో రోగులు కోలుకుంటారు. విశ్రాంతి తీసుకుంటారు.

గోవర్ధన్‌రెడ్డిగారి గురించి చెప్పాలంటే మాటలు చాలవు. భారతదేశం, భారత ప్రభుత్వం గర్వించే భరతమాత ముద్దుబిడ్డడు కదండీ... ఆయన వెనకాలే అటువైపు వెడదాం... సారీ ఆయన ప్రస్తుతం ఇంట్లో లేరు. 'సెల్'లో తెలుసుకున్నాను. అదిగో ఆయన కారు థియేటర్‌లో... అదిగో అక్కడ... అటు.

★ ★ ★

పల్చని సిల్క్‌తెర మెల్లగా లేస్తోంది. తెర పూర్తిగా లేవకముందే ఈలలూ, కూతలూ, హాలంతా క్రిక్కిరిసిపోయి వేడిగాడ్పులు వస్తున్నాయి. సన్నగా మొదలైన సంగీతం కొద్దికొద్దిగా శబ్దంచేస్తూ రెండునిమిషాల్లో హాలు దద్దరిల్లేట్లు వినిపిస్తోంది.

అడ్వర్టైజ్‌మెంట్లు, న్యూస్‌రీలు ఒకదాని తర్వాత మరొకటి.

ఢింగ్... ఢింగ్... ఢింగ్... డింగ్... ఛయ్ ఛయ్... ఛయ్... చయ్ ఊ...ఊ మ్రోగ్రో... కేకలు... ఆడియన్స్‌లో టెన్షన్.

లబ... లబ... లబ... మొత్తుకుంటున్నట్లే.

వెండితెరమీద నలభైమంది మగపిల్లలు, నలభైమంది ఆడపిల్లలు ప్లస్ హీరో, హీరోయిన్. హీరోకి, మిగిలిన మగపిల్లలకి ఇరవై నాలుగు మీటర్ల బట్టతో అందంగా సిగ్గును కాపాడారు.

హీరోయిన్‌కి, మిగిలిన ఆడ పిల్లలకి మాత్రం భుజంమీద ఓ పీలిక... ఛాతీమీద ఓ పీలిక. కటి కిందిభాగం మీద ఓ పీలిక. వెరసి 'బచావ్' పొదుపు ఉద్యమం ఆడ వాళ్ళ దగ్గరే ప్రారంభం అయినట్లు. పాట వినిపిస్తోంది. తగ్గట్టుగా అడుగులు పడుతున్నాయి.

శాస్త్రీయమో, అశాస్త్రీయమో తెలియదు. ఫుట్‌బాల్ తన్నినట్లు, క్రికెట్‌బాల్ విసిరేసినట్లు, సైకిలు తొక్కినట్లు, నెత్తి మొత్తుకున్నట్టూ, చెంపలు వాయించుకుంటున్నట్లూ, హీరో పిర్రమీద హీరోయిన్ రెండు చేతులతో తపతపలాడిస్తూ, వైస్‌వర్సా హీరోయిన్ పిర్రమీద హీరో బాదేస్తూ నృత్యంలో కొత్తరీతులు సృష్టిస్తున్నారు. కాదు... కాదు... పాపం డైరెక్టర్ చెప్పినట్లే చేస్తున్నారు మరి.

శివం ఎక్కినట్లు చిందులు తొక్కుతున్నారు. ప్రపంచం బద్దలైపోయిందేమో అన్నంత శబ్దం వినిపిస్తోంది.

తెరమీద నాట్యం వికృతంగా వుంది. భూకంపం వచ్చేసి అసలు కలియుగమే సమాప్తం అయిపోయినట్లు కొంచెం నడివయసు వాళ్ళు నీరసంగా కుర్చీల్లో వెనక్కివాలారు.

వాచీలో అరగంట గడిచిపోయింది. ఈ ఆర్భాటానికి చంటి పిల్లలు చీమకుట్టినట్లు కెవ్వుమన్నారు. ముసలివాళ్ళు డ్రమ్స్ శబ్దం విని ఆయాసపడి తెచ్చుకున్న మంచినీళ్ళు తాగారు. అసలు వీళ్ళనెవరు రమ్మన్నారా బాబూ!

డాక్టర్ గోవర్ధన్‌రెడ్డి ఇక్కడ వున్నాడు.

నెలల తరబడి అధ్యయనం చేస్తున్నాడు అతను.

ఒక్కో టైమ్‌లో ఒకే సినిమాని నాలుగు సార్లు చూస్తూ తెచ్చుకున్న డైరీలో ముఖ్యమైన అంశాల్ని వరుసక్రమంలో రాసుకుంటున్నాడు.

ఇంటర్‌వెల్‌లో లైట్లు వెలిగాయి. చిప్స్, కూల్‌డ్రింక్స్... ఆడ, మగ, చిన్నా, పెద్దా బేధం లేకుండా కర కరా శబ్దం చేస్తూ తింటున్నారు.

డాక్టర్ గోవర్ధన్‌రెడ్డి కెవ్వుమనబోయి

తమాయించుకున్నాడు. పక్కసీట్లో కూర్చున్న మూడేళ్లవాడు పడేసిన పాప్‌కార్న్ కోసం ఎలుక పరుగెత్తి కాలిని గీరింది. లైట్లు ఆరిపోయాయి.

సినిమా మొదలైంది.

గోవర్ధన్‌రెడ్డి భుజాలమీంచి, మెడమీంచి, చెంపలమీదుగా పాకుతున్న ప్రాణిని దులిపాడు. అదో పెద్ద బొద్దింక. సైకాలజీని బాగా 'ఔపోసన' చేసి... జంటనగరాల్లో మంచిపేరు తెచ్చుకున్న అతనే 'మూర్ఛ వస్తుందా?' అనుకున్నాడు.

కథ మొదలైంది. అమ్మాయి తండ్రి బూతులు తిడుతున్నాడు. అబ్బాయి తండ్రి మాత్రం తక్కువ తినలేదు. ఇటువారి బంధువులూ, అటువారి బంధువులూ జుట్టూ జుట్టూ పట్టుకున్నారు. చొక్కాలు చింపుకున్నారు. చీరలు లాక్కున్నారు. రొప్పుతున్నారు. చీపుర్లూ, సైకిలు చెయిన్లూ తెచ్చుకున్నారు.

'ఢబీ...ఢబీ... గుభీ...గుభీ' గుద్దుకుంటున్నారు. తన్నుకుంటున్నారు. అందులోంచి ఓ గొంతు "అరే, సత్తనారీ! పొల్లగానికేమైందిరా?" అరుస్తోంది.

"ఛల్ వూకోయే, గమ్మునుండు. లొల్లి వెట్టకు. నీయమ్మ"

"పొల్ల కానొస్తలేదు సత్తనారీ"

"పిల్లబాయే, పిల్లగాడూ పాయె"

"అయ్యా! యాడికి పోయిండ్‌రా"

డాక్టర్ గోవర్ధనరెడ్డి శ్రద్ధగా వింటున్నాడు.

టర్‌ర్ ర్ ర్... టర్‌ర్‌ర్ , ష్‌ష్‌ష్

"వామ్మో ఎలికాప్టరే"

డాబామీద హెలికాప్టర్ దిగింది. 'అక్కడున్న మందీమార్బలంతో పిల్లా పీచూ దమ్మిడీ కాసుతో "మమ్మల్ని ఆశీర్వదించండి" అని వధూవరులిద్దరూ చేతులెత్తి దండం పెడుతున్నారు.

'శుభం'



అయిపోయింది.

మళ్లీ తెర కిందికి దిగుతోంది.

సంగీతం మొదలైంది. చెవులు చిల్లులుపడుతున్నాయి.

గోవర్ధన్‌రెడ్డి బయటపడి 'హమ్మయ్య' అనుకున్నాడు. మెట్లు దిగుతున్నప్పుడు ఓసారి చుట్టూ చూశాడు.

హాలునిండా టీన్స్, టెన్త్, ఇంటర్ చదివే పిల్లలే.

భుజం, భుజం రాసుకుంటూ చేయిచేయి పట్టుకొని సర్రున దూసుకుపోతూ కప్పల్లా గెంతి బైక్‌మీద కూర్చుని 'రయ్'మని కలల్లో తేలిపోతున్నారు.

డాక్టర్ గోవర్ధన్‌రెడ్డికి జుట్టుపీక్కుని, చొక్కా చింపుకుని నెత్తిమొత్తుకుంటూ 'హా' అని శబ్దంచేస్తూ నడిరోడ్‌మీద పరిగెత్తి పారిపోవాలని వుంది.

కానీ అతను ఆ పని చేయలేడు.

సైకియాట్రిస్ట్‌గా అతను భారతదేశాన్ని వదిలిపెట్టడు. అతను అనుక్షణం మన సంస్కృతికి దాసుడై ఇక్కడి తన వాళ్ళని బాగుచేయాలని గవర్నమెంట్ మెంటల్ హాస్పిటల్‌లో పనిచేస్తున్నాడు. ఒక్కో మొండికేసుని 'ఛాలెంజ్'గా తీసుకుంటాడు.

గంటలు, రోజులు, వారాలు, నెలలూ, ఏళ్లూ గడిచిపోయినా పట్టువదలని విక్రమార్కుడిలా అనారోగ్యాన్ని తరిమికొట్టే రోజువరకూ నిద్రపోడు అతను.

కారు డోర్ తీస్తూంటే అతని కళ్ళు యధాలాపంగా 'క్యూ'వైపు మళ్ళాయి. ఓ బామ్మగారు మంచినీళ్ళ మరచెంబుతో నిలుచుని హైరాన పడుతుంటే జాలేసింది.

'హూ' దీర్ఘంగా నిట్టూర్చాడు ఆ డాక్టర్.

పదండి ముందుకు పదండి తోసుకు.

కదంతొక్కుతూ జనులారా' ఈ పాట అతని చెవిలో వినిపిస్తోంది. దేశాన్ని రక్షించుకోవడంకోసం ఇలాంటి ఉత్సాహభరితమైన గేయాలు రాసి సిపాయిల్ని యుద్ధానికి పంపించేవాళ్ళు

ఇప్పుడు కథ మారింది. వరుసమారింది.

ఎటువైపు పోతున్నామో తెలియదు.

ఎయిమ్‌లేదు, గోల్‌లేదు. గుడ్డెద్దు చేలో పడ్డట్టే.

పోతున్నారు, పోతున్నారు పాతాళంలోకి.

తమ్ముళ్లూ-చెల్లెళ్లు-కొడుకులూ, బిడ్డలు.

అమ్మలూ- నానమ్మలూ ఒద్దు ఒద్దు.

మేలుకోండి మేలుకోండి.

తిప్పికొట్టండి నీతిలేని కథల్ని

నిరసించండి సామాజిక స్పృహ లేని సాహిత్యాన్నీ, వెండితెర విన్యాసాల్నీ. అవన్నీ చెక్కలమీద చెదల్లాంటివి.

అది డాక్టరు గోవర్ధన్‌రెడ్డి మనసు ఆక్రోశం. అతను యింటిదారి పట్టాడు.

బీ బీ బీ

డాక్టర్ గోవర్ధన్‌రెడ్డి మనసు వికలమైపోయింది. ఒకటా రెండా ఏళ్లు... నాలుగు సుదీర్ఘ సంవత్సరాలు.

"కాఫీ తీసుకోండి" గిరిజ అతని భుజం మీద చేయివేసింది.

ఒక్కసారి వులిక్కిపడ్డాడు. విశాలమైన ఆ గదిలో అతను కిటికీ వూచల్ని పట్టుకుని సాయంత్రంపూట ప్రకృతిని తనివితీరా ఆస్వాదిస్తూ మనసు ప్రశాంతంగా వుంచుకునే ప్రయత్నంలో మునిగిపోయాడు. ఇప్పుడు భార్యని చూసి కిటికీ దగ్గర్నుంచి కదిలి "లాన్‌లో కూర్చుందాం పద" అన్నాడు.

గిరిజ అతని వెనకే బయలుదేరింది.

గోవర్ధన్‌రెడ్డి 'కాఫీ' రుచి చూసి "థాంక్యూ గిరిజా... నేను జబ్బు గురించి రోగుల్ని చాలా పరిశీలిస్తేగానీ తెలుసుకోలేను. కానీ నువ్వో నా మూడ్‌నిబట్టి నాకేం కావాలో చిటికలో తెలుసుకుంటావు. నువ్వు గ్రేట్" అన్నాడు మెచ్చుకోలుగా.

గిరిజ ఫక్కున నవ్వింది అచ్చం పువ్వులా. "ఈ చిన్న విషయంలో మీరనే గ్రేట్‌నెస్ ఏమీలేదు. బంధం. ఈ బంధంలో వైబ్రేషన్స్ వుంటాయి. మీరెక్కడో కాన్ఫరెన్స్‌లో వుంటారు. మీకు విపరీతమయిన దాహం వేస్తుంది.

"ఓ క్షణం ఆలోచనలో పడిపోతారు. అది చాలా చిన్న విషయం. ధారాళంగా మాట్లాడుతూ మధ్యలో నీళ్ళు తాగడానికి సభ్యతో, సభో అడ్డుపడుతుంది.

"సరిగ్గా అప్పుడే... ఆ టైమ్‌లోనే మంచి నిద్రలో వున్న నేను ఎవరో తట్టిలేపినట్టు లేచి తిన్నగా వంటింట్లోకి వెళ్ళి బిందెలో నీళ్ళు గ్లాసుతో ముంచి తీసుకుని గడగడా తాగేస్తాను. అక్కడ మీకు దాహం తీరుతుంది"

గోవర్ధన్‌రెడ్డి నివ్వెరపోయాడు. రెప్పవేయడం, మాట్లాడ్డం కూడా మరిచిపోయాడు.

గిరిజ అతని కళ్ళముందు చిటికె వేసి "యిటూ... నేను మాట్లాడుతున్నానండీ" అని అతన్ని ఈ లోకంలోకి తీసుకువచ్చింది.

"గిరిజా ఈ విషయాన్నే టెలీపతీ అంటారు" అన్నాడు.

గిరిజ ప్రశాంతంగా చెప్పింది. "చూడండి యివన్నీ నేనూ చదివాను. టెలీపతీ/క్లైయిర్ వాయిన్స్... సిక్స్త్‌సెన్స్ యిలాంటివాటి గురించి. నా ఉద్దేశ్యంలో భార్యాభర్తల మధ్యవున్న బంధానికి అంతకంటే ఎక్కువ పవర్ వుంది.

"మీ రుచులూ అభిరుచులూ యివన్నీ నాకు తెలుసు. మనకి పెళ్ళికాని క్రితం మీరెవరో నేనెవరో. కానీ ఆ తర్వాత మీ ఆకలీ నిద్రా, ప్రేమా, అలవాట్లూ ఇవన్నీ నాకు తెలిసిపోయాయి. మీరు ఢిల్లీలో వున్నా, అమెరికాలో వున్నా మీరేం చేస్తున్నారో నేను వూహించగలను. తెలుసుకోగలను"

"చాలా డేంజర్ గిరిజా" అరిచాననుకున్నాడు. కానీ అతను అనుకున్నంతగా శబ్దం రాలేదు.

గిరిజ నవ్వి "నాకు తెలిసింది" అంది. "మీరు శ్రీరామచంద్రుడనీ మీకు ఏ అల

వాట్లూ లేవని."

"థాంక్యూ గిరిజా" అతని కళ్లు ఆనందంతో చెమర్చాయి.

గిరిజ అడిగింది. "ఇవ్వాళ సీతారాం వస్తాడని చెప్పారు. ఏమిటి విశేషం"

"వాణ్ణి రానీ. వాడు రాగానే చెబుతాను"

"ఇంతకీ కోకిల" గిరిజ మాటని పూర్తిచేయనీయలేదు. అతను "సీతారాంని కూడా రానీ గిరిజా" అన్నాడు.

సెల్ గోల పెడుతూంటే జేబులోంచి తీసి "చెప్పు" అన్నాడు. గిరిజకి సైగచేసి "సీతారాం" అన్నాడు. ఆ తర్వాత "సెల్"లో విని.

"బయలుదేరి వస్తున్నాడు" అని చెప్పాడు.

'హు' గిరిజ నవ్వి "విచిత్రం మనిషి. ఎలాగూ వస్తున్నాడు కదా మళ్ళీ ఫోన్ ఎందుకో" అంది.

"వాడంతే" చెప్పాడు గోవర్ధన్.

లోపల గదిలో పిల్లలూ, తల్లీతండ్రీ టి.వీ. చూస్తున్నారు. పిల్లలకి లక్ష సందేహాలు వాళ్ళ అనుమానాలకి ఓపికగా జవాబు యిస్తున్నారు గోవర్ధన్ తల్లి భారతమ్మ, తండ్రి నరసింహారెడ్డి.

గేటు తెరిచిన శబ్దంలో కారు శబ్దం కలిసిపోయింది.

సీతారాం కారు దిగి లాన్‌వైపు వస్తూ రెండుచేతులూ బార్లా చాపాడు.

గోవర్ధన్ ఎదురువెళ్ళి అతన్ని వాటేసుకుని వీపుమీద తట్టాడు. క్షణం తర్వాత విడిపోయి "హలో వదినమ్మా" అన్నాడు సీతారాం.

"హలో బావున్నారా? " అంది గిరిజ.

అక్కడున్న కుర్చీలో చతికిలపడ్డాడు సీతారాం.

"మీరు వస్తేగానీ మీ ఫ్రెండ్ నోరు విప్పేట్లులేరు"

సీతారాం సంతోషం వ్యక్తంచేస్తూ, "దోస్త్ కదొదినమ్మా" అన్నాడు.

గిరిజ లోపలికి వెడుతూ "నేను వచ్చేవరకూ చెప్పొద్దు" అంది భర్తవైపు చూస్తూ.

పదినిమిషాల్లో టీ, స్నాక్స్‌తో వచ్చింది గిరిజ.

సీతారాం వాటిని తీసుకుని "ఏమైంది గోవర్ధన్, కోకిలెట్లుంది? " అని అడిగాడు. అతని గొంతులో తహతహ. 'కోకిల... తను చూసిన కోకిలకీ ఇప్పుడున్న కోకిలకీ జమీన్ ఆస్మాన్ ఫరఖ్ వుంటది' అనుకున్నాడు.

కోకిలని తొలిదశలో ఎప్పుడో ఓసారి చూశాడు.

గిరిజ కుతూహలంగా ముందుకు జరిగింది. "చెప్పండి" అంటూ.

డాక్టర్ గోవర్ధన్ "ఒక్క నిమిషం? " అని లోపలికి వెళ్ళాడు. సీతారాం మెడనొప్పి పెట్టేట్లు గోవర్ధన్‌రెడ్డి కోసం తిరిగి తిరిగి చూశాడు.

గిరిజకీ టెన్షన్‌గానే వుంది.

గోవర్ధన్‌రెడ్డి బరువుగా వున్న ఫైలు తీసుకువచ్చి సీతారాం చేతిలోపెట్టి "ఇది నా థీసిస్. దీన్ని కథే రాస్తావో, నవలే అందిస్తావో నీ ఇష్టం. పాఠకుల హృదయాల్లో పదికాలాలపాటు స్థిరంగా వుండాలి" అని తన కుర్చీలో కూర్చుని సుదీర్ఘం అయిన ఊపిరి తీసుకుని వదిలాడు.

"కోకిలకెట్లుందని నేనడిగితే గదిస్తవేందే అన్న"

"కోకిల అందులో వుంది"

"ఎలా వుంది కోకిలకి? " గిరిజ అడిగింది.

"కోకిల మామూలు కోకిల అయిపోయింది. ఈ వసంతంలో కుహూ, కుహూ... అంటోంది. నాలుగు వసంతాలు ఎండ తాపానికి ఒడిలిపోయి మృత్యువు వాడిలోనుంచి తప్పించుకుని బయటపడింది" అప్రయత్నంగా డాక్టర్ లేచాడు. పచార్లు చేస్తున్నాడు. కోకిల గురించి చెబుతున్నాడు.

"కోకిల మంచి స్టూడెంట్. తెలివైనది.





కోకిలకి ఇరుగూపొరుగూ మాధవ, ప్రభు వుంటారు. ఒక ఇంటిపిల్లల్లా, మచ్చ ఎరగని వాళ్ళ స్నేహంలో శృతి మించిన సినిమాల ప్రభావం కోకిలని అగాథంలోకి తోసేసింది. ఆ పిల్ల వీక్‌పాయింట్ సినిమాలు చూడ్డం.

"తామరతంపరలా వచ్చిపడుతున్న సినిమాల్ని విడవకుండా రెండేసి మూడేసిసార్లు చూసి ఓసారి అకస్మాత్తుగా ఫంక్షన్ హాల్లో పడిపోయింది.

"అలా నా దగ్గరకి ఈ ప్రపంచంతో సంబంధం లేని స్థితిలో వచ్చింది"

సీతారాం ఓసారి ఫైల్ చూసి "వది నమ్మా నువ్వు చదివినావా?" అనడిగాడు.

గిరిజ తలూపింది.

గోవర్ధన్‌రెడ్డి అతనితో "ఓసారి నువ్వూ తిరగెయ్యి" అని "నేను కోకిలనీ వాళ్ళ పేరెంట్స్‌నీ మనింటికి డిన్నర్‌కి రమ్మని పిలిచాను. నీ గురించి చెప్పాను. త్వరగా వస్తే నువ్వూ చూస్తావని" అన్నాడు.

"వెల్... నాకూ చూడాలనే వుంది" చెప్పాడు సీతారాం.

"ఫోన్ చేసి వస్తాను. ఈలోపుగా చూడు' అని లోపలికి వెళ్ళాడు.

డాక్టర్ తిరిగి వచ్చేలోగా సీతారాం ఆ కాగితాల్ని చదివేశాడు. అతని కళ్ళు తడిశాయి.

ఓ మంచి డాక్టర్ ఓ మతిభ్రమించిన కన్నెపిల్ల జీవితాన్ని సరిచేసేందుకు యజ్ఞం చేశాడు.

కూర్చున్నా, నిలుచున్నా, పడుకున్నా, ఊపిరి పీలుస్తున్నా నిరంతరం ఆ పిల్లని మామూలు మనిషిని చేసేందుకు పడ్డ కష్టం కనిపిస్తోంది ఆ కాగితాల్లో.

గోవర్ధన్‌రెడ్డి పేరు ప్రతిష్టల కోసం చేయలేదు.

జీవితం అపురూపం అయిన వరం.

భగవంతుడు ఈ జీవితాన్ని మధురంగా బతికేందుకు కేటాయించాడు.

అటువంటి బతుకుని చీకట్లో ఉంచేయకూడదు.

కోకిల అందాల చిన్నది.

కోకిల... మధురాతిమధురంగా పాడగలది.

కోకిల మూగపోకూడదు.

సీతారాం చప్పున డాక్టర్ గోవర్ధన్ చేతులు గట్టిగా పట్టుకున్నాడు. "నువ్వు గొప్పోడివిరా అన్న. సాలె పంతులిస్కూల్ల పద్దంక సదివినం గదే. నన్నిడ్సిపెట్టి సెంట్ ఫిలమిన్ హైస్కూల్‌కి పోయినవ్. గా దినం నన్ను కూడా తోల్కొని పొయ్యుంటే నేను కూడా డాక్టర్ ఐతుంటిని..."

"సీతారాం" డాక్టర్ గట్టిగా అరిచాడు. "సీతారాం! ఎవరి వృత్తి వాళ్ళదే. జర్నలిస్టుగా ఎంతమంది కళ్ళు తెరిపిస్తున్నావ్. ఎంతమంది చీకటి వ్యాపారాలు బయటపెడుతున్నావ్. ఎన్నిరకాలుగా దేశానికి సేవచేయాలో అన్నివిధాలా చేస్తున్నావు. ఇంతకంటే ఏం కావాలి జీవితానికి?"

తృప్తిగా నవ్వుకున్నారు ఇద్దరూ.

"కోకిల ఎక్కడెక్కడికి వెళ్ళిందీ, ఎలా ప్రవర్తించిందీ... ఆమె ఫీలింగ్స్‌ని మీరెలా తెలుసుకోగలిగారు?" గిరిజకి అర్థంకాలేదు.

సీతారాం కలుగచేసుకున్నాడు. "సినిమా చూస్తున్నట్లూ, నవల చదువుతున్నట్లుంది. అసలు కోకిల ప్రవర్తనకీ ఈ సంఘటనలకీ పొత్తెలా కుదిరింది గోవర్ధన్"

"గోవర్ధన్ తను నాటిన కొబ్బరిచెట్టును ఆనుకుని నిలుచుని ఆ చెట్టు ఆకుల్ని ప్రేమగా పట్టుకుని "ఈ చెట్టు పదేళ్ళక్రితం పాతాను. ప్రాణంలా చూసుకుంటున్నా. కోకిలని నాకు అప్పచెప్పారు వాళ్ళు. అంటే... ఆమె అన్నావదినలు"

"అన్నావదినలా?" గిరిజ ఆశ్చర్యంగా అడిగింది.

అతను "ఆ" అన్నాడు.

"నాలుగేళ్ళు మన లోకంలో లేని కోకిల ఎలా బయటపడింది? నువ్వెలా తెలుసుకోగలిగావు ఈ కథంతా?" సీతారాంకి

మొత్తం వినాలని వుంది.

అప్పుడు చెప్పాడు గోవర్ధన్. "కోకిల పడి పోయిన వెంటనే నిమ్స్‌కి తీసుకువెళ్ళారు. అక్కడ పరీక్షల్లో మనసుకి వైద్యం చేయాలని రిపోర్ట్స్‌లో తెలుసుకుని డాక్టర్ శేషాద్రి నా దగ్గరకి పంపించారు"

"అయితే డాక్టర్ శేషాద్రి పిల్లల డాక్టర్ కాదా? "

"కాదు" చెప్పాడు రెడ్డి.

"మరీ కథలో కోకిల పిల్లవాడూ, ప్రభూ, మాధవా ఏమైపోతారు? "

డాక్టర్ రెడ్డి దీర్ఘంగా నిట్టూర్చి తన కుర్చీలో కూర్చుంటూ "ఆ ఫైల్‌లో ఉన్న కాగితాల్లో కోకిల నవ్వినప్పుడు, కూర్చున్నప్పుడు, గర్భవతిలా భారంగా నడుస్తున్నప్పుడు, తలగడని భుజంమీద వేసుకుని జోల పాడినప్పుడు, చెవిలో పోటా అని అడిగినప్పుడు ఒకటేమిటి ఆ పిల్ల ప్రతి కద లికనీ, మాటల్నీ డైరీల్లో నోట్ చేసుకున్నాను" అని మళ్ళీ ప్రారంభించాడు. "కాజీపేట వచ్చేసింది. రైలు వెళ్ళిపోయింది. ఇలా ఒకటేమిటి ఆ పిల్ల మాటల్లో నేను సంఘటనల్ని చూసేవాడిని"



"ఇలా ఎందుకు జరిగింది?" సీతారాం గొంతులో ఆతృత.

"పొల్యూషన్... సినిమాల్లో సౌండ్ పొల్యూషన్, సినిమాహాళ్లల్లో సరౌండింగ్స్ పొల్యూషన్, సబ్జెక్ట్‌లో పొల్యూషన్, డైలాగ్ పొల్యూషన్... ఒకటేమిటీ?... పిల్లల జీవితాలు శృతి తప్పిన రాగాలు. ఎవరి పొట్టకు వారు సంపాదించుకోవాల్సిన ఈ రోజుల్లో.. తల్లులకు కూడా ఉద్యోగధర్మాలు. దాంతో ... బిజీ...బిజీ... ప్రపంచమంతా ఇంచుమించు ఇలాగే ఉంది. పిల్లలకి కథలు చెప్పే తాతలూ, అమ్మమ్మలూ, నానమ్మలూ లేరు. ఎందుకో తెలుసా? ఆ ముసలివాళ్లకి సేవలు చేయడం అదనపు పని. ఆ వృద్ధుల్ని చూడలేరు. వాళ్లకి అనాథాశ్రమాలు ఉండనే ఉన్నాయి...."

గిరిజ విస్తుపోయింది. "కోకిల మతి పోవడానికీ పెద్దవాళ్లు ఆశ్రమాలు పట్టిపోవడానికీ సంబంధం ఏమిటండీ?"

గోవర్ధన్ బాధగా అన్నాడు "మా పల్లెటూర్లో మా నాయనమ్మా, తాతగారూ కథలు చెప్పేవాళ్లు. కలిసి ఉన్న పెద్ద కుటుంబాలు ఆ రోజుల్లో చంటిపిల్లలకి ఎంతో భద్రత ఉండేది అప్పుడు. అరే... పండగరోజుల్లో నిత్యం సందడే.

ఆడపిల్లకి వెర్రి వేషాలు వేయడం తెలియదు. 'అబ్బా! జీవితం అంటే ఆషామాషీ కాదు. పరమపదసోపాన పటం లాంటిది. సుఖాలు, కష్టాలు.... అడుగుతీసి అడుగు వేయడంలో కూడా జాగ్రత్తగా వుండాలి' అన్న విషయం తెలిసేది.

"ఇప్పుడో... క్లబ్బులు, డిస్కో డాన్సులు... మోడరన్ పద్ధతులూ, సినిమాలూ, టీవీలు.... మాటలుండవు. హాయ్... హాయ్‌లూ... గాలిలో ముద్దులు... శరీరం, శరీరం రాసుకుంటున్నప్పుడు రగులుతున్న మంటల్ని నీతి నియమాల హద్దుల్ని దాటేసి చల్లార్చుకుంటూ అశాశ్వతం అయిన ఘడియల్ని శాశ్వతం అన్న భ్రమలో బ్రతికేస్తూ... దగా పడిపోతున్నారీ పిల్లలు...

"చెప్తే వినని పిల్లలూ, చెప్పినా అర్థం చేసుకోలేని పిల్లలూ, చెప్పడానికి టైమ్ లేని, తమని తామే కంట్రోల్ చేసుకోలేని తల్లితండ్రులూ... ఇలా ఎన్నో సమస్యలు.

"అయినా తల్లి ఎక్కడున్నా పక్కనే ఉండి తనని శాసిస్తోందన్న భయం పిల్లల్లో కలిగించే తల్లితండ్రులూ లేకపోలేదు. కానీ ఈరోజుల్లో వారి సంఖ్య క్షీణిస్తోంది"

అతనిలో ఆవేశం కట్టలు తెంచుకుంటోంది. మొహంలో, మెడ మీద, మూసిన పిడికిలి మీదా నరాలు రక్తంతో వుబ్బి అతనిలోని ఆరాటాన్ని చూపిస్తున్నాయి.

"కోకిలకి జరిగింది ఇప్పుడు తెలుసా?"

"అసలు తెలియదు. నిద్రలోంచి లేచినట్లు... ఉందామ్మాయి మనసు. అంటే సుదీర్ఘమయిన నిద్రలోంచి లేచింది ఆ అమ్మాయి. అబ్బ! ఇంతసేపు పడుకున్నానా? అని ఆశ్చర్యపోతాం. ఆ విధంగా లేచి కూర్చుని చుట్టూ చూసింది. నాలుగేళ్లు.... 'ఏమైంది? ఏమైంది?' అని బెంబేలు పడిపోయింది. ఏదీ జ్ఞాపకం లేదు. ఏం జరిగింది? అంటూ విలవిల్లాడిపోతోంది. ఆ టైమ్‌లో కూడా కోకిలతో సమానంగా కోకిలకి నచ్చచెప్పి.... ఓహ్..." అలిసిపోయాడు డాక్టర్ గోవర్ధన్‌రెడ్డి.

ముగ్గురి మధ్యా కాసేపు నిశ్శబ్దం.

కోకిల గతంలోకీ, వర్తమానంలోకీ ముగ్గురూ కాసేపు ప్రయాణం చేశారు. విన్నమాత్రంగానే గిరిజా, సీతారామ్‌లు అలిసిపోయారు.

వృత్తిరీత్యా గొప్ప డాక్టరే అయినా అతనూ మామూలు మనిషే. ఈ సమస్య అతన్నీ పీడించింది. కోకిలని మనిషిని చేయడం కోసం ఆమె పెరిగిన, తిరిగిన ప్రదేశాలకి వెళ్లాడు. ఆమె వ్యక్తిగత జీవితంలో మచ్చ లేదని కూడా తెలుసుకున్నాడు. ఆ విషయమే ఇప్పుడు చెప్పాడు. "తల్లితండ్రుల గారాబం, అన్నావదినల అభిమానం, ఒక్కో

సమయంలో వాళ్ల నిర్లక్ష్యం ఇలా ఎన్నో కారణాలు ఆమెకు మతి భ్రమించేలా చేశాయి సినిమాల ప్రభావం ఆ చిన్నమెదడును డిప్రెషన్‌లోకి పంపాయి"

"దీనికి మీరింత ఆందోళన పడుతున్నారెందుకండీ? కోకిల నార్మల్ గా అయిపోయిందని చెప్పారు కదండీ" గిరిజ భయపడింది. అదేదో సినిమాలో మాదిరి పిచ్చాసుపత్రిలో వాళ్ళ సేవ చేస్తూ ఓ నర్స్ పిచ్చిదైపోతుంది. ఓవర్ బర్డెన్... మోయలేని భారం ఈ రెండూ కలిసి విశ్రాంతి తీసుకోని గోవర్ధన్‌ని ఏం చేస్తాయో అని కంగారుపడింది.

"రిలాక్స్... గోవర్ధన్, రిలాక్స్" సీతారాం డాక్టర్ చేతిమీద చేయివేసి అనునయించాడు. "నువ్వేం చెప్పాలనుకుంటున్నావు? ఇది నీ ఒక్కడి సమస్యాకాదు. మనందరిదీ. ప్రతీ చర్యకీ పరిష్కారం వుంటుంది"

గోవర్ధన్ చెప్పాడు. "ఒక స్టేజ్‌లో కోకిలని గొలుసులతో కట్టేయాలని కూడా అనుకున్నాం. కానీ వాళ్ళన్నయ్యా వదినా ఆ పిల్లని ముట్టనీయలేదు. వాళ్ళకి చాలా ఓపిక. కంటికి రెప్పలా చూసుకున్నారు. కోకిల దగ్గర నేను లేనప్పుడు వాళ్ళే వుండేవారు"

"చివరికి ఎలా తగ్గింది?" సీతారాం సందేహంగా చూశాడు.

"దేవుడి దయ. వాళ్ళ పూజాఫలం"

"మరి ప్రభూ, మాధవ వీళ్ళిద్దరూ ఏమయ్యారు? కోకిలను పెళ్ళాడేదెవరు?"

డాక్టర్ రెడ్డి భళ్ళున నవ్వాడు "ఆరేయ్ సీతారాంగా ఇది సినిమా కాదు. జీవితం. వాళ్ళిద్దరూ అప్పుడప్పుడు వచ్చి వెడుతూ వుంటారు. మంచి స్నేహితులు. అంతేగానీ పెళ్ళీ, ప్రేమా అసలే లేవు. కోకిల భ్రమలు... ఇల్యూజన్స్...

"తాను ప్రభూ ఏకమయినట్టు, ప్రభు తనను మోసం చేసినట్టూ, తాను బిడ్డని కనినట్టు, అలాంటి స్థితిలో కూడా ప్రపంచంలో వున్న డాక్టర్ శేషాద్రిలాంటి మంచి వాళ్ళు తనని ఆదుకున్నట్లు... ఇదంతా కోకిల భ్రమలు. జీవితమంతా సినిమాలాగే అనుకునే భ్రమలు. ఎన్నో ప్రభావాలు ఆమె చిన్ని మనసులో గట్టి ముద్రలు వేసుకుని భయమనే గదిలో బంధించి వెంటాడాయి. నాలుగేళ్ళుగా ఇవన్నీ నేను రీసెర్చి చేసి తెలుసుకున్న విషయాలు. తరచూ డిప్రెషన్‌లో కెళ్ళిపోయే కోకిలని బాగా గమనించిన అన్నావదినలు సరైన టైంలో ఆమెను నా వద్దకు తెచ్చారు. ఆఖరి రోజుల్లో మాధవ కూడా స్నేహితుడిగా ఆమెకు తన చేతనైన సేవ చేశాడు. మోరల్ సపోర్ట్‌ను ఇచ్చాడు. హాస్పిటల్లో వుండేవాడు. నా వైద్యజీవితంలో ఇదొక మరపురాని విజయంగా అనిపిస్తోంది"

"అయితే... ఈ కథంతా...?"

ఆశ్చర్యంగా చూస్తున్న డాక్టర్‌తో "కోకిల కథ. కోకిల తనకుతాను ఊహించుకున్న కథ."

"కోకిల ఏమంటుందీ?" అడిగింది గిరిజ.

"వస్తుందిగా చూడండి" చెప్పాడు డాక్టర్.

ముగ్గురూ లేచి లోపలికి వచ్చారు. గదిలో లైట్లు వెలిగాయి. సీతారాం పక్క గదిలోకి చొరవగా వెళ్ళాడు. అక్కడ నర్సింహారెడ్డిగారూ, భారతమ్మా వున్నారు.

సీతారాంని చూడగానే నర్సింహారెడ్డిగారు ప్రసన్నంగా అయి, "బాగున్నారా. మళ్ళీ ఏం రాస్తున్నారు?" అనడిగారు.

సీతారాం ఆయనకి దగ్గరగా వచ్చి చేతులు పట్టుకుని ఓసారి వొంగి నమస్కారం చేసి, నిటారుగా అయి, "బాపూ నేనేం రాస్తనే... వాడు చెప్తడు. నేను రాస్తగంత నేనే" అన్నాడు.

"అదే ఏం రాస్తున్నావ్? భాష కొంచెం కూడా మారలేదు"

నవ్వాడు సీతారాం. "పొట్టనిండినట్లుంటదే బాపూ. మనోళ్ళు మనోళ్ళు కల్సినప్పుడన్నా. మాట్లాడకుంటే ఎట్ల?"



నర్సింహారెడ్డిగారు తృప్తిగా ఊపిరి పీల్చారు. "ఏమైనా చెప్పు. స్నేహానికి హద్దు ల్లేవు సీతారాం. నువ్వు రాయ బోయేదేమిటో? "

"చెప్త... చెప్త..." అని కొద్దిసేపు కూర్చుని తిరిగి గోవర్ధన్ వున్న గదిలోకి వచ్చాడు.

★ ★ ★

భోజనాలకి అన్ని ఏర్పాట్లూ జరుగుతు న్నాయి. డాక్టర్ గోవర్ధన్‌తో పనిచేసిన జూనియర్ డాక్టర్ వాసుదేవ్, సిస్టర్ విద్యా కూడా ఈ విందుకు హాజరయ్యారు.

వాళ్ళిద్దరూ డాక్టర్ గోవర్ధన్‌కి కుడిభుజం లాంటివాళ్ళు. అభివృద్ధిలోకి వస్తున్న వాళ్లని ప్రోత్సహించాలని ప్రభుత్వానికి తెలియచే శాడు డాక్టర్.

అందరూ సోఫాల్లో కూర్చున్నారు.

"కోకిల వస్తలేదేంది? " సీతారాంకి కంగారు ఎక్కువ.

"వస్తుంది" అంటూండగానే గేటు చప్పు డైంది.

"వాళ్ళు వస్తున్నారు? " అన్నాడు డాక్టరు.

తల తిప్పి సీతారాం అతనివైపు చూస్తూ "నేనెవరో చెప్పాలా? " అనడిగాడు.

"ఫరవాలేదు చెప్పేయ్. ఇది ఇంటర్వ్యూ. ఇలాంటివి ప్రజలకి తెలియాలి" అన్నాడు డాక్టర్.

ఐదు నిమిషాల్లో తలుపులు తెరుచుకుని ముందు సంపత్ తరువాత సబిత, కోకిల, ఆమె తల్లితండ్రులు సంపత్ ఇద్దరు పిల్లలూ వచ్చేశారు.

వస్తూనే శ్రీనివాసమూర్తి మిఠాయి డబ్బా డాక్టర్ చేతికిచ్చి నమస్కారం చేశాడు. డాక్టరు మాట్లాడలేకపోయాడు. "పెద్దవారు మీరు" అన్నాడు.

శ్రీనివాసమూర్తి ఆనందంతో చెమ్మగిల్లిన కళ్ళను తుడుచుకుని "మీ రుణం తీర్చుకోలే నిది. కోట్లు ఇచ్చినా తక్కువే. అయినా ఈ స్వీటు, ఈ గులాబీ మా సంతోషానికి గుర్తుగా తీసుకోండి"

డాక్టర్ వాటిని తల్లికీ, తండ్రికీ ఇచ్చాడు.

కోకిల పేరుపేరునా పలకరిస్తూ సీతారాం దగ్గరకి వచ్చి ఆగిపోయింది.

సీతారాం తనదైన ధోరణిలో "నేను కోకీ! సీతారాం. జర్నలిస్టుని. ఎట్లున్నవమ్మా? దావతెప్పుడు? " అని నవ్వాడు.

ముందు భయపడింది కోకిల. వెంటనే తమాయించుకుంది. డాక్టర్ వైపు చూసింది. ప్రొసీడ్ అన్నాడు డాక్టరు. ఇప్పుడు సీతారాంవైపు చూసింది. "కోకీ... కోకీ, కయ్యా, కయ్యా గట్ల ఒర్లుతవేందే అన్నా. మంచిగ, ముద్దుగ 'కోకిల' అన లేవు? దావత్తా? అన్నతాన లడ్లున్నయ్... గవి తిను. ఏమైతది? మన అన్ననే" కోకిల ఆపేసి నవ్వింది.

డాక్టర్‌కి సంతోషం ఆనందం అతన్ని చుట్టేసి మాట్లాడనీయడంలేదు.

కోకిల నోటివెంట ఈ మాటలు విని చాలాకాలమవడంతో తల్లీతండ్రీ, అన్నావది నలు కూడా ఆనందసాగరంలో ఉరకలు వేశారు.

గిరిజ లేచి సంపత్‌వైపూ, శ్రీనివాస మూర్తివైపూ చూసి "అందరూ భోజనాలకి లేవండి. కలిసి భోజనం చేద్దాం. ఆయన ఈరోజుకోసం ఏళ్ళు ఎదురుచూశారు" అంది.

శ్రీనివాసమూర్తి భార్య చేతిని అందుకుని నర్సింహారెడ్డిగారి దగ్గరకీ అతని భార్యవద్దకీ వెళ్ళి పాదాభివందనంచేసి "అమ్మా భార తమ్మా... నీ కొడుకు నిజంగా భారతమాత ముద్దుబిడ్డ సుమా" అన్నాడు ఉద్వేగంతో

"శతమానం భవతి" లేచి నిలుచుని ఆశీ ర్వదిస్తున్నారు రెడ్డిగారి తల్లీ తండ్రీ.

అక్కడ అవధుల్లేని ఆనందం.






# చతురకతలు

## దావా

'మంత్రవాది మహేశం ఎమ్మే ఎల్లెల్బీ' అన్న బోర్డు కట్టి ఏళ్లు గడుస్తున్నా గోళ్ళు గిల్లుకోవడమే కాని ఒక్క కేసూ వాదించిన పాపాన పోలేదు మహేశం. బోర్డు కట్టడా



నికి అయిన అప్పైతే మిగిలింది కాని వకాల్తా పుచ్చుకోమంటూ ఒక్క అప్పారావూ రాలేదు మహేశం దగ్గరకి. అయినా డీలా పడిపోకుండా ఏనాటికైనా తనని లాయరుగా పెట్టుకోవడానికి ఎవడో ఒకడు రాక పోతాడా అన్న ఆశతో ఆ కోర్టు ఆవరణలో ఉన్న ఓ పెద్ద రావిచెట్టుకింద స్థిరపడిపోయాడు చెట్టుకింది ప్లీడరుగా. రోజూ పది గంటలకల్లా కోర్టుకి రావడం, చెట్టు కింద కట్టిన సిమెంటు చప్టాని శుభ్రంచేసుకొని కూర్చోవడం. మధ్యమధ్యలో ఆ పక్కనే వున్న టీ బడ్డీ వాణ్ణి అరిచి పిలిచి టీలు తెప్పించుకొని తాగడం, మధ్యాహ్నాం అమ్మ కట్టిచ్చిన కేరేజీని ఖాళీచేయడం, ఆపై సాయంకాలం దాకా చప్టామీద చేరిన జనాలతో బాతాఖానీ వేయడం, వాళ్ళని మాటల్తో ఖూనీ చేయడం, అయిదు కాగానే ఇంటిముఖం పట్టడం. ఇదీ లాయర్ మహేశం దినచర్య.

ఆరోజూ యధాప్రకారంగా ఒక్క క్లయింటూ వెంట లేకుండా తన కార్యాలయం కిందకు చేరుకున్నాడు మహేశం. యధావిధిగా సిమెంట్ చప్టాని శుభ్రంచేసుకొని కూర్చోబోతున్న తరుణంలో టప్‌మని శబ్దం కావడంతో ఆ వంక చూశాడు మహేశం. తెల్లగా ఇంత ముద్దపడి వుంది. ఆ వెంటనే చెట్టుపైకి చూశాడు. "తీక్షణమైన నీ చూపుకి భస్మమైపోవడానికి నేనేం కొక్కెరని కాను.

నువ్వు కౌశికుడివి కాదు" అన్నట్టుగా "కాకా" అంటు కాకారవాలు చేసింది ఓ కాకి తను కూర్చున్న కొమ్మమీదనుంచి మరో కొమ్మమీదికి జంప్‌చేస్తూ. "కాకాసురా..." అంటూ పళ్ళు నూరుకున్నాడు మహేశం వాయస విసర్జనాన్ని శుభ్రం చేసుకుంటూ. భుజాన వేలాడుతున్న సంచిని చెట్టు మొదలుకి కొమ్మ విరిచి చేసుకున్న హుక్‌కి తగిలించాడు. తను కూడా కూర్చోబోయి తనవైపు ఎవరో రావడం గమనించి చిరునవ్వుని ముఖంమీదకి తెచ్చుకొని ఆ వస్తున్న వ్యక్తివైపు చూశాడు. ఆ వ్యక్తి దగ్గరకు రాగానే "రండి రండి చిదంబరంగారూ" అంటూ ఎంతో పరిచయమున్న వ్యక్తిని పలకరించినట్టు పలకరించాడు మహేశం. మహేశం పలకరింపుకి పులకరింపు కలిగిందో...ఏమో కంగారుపడిపోయాడు ఆ వ్యక్తి. "అయ్యబాబయ్యబాబో... నా పేరు తవరికెట్టా తెలిసిపోనాదండీ బాబూ" అన్నాడు. "అయ్యబాబయ్యబాబో... తమరి కళ్ళు చూస్తే తెలిసిపోనాదండీబాబూ..." అతణ్ణి అనుకరిస్తూ చెప్పాడు మహేశం. "అవునుగానీ... చిదంబరం గారూ... మీ కళ్ళేమిటి అలా వున్నాయి. ఒక గుడ్డు ఆ పక్కకి, మరో గుడ్డు ఈ పక్కకి" అడిగాడు మహేశం.

"అదాండీ... మరిప్పుడు తీవీలో చీరియల్ను వత్తన్నాయాండి. మా పక్కవాళ్ళ తీవీలోనూ, మా తీవీలోనూ ఒకేసారి రొండు చీరియల్ను సూట్టం ఎట్టాకుదురుద్ది"

"అవును కదా మరి. కుదర్దుకదా" మధ్యలో అన్నాడు మహేశం.

"కదాండి మరి. అందుకే ఒకేపాలి సూడొచ్చు కదాని రొండు తీవీల్ని కొన్నానండి. ఎదురుంగా ఈ పక్కనొకటి, ఆ పక్కనొకటి పెట్టుకొని రొండు చీరియల్స్ ఒకే సారి సూడగా... సూడగా కళ్ళు ఇట్టాగయిపోనాయండి" అన్నాడు చిదంబరం.

"అబ్బ... చిదంబరంగారూ మీ కళ్ళ కథ చాలా ఇంట్రెస్టింగా వుందండీ. ఇంతకూ తమరు వచ్చిన పనేమిటో చెప్పారు కాదు" అన్నాడు మహేశం.

"అదే కదండి మరి నేను సెప్పేది. ఉప్పుడు మీరు చబ్బులు కంపెనీమీద దావా ఎయ్యాలి" అన్నాడు చిదంబరం.

"సబ్బులు కంపెనీ మీదా..." ఆశ్చర్యపోయాడు మహేశం.

"అవునండీ బాబూ. చబ్బులు కంపెనీ మీద్దే. మీరు తీవీలు సూడ్రా ఏంతీ"

"ఎందుకు చూడను. అప్పుడప్పుడు చూస్తూనే వుంటాను. ఏదీ... తీరికుండదు గదా... ఆట్టే" అన్నాడు మహేశం.

"అవునాండీ. చీరియల్ మద్దిలో అయ్యేయో వత్తాయి. అయేటండీ" ఆరాగా అడిగాడు చిదంబరం.

"అవ్వా. అవి వ్యాపార ప్రకటనలు" చెప్పాడు మహేశం.

"అయ్యొత్తాయాండీ. ఈ మద్దిల ఒకటొత్తన్నాదండి, అమ్మాయేమో బట్టలుతుకుతాదండి చబ్బెట్టి. ఆ పిల్లింట్లో తీవీ ఉన్నాదండి. ఆ తీవీలోంచి ఒకడు 'ఆ చబ్బు కాదు, ఇదిగో, ఈ చబ్బుతో ఉతుకు' అంటూ ఓ చబ్బు బిళ్ళని ఆ పిల్లమీదికి ఇసురుతాడండి. ఆ పిల్లేమో లతుక్కున అట్టేసుకుంటాదండి. అవునుకాదాండి. ఆ పిల్లేమొ బట్టలుతికేసినాదండి. 'మరి మీరు కూడా ఉతుక్కోండి' అంటూ ఆ పిల్ల చబ్బు బిల్లని మన తీవీ లోంచి మనమీదకి యిసురుతాదండి. అదిగో అక్కణ్ణే వస్తన్నాదండి తిరకాసు. తీవీలోంచి ఆ పిల్ల చేతిలో చబ్బు బిల్ల పడింది. మన తీవీలోంచి ఆ పిల్ల యిసిరితేనేమో చబ్బుబిల్ల మనసేతిలో పడట్నేదు. అసలేంటి యిసయిం. అందుకే ఆ చబ్బుల కంపెనీ మీద దావా ఎయ్యాలండి" అంటూ వివరించాడు చిదంబరం. ఏం చెప్పాలా అని ఆలోచిస్తున్న మహేశం వంక చూస్తూ మళ్ళీ తనే అన్నాడు చిదంబరం. "ఇదిగో పీడరుబాబూ. ఎంత ఖర్చయినా పర్లేదు. మనకి సేతిలో ఆ చబ్బు బిల్ల పడాలి. అంతే" అని.




"ఓర్నాయినో. ఇదెక్కడి కేసురా బాబూ..." అంటూ తల పట్టుకున్నాడు మహేశం.

"అదేంతండీ బాబూ... అత్తాగయిపోత న్నారు. ఇంతకీ పీడరుబాబూ... ఇప్పుడు మనం చబ్బులు కంపెనీమీద దావా ఏత్తే బాగుంటదా... తీవీ కంపెనీ మీద ఏత్తె బాగుంటదా" అనుమానంగా అడిగాడు చిదంబరం.

'ఒరిదేవుడో రాకరాక ఒక కేసొచ్చిందను కుంటే... ఇట్టాంటి కేసుని పంపావేంటిరా బాబూ' అనుకుంటూ జుట్టు పీక్కోవడం మొదలుపెట్టాడు మహేశం.

ప్లీడరుగారికేం జరిగిందో తెలీక కళ్లు తేలే శాడు చిదంబరం.

– సూరిపండు

---

## చందా

'దసరా'గాని, 'వినాయక చవితి'గాని వచ్చిందంటే చాలు! హడలిపోతాడు నారాయణ. చందాల బాధ అతగాడికి తేలుకుట్టినంత బాధ! కాలనీ వెల్ఫేర్ అసోసియేషన్‌లోని సభ్యులు కొందరు చందాల వసూలుకు గ్రూపుగా బయలుదేరి ఊరుమీద పడతారు.

నాల్గురోడ్ల కూడలిలో వున్న అభయాంజనేయస్వామి గుళ్లో ప్రతి ఆదివారం మా కాలనీ సంక్షేమ సంఘ సమావేశం జరుగుతుంటుంది. చవితి సీజనైతే వినాయకుణ్ణి, దశమి సీజనైతే దుర్గాదేవిని నాల్గురోడ్ల కూడలిలో నిలబెట్టి 'సెవెంటీ ఎమ్మెమ్ సినిమా'లో, 'డిస్కో డాన్సుల' ప్రోగ్రాములో పెట్టి నిర్ణీత దినాలలో హడావుడి చేస్తారు. 'నిధుల కొరత' అనే దుస్థితి ఏర్పడకూడదని సమర్థవంతమైన (ఓ డజనుమంది) సభ్యులతో చందాల టీము తయారవుతుంది. షాపులు, ఇళ్లు, స్కూళ్లు, పరిశ్రమలు, వ్యాపార సంస్థలు ఒకటేమిటి! సందుసందునా సర్వేచేసి చందాల వసూలు జరుపుతారు. గృహస్థుని మొహమాట పెట్టి, మరీ తక్కువ ఇస్తే పదిమందీ చుట్టూ చేరి అతని ఇంట్లోనే అతణ్ణి నేరస్థుణ్ణి చూసినట్టు చూసి, అసలివ్వకపోతే దోషిగా నిలబెట్టి... ఇలా నిధుల సేకరణ జరుపుతారు.

కాలనీ చివర్లో అల్లంత దూరాన విసిరేసినట్టున్న ఇల్లు నారాయణది. గత రెండేళ్లుగా ఆ ఇంట్లో అద్దెకుంటున్న నారాయణ అల్లంత దూరంలో చందాల టీముని చూసేడంటే ఒక నెల అద్దె అదనంగా ఇవ్వాల్సి వచ్చినంతగా ఇదయిపోతాడు. పోతే, అతని కొలీగ్ రఘువీర్ మాత్రం చెక్కుచెదరకుండా తన ఇంటి వాకిట్లోనే తిష్టవేసి, చందాల టీముని వినోదంగా చూస్తాడు. నారాయణ ఇంటికి మూడిళ్ళ ఇవతలున్న పెంకుటిల్లే రఘువీర్‌ది. ఏమైందో ఏమోగాని చందాల టీము రఘువీర్ ఇంటి ఛాయలకైనా పోదు. అది రివాజు. చందా ఎగ్గొట్టడానికి రఘువీర్ ఏం మంత్రం వేస్తున్నాడో తెలుసుకోవాలని ఒకటే తహతహలాడిపోతున్నాడు నారాయణ.

అనుకున్నట్టుగానే చందాల టీమ్ రానే వచ్చింది. తట్టా బుట్టా వూడ్చి బావురుమంటూ చందా కట్టి, నారాయణ ఆ టీమ్‌లో తనూ కల్సిపోయాడు.

రఘువీర్‌గాడు ఎలా చందా ఇవ్వక చస్తాడో చూద్దామని. 'ఆగండి!' అని కొంప లంటుకుపోతున్నట్టు పెద్ద కేకవేసి, 'రండి! ఈ ఇంట్లో క్కూడా వెడదాం!' అని రఘువీర్ ఇంట్లోకి టీముని మళ్లించాడు తెలివిగా.

సందేహిస్తూనే టీము రఘువీర్ వాకిట్లో అడుగుపెట్టింది. టీములోని ప్రధాన సభ్యుడు "చవితి చందా సార్! ఆ వినాయకుడు మీకు భోగభాగ్యాల్ని ప్రసాదించుగాక!" అని బిల్లు బుక్కు, పెన్ను రఘువీర్ చేతికి

చ్చాడు.

"మేగ్జిమమ్ ఎంత రాస్తున్నారు?" అంకె వేయబోతూ అడిగాడు రఘువీర్.

"తమరి దయ సార్! ఆ భగవంతుడి బొక్కసాన్ని మీ వంటివారే నింపాలి" టీమంతా ఏకకంఠంతో పలికారు.

"వెయ్యినూట పదహార్లు రాస్తాను" రాయడం మొదలుపెట్టాడు రఘువీర్.

ఈ లోపున అతని కొడుకు పదేళ్ళవాడు తనూ ఓ బిల్ పుస్తకంలాంటిది ఇంట్లోంచి పట్టుకొచ్చి, టీము సభ్యులందరి పేర్లూ ఒక్కొక్క పేజీమీదా రాస్తూ, తలా ఒక రశీదూ చించి ఇవ్వసాగాడు.

దులోని ఎమౌంటు మీరు పట్టుకెళ్ళొచ్చు" అంటూ ముగించాడు.

అందరం మొహమొహాలు చూసుకుని, మా అందరి చేతుల్లోనూ వున్న రశీదులవైపోసారి చూశాం. "విశాఖపట్నంలో షిర్డీ సాయిబాబా ఆలయనిర్మాణ నిమిత్తం తమరు ఇచ్చిన చందా మొత్తం కృతజ్ఞతతో స్వీకరించడమైంది" ఆ డేష్‌మీద రఘువీర్ కొడుకు తనే అందరికీ అంకె వేసేశాడు "వెయ్యినూటపదహార్లు!"

టీము సభ్యుల మొహాల్లో కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు. మరిక జన్మలో ఆ గడప తొక్కకూడదని ప్రతినబూని బయట




రఘువీర్ అందరివైపూ ఒకసారి చూసి గొంతు సవరించుకున్నాడు. "అంచేత మీరు కూడా మేం జరపబోయే దైవకార్యానికి మీ వంతు సహకారాన్నందించి ఆ సాయినాధుని కృపకు పాత్రులవుతారని ఆశిస్తాను. చందాల వసూలు పూర్తయ్యాక, మీ మీ ఇళ్ళకెళ్లి నేనిచ్చిన రశీదుల్లోని ఎమౌంటు పట్టుకొచ్చి నాకు జమచేసి మీరు నాకిచ్చిన రశీ

పడ్డారు. టీములోంచి తప్పుకుని, రఘువీర్ని కలిసేందుకు వెనక్కొచ్చేడు నారాయణ.

కాబోయే దేవాలయ నిర్మాతకు జేజేలు పలుకుదామని కాదు. నారాయణకి తెలుసు! గుడి కట్టించేంత భక్త శిఖామణేంకాదు వాడు. మేరు పర్వతం తలక్రిందులైనా గుడి కోసం జాగా కొనడు. సముద్రాలన్నీ ఇంకిపోయినా గుడి నిర్మాణం చేపట్టడు. సూర్య చంద్రాదులు గతులు తప్పినా విగ్రహ ప్రతిష్ట చేయించడు. ఆ విషయం నారాయ

ణికి బాగా తెలుసు.

"ఏం ప్లాను వేశావు గురూ! అమోఘం" అన్నాడు (మెచ్చుకోలుగా) వెళ్తూనే.

"లేకపోతే ఏంది చెప్పు! ఆ నిర్వాహకుల్లో నూటికి తొంభయ్యయిదుమంది స్వాహాస్వాములే! చందాల డ్యూటీ పూర్తికాగానే ఆ సొమ్ములో కొంత పక్కకి తీసి, బ్రాందీ షాపుని పావనం చేయడం వీళ్ళ అలవాటు. ప్రజాధన దుర్వినియోగం అనేది ఇక్కణ్ణించే మొదలవుతుంది" ఆవేశ పడిపోతున్నాడు వాడు.

"ఇంతకీ సాయిబాబా గుడి విశాఖలోని ఏ ప్రాంతంలో కడతారో సెలవిచ్చినట్టులేదు" అన్నాడు బిల్ బుక్కును పరిశీలనగా చూస్తూ.

"ఏ ఎమ్వీపీలోనో, 'జగదాంబ జంక్షన్లో'నో అని మనకి తోచిన ఏరియా చెబుతాం. అక్కడ చదరపు గజం స్థలం ఖరీదు ఇంత వుంది. తమరు సహకరిస్తే ముందస్తుగా స్థలం కొనుగోలు చేస్తాం అంటాను. రశీదు మీద డేటూ గట్రా వుండదు కాబట్టి ఎన్ని సంవత్సరాలకైనా ఆ బిల్ బుక్కేంజేస్తుంది ఈ చందాలవాళ్లని భయపెట్టడానికి! ఎలా వుంది మన ప్లాను? " అన్నాడు రఘువీర్ చిన్నగా కన్నుగీటుతూ.

– పాటిబ్బడి చక్రరావు

---

# సాఫ్ట్‌వేర్-హార్డ్‌వేర్

"టిఫిన్లు చల్లారి పోతున్నాయి, ఇంకా ఎప్పుడు లేస్తారో ఏమో! రోజూ అలవాటైపోయింది. నా వాగుడు నాకే కానీ వినేవాళ్లు లేరు" వెంకాయమ్మగారు కోపంగా సుప్రభాతం మొదలుపెట్టింది.

'రోజూ ఈ సుప్రభాతం తప్పదు మాకు. శలవు రోజు కూడా సుఖంగా పడుకోడానికి లేదు' అనుకుని సుస్మిత చెల్లెలు సుష్మని లేపి "ఈ రోజు శలవని ఆమెకి చెప్పు" అంది.

సుష్మ లేచి రెండు చేతులు మూతి మీద స్పీకర్‌లా పెట్టుకుని "వెంకాయమ్మగారూ ఈ రోజు శలవురోజు. లేట్‌గా లేస్తాము. హాట్ ప్యాక్‌లో పెట్టండి" అంది గొంతుచించుకున్నట్లు.

వెంకాయమ్మగారు రుసరుసలాడుతూ గిన్నెలతో నాట్యం చేయిస్తోంది. ఈ రోజు ఆమె కోపానికి కారణం లేకపోలేదు. ముందురోజు సాయంత్రం చర్చల్లో ఆమె ఓడిపోవడమే దానికి కారణం.

సుశీల యజమానురాలైనా సంసార విషయాలు పట్టించుకోదు. తను రచయిత్రి, భర్త జర్నలిస్టు. శ్రీమంతుల ఇంటి బిడ్డ కావడంతో వంటావార్పూ రాదు. సుశీల పుట్టింటినుంచి వచ్చిన వంటమనిషి వెంకాయమ్మగారు పెత్తనం చేస్తుంది. ఇది కూతుళ్లకు నచ్చదు.

వెంకాయమ్మగారు చిన్నప్పటినుండీ సుశీల వాళ్ల ఇంట్లోనే పెరిగి పెద్దదయింది. భర్త పోవడంతో సుశీలకు పెళ్లైన తరువాత ఆమెను సుశీలతోపాటు పంపించేశారు. అప్పటినుండి సుశీల పురుళ్లు, పిల్లలను సాకడం అంతా ఆమే చూసుకుంది. ఆమె లేకపోతే ఇప్పుడు ఇల్లు గడవదు. అంతా ఆమెమీద ఆధారపడి ఉంది. వెంకాయమ్మగారు కూడా బాధ్యతగా, ప్రేమగా చూసుకుంటుంది. సుశీల పిల్లల్నయినా తిడుతుంది గానీ వెంకాయమ్మగార్ని తప్పుచేసినా ఒక్క మాట కూడా అనదు.

వెంకాయమ్మగారు వంటావార్పే కాదు చదువులేకపోయినా మంచి సంస్కారం ఉన్న మనిషి. అన్నీ తెలుసుకోవాలన్న జిజ్ఞాస వుంది. తనకు తెలిసిన విషయం అందరికీ విడమరిచి చెప్పడంలో మంచి దిట్ట. వాళ్ల ఇంట్లో జరిగే సాహిత్య, రాజకీయ చర్చల్లో ఉత్సాహంగా పాల్గొంటూ ఉంటుంది. ఆ ఇంటికి వచ్చేవాళ్లు కూడా ఆమెని



వంటమనిషిగా చూడరు. ఆమె సాహిత్య, రాజకీయ పాండిత్యానికి ఆశ్చర్యపోతూ చెవులు వొగ్గి మరీ వింటారు. ఆమె తనని వెంకాయమ్మగారు, అండి అనకపోతే ఊరుకోదు.

"ఏమ్మా వెంకాయమ్మగారూ ఏమిటి వార్తలు" అని ఎవరైనా అడిగితే చాలు ఆ రోజు వార్తలు అన్నీ ఏకరువు పెడుతుంది. న్యూస్ రీడర్ అయినా ఒక వార్త మిస్ అవుతాడేమో గానీ వెంకాయమ్మగారు పేపర్‌లో ఉన్న న్యూస్ అంతా చెప్పి దానిగురించి తన పట్టింది దేశానికి అనో, ఒక సైంటిస్టుని రాష్ట్రపతిని చేసి ఏం సాధిస్తారు అనో తన అభిప్రాయాల్ని ఖండితంగా చెప్తుంది.

ఆమె పరిజ్ఞానానికి నారాయణరావుగారు నవ్వుకుంటూ ఉంటారు. "మీ ఫ్రెండ్‌ని ఎంఎల్‌ఏగా నిలబెట్టవచ్చు" అంటారు వ్యంగ్యంగా సుశీలతో.

"అదే కాదు, దానికి సాహిత్యం కూడా బాగానే తెలుసు. నా కథలకి స్ఫూర్తి అదే! అంతేకాదు ఆధ్యాత్మికం, వేదాంతం కూడా చెబుతుంటుంది. ఆమెని ఏమన్నా ఊరు



అభిప్రాయాల్ని కూడా చెప్తుంది.

నారాయణరావుగారు ఇంట్లో ఉంటే రాష్ట్రపతి ఎన్నికల గురించో, కాశ్మీరు సమస్యల గురించో, జన్మభూమి కార్యక్రమాల గురించో చర్చిస్తూ ఉంటారు. ఆ చర్చల్లో వెంకాయమ్మగారు కూడా పాల్గొంటారు.

ఏమన్నా అనండి దేశంలో ఇందిరాగాంధీ లాంటి ప్రధాని ఇంకెవ్వరూ రాలేరు అనో, ఒక విదేశీ ఆడదాన్ని ప్రధాన్ని చేసే గతి

కోను" ఉక్రోషంగా అంటుంది సుశీల.

సుష్మ కల్పించుకుని "ఆవిడకి అవే కాదు చదువుల గురించి కూడా బాగానే తెలుసు. 'జీఆర్ఇ, టోఫెల్ రాస్తే అమెరికా వెళ్ళి ఎమ్ఎస్ చదవొచ్చు సుష్మా! నువ్వు అవి రాసి అమెరికా వెళ్ళాలి' అంటుంది. కంప్యూటర్ ఆపరేషన్ గురించి కూడా నన్ను అడిగి నేర్చుకుంటుంది. నేను మర్చిపోయి కంప్యూటర్ ఆన్‌చేసి నిద్రపోతే ఆమే షట్ డౌన్ చేస్తుంది" సుష్మ కాంప్లిమెంట్.

ఒక్క సుస్మిత మాత్రం మౌనంగా

ఉంటుంది ఆమె గురించిన చర్చల్లో. సుష్మ, సుస్మిత కంప్యూటర్ సాఫ్ట్‌వేర్ ఇంజనీరింగ్ చదువుతున్నారు.

వంటమనిషి జోక్యాన్ని సుస్మిత ఏమాత్రం సహించదు. ఆమె అరకొర పాండిత్యాన్ని ఏదో వంకని విమర్శిస్తూ ఉంటుంది. కానీ చేసేది లేదు. ఆమెమీద ఆధారపడక తప్పదు.

ఒకరోజు వాళ్ల ఇంట్లో హార్డ్‌వేర్, సాఫ్ట్‌వేర్‌ల గురించి చర్చలు, సాఫ్ట్‌వేర్ ఉపయోగాలు, సాఫ్ట్‌వేర్ కంపెనీలు ఎలా ఎంతెంత సంపాదిస్తున్నారో, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ల జీతాలు, సాఫ్ట్‌వేర్ కొనుగోళ్ల గురించిన చర్చలు జరుగుతున్నాయి. ఇదేదో కొత్త సబ్జెక్ట్. దాన్ని గురించి వెంకాయమ్మగారికి ఏమాత్రం అవగతం కావడం లేదు. ఆరోజు ఆమె ఆ చర్చల్లో పాల్గొనలేకపోయింది. కాలుకాలిన పిల్లిలా అటూ ఇటూ తిరుగుతోంది కానీ మాట్లాడలేకపోయింది. అది గమనించిన సుస్మిత సాఫ్ట్‌వేర్ గురించి ఉత్సాహంగా సుదీర్ఘ ఉపన్యాసం ఇవ్వసాగింది.

ఆ రాత్రి భోజనాలయ్యాక ఇంక ఉండబట్టలేక సుష్మ రూమ్‌లోకొచ్చి "సుష్మా! హార్డ్‌వేర్, సాఫ్ట్‌వేర్ అంటే ఏమిటి?" అని అడిగింది వెంకాయమ్మగారు.

కంప్యూటర్‌లో ప్రోగ్రాం చేసుకుంటున్న సుష్మ తల తిప్పి ఆమెకి ఎలా చెప్పాలా అని క్షణం ఆలోచించి, "ఏముంది వెంకాయమ్మగారూ! గ్యాస్ సిలెండర్ ఉందనుకోండి అందులో సిలెండర్ హార్డ్‌వేర్, గ్యాస్ సాఫ్ట్‌వేర్. కుక్కరు హార్డ్‌వేర్, అందులో అన్నం, పప్పు సాఫ్ట్‌వేర్. అలాగే ఈ కంప్యూటర్ హార్డ్‌వేర్, దీనిలో మేము ప్రోగ్రాం చేస్తామే అది సాఫ్ట్‌వేర్. అర్థమయిందా" అంది.

"ఇంతేనా! అర్థం అయింది. ఖర్చయ్యేదంతా సాఫ్ట్‌వేర్, స్థిరంగా ఉండేది హార్డ్‌వేర్ అన్నమాట" అంటూ సుస్మిత రావడం చూసి ఆ రూమ్ నుండి బయటకు వెళ్లిపోయింది.

మరోరోజు సాయంత్రం మళ్లీ సుస్మిత సాఫ్ట్‌వేర్ గురించిన చర్చ తీసుకువచ్చింది. ఇప్పుడు సాఫ్ట్‌వేర్ కంపెనీలు ఎంత స్లంప్‌లో ఉన్నాయో, ఉద్యోగాలు దొరక్క సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు అమెరికాలో ఎంత అవస్థ పడుతున్నారో, ఇక్కడ కూడా ఎంత టెన్షన్ పడుతున్నారో, కంప్యూటర్ కోచింగ్ ఇనిస్టిట్యూట్స్ అన్నీ ఎలా బజార్న పడ్డాయో వివరిస్తోంది.

"రెండు సంవత్సరాల్లో పరిస్థితి బాగుపడుతుందంటున్నారు చూడాలి" అని నారాయణరావుగారు అన్నారు.

వెంకాయమ్మగారు కల్పించుకుని "దాందేముందమ్మా! సాఫ్ట్‌వేర్ అంటే ఖర్చయ్యేదే కదా! అంతా ఖర్చయిన తరువాత మళ్లీ దానికి అవసరం, డిమాండ్ పెరుగుతుంటుంది" అంది తన పరిజ్ఞానాన్ని ప్రదర్శిస్తూ.

అందరూ ఆశ్చర్యంగా చూస్తుండిపోయారు.

నారాయణరావుగారు ఆశ్చర్యంనుండి తేరుకుని ఫక్కుని నవ్వుతూ "ఇంతకీ మీకు సాఫ్ట్‌వేర్ గురించి ఏం తెలుసు" అన్నారు.

అందరూ ఫక్కున నవ్వుతూ ఆమె వంక చూస్తున్నారు ఆమె ఏం చెబుతుందాని.

"నాకెందుకు తెలవదు, గ్యాస్‌సిలెండర్ హార్డ్‌వేర్ అయితే అందులో ఉన్న గ్యాస్ సాఫ్ట్‌వేర్. అలాగే కంప్యూటర్ హార్డ్‌వేర్ అయితే అందులో ప్రోగ్రామ్‌లు సాఫ్ట్‌వేర్. అయినా ప్రపంచంలో అన్నీ హార్డ్‌వేర్ సాఫ్ట్‌వేరే. అది కానిది ఏమీలేదు" అంది తన ఉక్రోషాన్ని అదుపుచేసుకుంటూ.

నవ్వుని ఆపుకుంటూ సుస్మిత సుష్మ చెవిలో "అబ్బ! ఆమె బుద్ధికి తగ్గట్టు చెప్పావే!" అంటూ చెయ్యి కలిపింది.

– రాధిక

*



# చతుర ప్రపంచం

## ఎన్నెన్నో వింతలు

మన చుట్టూ ఎన్నో రకాల జంతువులు ఉన్నాయి. వాటిల్లో కొన్ని ఎంతో వింతగా ప్రవర్తిస్తుంటాయి. 'హెమటిడ్' అనే దారము లాంటి పురుగు ఎలాంటి ఆహారం లేకుండా ఏళ్లపాటు జీవించగలదు. తిండి పోతు పురుగు గురించి చాలామందికి తెలిసిందే. దానిపేరు పట్టుపురుగు. ఇది కేవలం యాభైఆరు రోజులలో తన బరువు కంటే ఎనభైవేలరెట్లు తిండి తింటుందిట.

మరో వింత జంతువు ఆస్ట్రేలియాకు చెందిన కొయ్‌లా. ఈ జంతువు అసలు నీటినే తాగదు. మనకు తెలిసిన లేడి, జిరాఫీ వంటివి ఒక కంటిని మూసుకుని మరో కంటితో గమనిస్తూ ఉంటాయి.

ఒప్పాజం అనే జంతువు గురించి చెప్పుకోవాల్సిన విశేషం ఒకటుంది. అదేమిటంటే ఈ జంతువుకి కోపం వస్తే దాని హృదయస్పందన విపరీతంగా పెరిగిపోతుంది. ఆ టైంలో ఒప్పాజం గుండె నిమిషానికి దాదాపు పన్నెండువందల సార్లు కొట్టుకుంటుంది.

ఆఫ్రికాలో 'జెర్బోవా' అనే ఎలుక జాతికి చెందిన జంతువుంది. ఇది తల వెనక్కి తిప్పకుండానే వెనుకవైపు ఏమున్నదీ తిలకించగలదు. డ్రాగన్‌ఫ్లై గురించి విన్నారుగా. ఈ జంతువుకు మామూలుగా రెండు కళ్లు ఉంటాయి. ఆ రెండు కళ్లల్లో దాదాపు రెండువేల వరకూ చిన్నచిన్న కళ్లుంటాయి. ఈ వేలకళ్లతో మిశ్రమ కన్ను ఏర్పడు



తుంది. ఈ కళ్లను మైక్రోస్కోపుతో మాత్రమే చూడగలం.

కంగారు జంతువు గురించి మనకు తెలుసు. ఆస్ట్రేలియాకు చెందిన ఈ జంతువు సుమారు అయిదు అడుగుల ఎత్తు ఉంటుంది. కానీ పుట్టినప్పుడు దాని పొడవు ఒక అంగుళం మాత్రమే ఉంటుంది. కంగారు ఏ జంతువుతోనైనా పోట్లాటకు దిగినప్పుడు తన శరీరాన్ని మొత్తం తన తోక మీద నిలిపి కాళ్లతో ఎదురుగా ఉన్న శత్రువుని తంతుంది.

కుక్క ఎంత విశ్వాసకరమైన జంతువో మనకు తెలుసు. చెప్పే మాటలను అర్థంచేసుకుని తదనుగుణంగా ప్రవర్తిస్తుంది. రెండో ప్రపంచ యుద్ధ సమయంలో సమాచారం చేరవేయడానికి, కాపలా కోసమూ కుక్కలను ఉపయోగించారు. రష్యన్లు అయితే రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో టాంక్‌లు బద్దలుకొట్టేలా కుక్కలకు శిక్షణనిచ్చారు. కొన్నిరకాల కుక్కలు దాదాపు అయిదు లక్షల వరకూ వాసనలను పసిగట్టగలవు.

కప్పలలో విషపు కప్పలు కూడా ఉన్నాయి. కొలంబియాలో నివశించే కొకై అనే కప్ప ఈ విషపు కప్పల కోవకు చెందిందే. దీని చర్మం నుంచి తీసిన ఒక్క గ్రాము విషం దాదాపు లక్షమంది జనం ప్రాణం హరించగలదు.

ఆస్ట్రేలియాకు చెందిన ఒక జాతి కప్పలు పనులన్నీ నోటితోనే చేస్తాయి. ఈ కప్పలు జత కట్టడం, పిల్లల్ని కనడం అన్నీ నోటితోనే.

ఇలా చెప్పుకుంటూ పోతే మన చుట్టూ ప్రపంచంలో ఎన్నో వింతలూ, విశేషాలూ.

---

## ప్రముఖుల ముచ్చట్లు

గాంధీజీ, విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ మంచి మిత్రులు. వారిరువురూ ఒకరినొకరు బాగా గౌరవించుకుంటారు. ఒకరోజున వారు ఒక విషయమై చర్చిస్తూ కూర్చున్నారు. కాసేపటికి ఆ విషయంలో ఇరువురి అభిప్రాయాలూ వేరుకావడం వలన తీవ్రమైన ఆగ్రహానికి గురయ్యారు. అప్పటివరకూ ప్రశాంతంగా ఉన్న అక్కడి వాతావరణం వారి కోపంతో వేడెక్కి పోయింది. ఆ సమయంలో అక్కడే ఉన్న బాపూజీ అభిమాని వారిరువురినీ ఎలా చల్లబరచాలో తెలియక అక్కడే ఉన్న ప్రముఖ చిత్రకారుడు నందలాల్ బోస్ ను అడిగారు "బోస్ గారూ! మీరు ఈ ఇరువురిలో ఎవరి పక్షం వహిస్తారు?" అని. అందుకు ఆ చిత్రకారుడు "నేనొక చిత్రకారుణ్ణి. మీరు నన్ను 'మీకు ఏరంగు ఇష్టం?' అని అడిగితే ఏంచెప్పగలను? అన్ని రంగులూ నాకు ఇష్టమే. అలాగే గాంధీ, రవీంద్రులు కూడా. వారి మధ్య ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అన్న ప్రశ్నే ఉదయించదు" అన్నారు.

వెంటనే బాపూజీ, రవీంద్రులిద్దరూ ఆగ్రహాన్ని వదిలి చిరునవ్వులు చిందించడంతో వాతావరణం చల్లబడింది.

★ ★ ★

ఒకసారి గాంధీజీ 'చర్కాసంఘం' నిమిత్తం విరాళాలు వసూలు చేస్తూ అనేక నగరాల్లో, గ్రామాల్లో సంచరించారు. ఆ సమయంలో ఆయన ఒరిస్సా వెళ్లి ఒక అతి పెద్ద సభలో ఉపన్యసించారు. బాపూజీ ఉపన్యాసం ముగియగానే జనంలో నుంచి పేదరాలైన కడు వృద్ధురాలు లేచి ముందుకు వెళ్లబోయింది. ముసలితనం వల్ల ఆమె నడుం ఒంగిపోయింది. తల ముగ్గుబుట్టలా ఉంది. దుస్తులు చిరిగిపోయి ఉన్నాయి. ఆమెను వాలంటీర్లు ఆపు చేశారు.

ఆ వృద్ధురాలు వారిని లెక్కచెయ్యకుండా ముందుకు సాగుతూ "నేను తప్పక మహా




త్ముణ్ణి కలవాలి" అంది ధృఢ నిశ్చయంతో. ఆమె జనాన్ని తప్పించుకుంటూ అతి కష్టం మీద నడక సాగించి చివరికి వేదికపైకి వెళ్లి బాపూజీ పాదాలు తాకి నమస్కరించింది. పిమ్మట తన కొంగున ముడివేసిన ఒక రాగి నాణెం తీసి గాంధీజీ పాదాలపై ఉంచింది. మహాత్ముడు ఆ నాణాన్ని భద్రంగా తన వద్దనే ధాచారు. చర్కా సంఘం విరాళాలు అన్నీ జమ్నాలాల్ బజాజ్ అధీనంలో వుండే విధంగా గాంధీజీ ఏర్పాటు చేశారు. బజాజ్ ఆ నాణాన్ని ఇవ్వమని గాంధీజీని అడిగితే ఆయన నిరాకరించారు.

"బాపూ! చర్కాసంఘం విరాళాలు తాలూకా వేల రూపాయల చెక్కులు నా వద్ద భద్రంగా ఉన్నప్పటికీ మీరు రాగి నాణెం విషయంలో మాత్రం నన్ను నమ్మటంలేదు" నవ్వుతూ అన్నాడు జమ్నాలాల్.

వెంటనే మహాత్ముడు గంభీరంగా "చూడు బజాజ్! ఈ రాగినాణెం ఆ వేలాది రూపాయలకన్నా విలువైనది. కొన్ని లక్షల రూపాయలున్న ఆసామి ఒక వెయ్యి రూపాయలు గానీ, రెండువేల రూపాయలుగానీ విరాళంగా ఇస్తాడు. ఈ మొత్తం అతనికి ఓ లెక్కలోనిది కాదు. అయితే ఈ నాణెం అలాకాదు. బహుశా ఆ వృద్ధురాలి వద్దనున్న విలువైనది ఇదొక్కటే కావచ్చు ఆమె తన దంతా ఇచ్చి ఎంతో త్యాగం చేసింది. అందుచేత ఈ నాణాన్ని కోట్లాది రూపాయలకన్నా విలువైనదిగా తలుస్తాను" అన్నారు.

## వ్యంగ్యచిత్ర కథ!

కార్టూన్ లేదా వ్యంగ్యచిత్రం అనగానే వినోదం ప్లస్ వ్యంగ్యంతో కూడిన చిత్రం అన్న సంగతి మనకు గుర్తుకు వస్తుంది. కార్టూన్లు పాఠకులకు వినోదాన్ని కలిగించడంతోపాటు సమాజం, సంస్థలలోని అవినీతిని, బలహీనతలను ఎత్తి చూపుతాయి. వీటికి కొంచెం వ్యంగ్యాన్ని జోడిస్తాయి.

మొట్టమొదటి రాజకీయ కార్టూన్‌ను

'ప్లెయిన్ ట్రూత్' అనే కరపత్రంలో 1747లో అమెరికాలో ప్రచురించారు. ఈ కార్టూన్‌ను చూసి ప్రభావితులై దాదాపు పదివేలమంది పెన్సిల్వేనియా సేనలో చేరారంటే కార్టూన్ ప్రభావం గురించి అర్థం చేసుకోవచ్చు.

కార్టూన్స్ గురించి చెప్పుకోవాల్సి వస్తే 'బాబ్ రిప్లీ' కార్టూన్ గురించి పేర్కొనాలి. 1929లో 'నమ్ము నమ్మకపో' అనే శీర్షికతో ఓ కార్టూన్ చిత్రించి ఓ పత్రికలో ప్రకటించాడు. అప్పట్లో అమెరికాకు జాతీయగీతం విస్తుపోయారు. ఎందుకంటే బాబ్ రిప్లీ చిత్రించి ప్రచురించిన కార్టూన్‌కు స్పందించిన జనం దాదాపు యాభై లక్షలమంది ఉన్నట్లు తేలింది. దాంతో అమెరికన్ కాంగ్రెస్ మేల్కొని 1931 మార్చి 2న సొంతంగా జాతీయగీతాన్ని రూపొందించుకుంది. మొత్తంమీద అమెరికా జాతీయ గీతం ఏర్పడడానికి కారణం ఓ కార్టూన్ అని చెప్పక తప్పదు.

ఇక కామిక్ స్ట్రిప్స్ విషయానికి వస్తే మొట్టమొదటి కామిక్ స్ట్రిప్ 'ఎగ్జామినర్'




లేదు. 'బాబ్ రిప్లీ' ఆ విషయాన్నే ప్రస్తావించాడు. జాతీయగీతంగా ప్రస్తుతం ఉపయోగిస్తున్న పాట ఇంగ్లీషువారు ఒకప్పుడు తాగి పాడేపాట అన్నది ఆ కార్టూన్ సారాంశం. ఇక చెప్పేదేముంది? ఆ కార్టూన్ చూసి అమెరికన్ ప్రజలు అమెరికన్ కాంగ్రెస్‌పై ఉత్తరాల వర్షం కురిపించారు. ఆ కార్టూన్‌లో ఉన్న 'సారాంశం నిజమేనా?' అంటూ వచ్చాయి ఆ ఉత్తరాలు. ఆ ఉత్తరాల సంఖ్యను లెక్కించిన అధికారులు అనే పత్రికలో 1892లో అచ్చయ్యింది. ఈ కామిక్ స్ట్రిప్ పేరు 'లిటరేచర్ అండ్ టైగర్'. భారతదేశం విషయానికి వస్తే 'టైమ్స్ ఆఫ్ ఇండియా'కు ఆ ఘనత దక్కింది. 1929లో టైమ్స్ ఆఫ్ ఇండియా తన మొట్టమొదటి కామిక్ స్ట్రిప్‌ను ప్రచురించింది.

✤

# ఏరినముత్యాలు

★ దేముడు ఇంకా గొప్ప విషయాలకోసం మనల్ని మలిచేందుకు వాడే పరికరాలు కష్టాలు.

- హెచ్. డబ్ల్యు.బీచర్

★ నకిలీ నిజం చెరుపు చేసినంతగా నిజం ఈ లోకంలో మంచి చేయడం లేదు.

- లొరాచెఫొకాల్డ్

★ మనుషులెంత స్వార్థపరులో, వారు చూపే మర్యాద ఎంత కృతకమో తెలియాలంటే ఓడ ప్రయాణం చెయ్యి.

- బెర్నార్డ్ షా

★ ఊరికే ఇచ్చిన పుస్తకం చదవరు, డబ్బు పెట్టి కొంటే తప్పకుండా చదువుతారు.

- శామ్యూల్ జాన్సన్

★ మనలో ఉత్సాహం కొరవడినప్పుడే పరుల పట్ల మనం ఉదాసీనులుగా ఉంటాం.

- హాజ్‌లిట్

★ తమ నిజస్వరూపాలని బట్టి కాక పైకి కనిపించే రూపాలనిబట్టే మనుషులకు విలువ కడుతున్నారు.

- బుల్వెర్ లిట్టన్

★ తెలిసిన ఇంటినీ, ఊరినీ ప్రేమించలేని వాడు తెలియని మానవజాతిని ఎలా ప్రేమించగలడు?

- విలియం రాల్ఫ్ ఇంగె

★ నిజమైన స్నేహితుడు మనసు విప్పి మాట్లాడతాడు, చక్కని సలహా ఇస్తాడు. కష్టాల్లో ఆదుకుంటాడు.

- విలియమ్ పెన్

★ బుద్ధిరాదు, బుద్ధిరాదు... పెద్దల సుద్దులు వినక.

-త్యాగరాజు

★ మానవుని కోరికలు జేబులో నాణెముల వంటివి. పెరిగేకొద్దీ భారమెక్కువవుతుంది.

- సత్యసాయిబాబా

★ లోకంలో ఎక్కువ కష్టమైనవి రెండు. పేరు ప్రతిష్ఠలు సంపాదించుకోవడం, సంపాదించుకున్న వాటిని నిలబెట్టుకోవడం.

- కెన్నడీ

సేకరణ: పి.వి.రమణకుమార్

# 'పతనం' పై సమీక్షలు

**జూలై చతురలో ప్రచురితమైన శ్రీసుభా నవల 'పతనం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు**

## సమాజ లక్షణం

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

జూలై 2002 చతురలోని శ్రీసుభా నవలలో ప్రధాన అంశం అవినీతి పనులవల్ల సత్యమూర్తి పతనం కావటం. సత్యమూర్తి జీవితం ఇతరులకి కనువిప్పు కలిగిస్తుందనుకుంటే మాత్రం అది ఒట్టి భ్రమ అని చెప్పక తప్పదు. ఇటువంటి సత్యమూర్తులు మనదేశంలో కోకొల్లలుగా ఉన్నారు. ఎవరూ కూడా తమ అవినీతి పనులవల్ల దుర్గతి ప్రాప్తిస్తుంది అని అనుకోవటంలేదు. ఎ.సి.బికి కొందరు పట్టుబడటం చూస్తూ ఉండి కూడా ఏమాత్రం చలించటంలేదు. పైగా పట్టుబడ్డ వాళ్లు చేసిన తప్పులు తాము చేయకుండా, పట్టుబడకుండా జాగ్రత్త పడుతున్నారు. సత్యమూర్తిని మనం అసహ్యానికి గురిచేయాల్సిన అవసరంలేదు. ఆయన ఈనాటి మన సమాజం ప్రాడక్టు. నిజం చెప్పాలంటే ఎక్కువ తక్కువ భేదాలు తప్ప ప్రతి వ్యక్తిలో సత్యమూర్తి ఉన్నాడు. విలాసవంతమైన జీవితం గడపాలనే తపన, తక్కువ కష్టం ఎక్కువ లాభం అనే సిద్ధాంతం, పట్టుబడ్డా ఏళ్ల తరబడి శిక్షలు లేకపోవటం, నేరాన్నిబట్టిగాక వ్యక్తులనిబట్టి రూల్సు అమలు చేయటం వగైరా మన సమాజ లక్షణాలు, అవినీతి ప్రోత్సాహక కారణాలు. సత్యమూర్తి తెలివి తక్కువవల్ల పట్టుబడ్డాడు అనుకుంటారు తప్ప అవినీతికి



పాల్పడి పతనం చెందాడు అనుకోరు. నవల చెడుని కేంద్రంగా తీసుకొని రాయబడ్డది కాబట్టి పాఠకులని ఆద్యంతం ఆకట్టుకుంటుంది.

–కె.రామారావు
హైదరాబాద్

## బర్నింగ్ ప్రాబ్లెమ్

*(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

అవినీతి ఊబిలో కూరుకుపోయిన మనిషి తాను పతనమై సమాజాన్ని ఏవిధంగా భ్రష్టు పట్టిస్తాడో 'పతనం' నవల్లో కళ్లకు కట్టినట్టు చూపించారు శ్రీసుభా.

ఈ ప్రపంచీకరణ యుగంలో వస్తు విని యోగ సంస్కృతి ప్రజలను వెల్లువలా ముంచెత్తుతూ వుంటే సులభార్జనతో సౌఖ్యవంతమైన జీవితాన్ని గడిపే దిశగా మనిషి మైండ్ ట్యూన్ చేయబడింది. ఆధునిక మానవుడు కష్టపడకుండానే డబ్బు సంపాదించే పద్ధతులను అన్వేషిస్తున్నాడు. అక్రమార్జనకు పాల్పడి అయినా ఈజీ మనీని సమకూర్చుకుని, విలాసవంతంగా జీవించాలనుకునే ప్రక్రియలో నైతిక విలువలను విస్మరించేందుకు, మానవీయతను

మంట గలిపేందుకు సైతం వెనుకాడని హీనస్థితికి మనిషి దిగజారాడు. గతంలో ఈ లంచగొండి తనపు ఛాయలు ఉన్నప్పటికీ అవి రేఖామాత్రంగానే వుండేవి. ఇప్పుడు అదుపన్నది లేకుండా అవినీతి పరాకాష్ఠకు చేరుకుంది. 'లంచాల ఉనికి మీ దృష్టికి వస్తే ఫలానా చిరునామాకు తెలియజేయండి' అని ప్రతి సంస్థలోనూ నేడు బోర్డులు కనబడుతున్నాయంటే లంచగొండితనం ఎంతగా వేళ్లూనుకుని వుందో అవగతమవుతుంది. అంతులేని ధనదాహంతో ప్రజాధనాన్ని దిగమింగే అవినీతిపరులు చివరికి తాము పతనావస్థకు చేరుకోవడమే గాక బడుగు జీవులకు మనుగడ లేకుండా చేస్తున్నారు. నవలలో సత్యమూర్తి పాత్ర ద్వారా లంచగొండితనం యొక్క విశ్వరూపాన్ని, దాని పరిణామాన్ని కళ్లముందు నిలిపారు రచయిత. దేశ రక్షణకు సంబంధించిన విషయంలో దేశంకోసం పోరాడే సిపాయిల చేతిలోని ఆయుధాలకు అవినీతి జబ్బుసోకి అవి నాసిరకానివైనప్పుడు దేశానికి ఎంత ప్రమాదమో తలుచుకుంటేనే ఒళ్లు గగుర్పొడుస్తుంది.

నవలలో అత్యున్నతంగా గాంధీ పాత్రను తీర్చిదిద్దిన తీరు ప్రశంసనీయం. కన్నకొడుకైనా అవినీతిపరుడైతే క్షమించకుండా తన కాన్షస్ చెప్పినట్టు ముక్కుకు సూటిగా పని చేసే గాంధీ గారిలాంటి ఉత్తముణ్ణి నేటి ఉద్యోగులు ఆదర్శంగా తీసుకోవాలి. మనదేశంలోని ఉన్నతోద్యోగులు, రాజకీయ నాయకులు విదేశాల్లో దొంగచాటుగా దాచుకున్న డబ్బు విలువ నలభై ఎనిమిది వేల కోట్ల రూపాయలు. ఇది మనం విదేశాల నుంచి అప్పుగా తెచ్చుకున్న డబ్బుతో సరిసమానం అని రచయిత తాను సేకరించిన డేటాను నవల్లో (ఒకసారి చెబితే సరిపోతుంది... కానీ) రెండు చోట్ల పేర్కొనడం జరిగింది. ఈ పాయింటును బాగా ఫోకస్ చేయాలని ఆయన ఉద్దేశ్యం కాబోలు.

గాంధీ, విజయప్రకాష్, ఝాన్సీ, కాంతమ్మ లాంటి పాత్రల్ని హుందాగా మలిచిన తీరు మన్ననలందుకుంటుంది. ముఖ్యంగా సత్యమూర్తి జైలు పాలయ్యే పరిస్థితి రానున్నప్పుడు కూడా తమ ఆదర్శాలకు తిలోదకాలివ్వకుండా స్థిరంగా నిలబడ్డాయి ఈ పాత్రలు. విశేషించి ఝాన్సీ ఆహా అనిపించింది. అవినీతి కేసులో పీకలదాకా కూరుకుని జైలు పాలవ్వబోతున్న భర్త కేసులోంచి తప్పించుకునేందుకు అక్రమ మార్గాలనెన్నుకుని, అందుకు సహకరించాల్సిందిగా తనను వత్తిడి చేసిన సందర్భంలో చేసిన తప్పు ఒప్పుకుని చట్టానికి లొంగి పొమ్మన్న ఆమె ప్రవర్తన నారీ లోకానికే గర్వకారణం.

బర్నింగ్ ప్రాబ్లెమ్‌ని నవలా వస్తువుగా ఎన్నుకుని సరళమైన రీతిలో మంచి సందేశాన్ని ప్రజెంట్ చేయడంలో రచయిత కృతకృత్యులయ్యారని నిస్సందేహంగా చెప్పవచ్చు.

—పి.సి.రావు
విశాఖపట్నం

## ప్రముఖ స్థానం

*(మూడవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

మనదేశాన్ని సమూలంగా నాశనం చేస్తున్న అనేక కారణాలలో ప్రధానమైనది లంచం. ప్రపంచంలో మోస్ట్ కరప్టడ్ దేశాలలో మన దేశానికి ప్రముఖ స్థానముంది. ఇది మనం సిగ్గుతో తల దించుకునేట్లు చేసింది, చేస్తోంది. దేశ ప్రగతిని కుంటుపరుస్తూ దేశశక్తిని నిర్వీర్యం చేస్తున్న లంచం క్యాన్సర్ లాంటిది.

మనలో చాలామంది 'విలువలు మారాయి' అంటుంటారు. వాస్తవానికి మారేవి మనుష్యుల స్వభావాలేకదా! ఎల్ల




ప్పుడు 'సత్యమునే పలుకుము', 'పరుల సొమ్ము పాములవంటిది' ఇత్యాది సామెతలు కాల, మాన పరిస్థితులనుబట్టి మారతాయా! వాటిని వల్లించటానికి చూపే హిపోక్రసీ అంతా ఇంతా కాదు. ఆచరణకు మనసు ఒప్పుకోదనేకన్నా దానిని సంసిద్ధం చేయటానికి మనకు అవసరమైన సత్యసంధత, నిబద్ధత లేదని ఒప్పుకుందాం.

దేశాన్ని భ్రష్టు పట్టిస్తున్న యువతను పెడదోవ పట్టిస్తున్న ఈ లంచం అనే మహమ్మారిని కథా వస్తువుగా ఎన్నుకోవటం ఒకటే ఈ నవలలో మనస్ఫూర్తిగా మెచ్చుకునే అంశం. అయితే కథాకథనం ఆకట్టుకునే విధంగా లేదు. పాత్రలలో సంఘర్షణ లోపించటంతో ఏ పాత్రా నిలబడలేక, పాఠకులను ఆకర్షించలేకపోయింది. సత్యమూర్తిలో ఉన్నట్లనిపించినా అది చాలలేదు. ఒక్క గాంధీ పాత్రే మినహాయింపు. దీని స్వభావం పాఠకులకు ముందే నిర్దిష్టంగా తెలిసి ఒక స్పష్టమైన అవగాహన ఏర్పడుతుంది. అంటే ఆ పాత్ర స్వభావ, స్వరూపాలు చివరవరకు ఉండటం పాత్రకు ఒక హుందాతనం, ఠీవిని ఇస్తాయి. అటువంటి పాత్రలే మన మనసులో ఉండిపోతాయి.

నవల నచ్చకపోవటానికి మరో కారణం ఉపన్యాసధోరణి. ఇది చదువరులకు ఇబ్బందే. ఈ ధోరణి తగ్గి చెప్పదలుచుకున్న అంశాన్ని పాత్రల స్వభావంలో అంతర్వాహినిగా శ్రీసుభా చేయగలిగి ఉంటే ఈ నవల మరింత రక్తి కట్టేది.

—బి.హెచ్.వి.సుబ్బారావు
అడవినెక్కలం

## సమరభేరి

*(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

ఈనాడు దేశానికి కీలకమైన రక్షణరంగంలో కూడా విస్తరిస్తున్న అవినీతిని 'పతనం' నవలలో చక్కగా దర్పణం పట్టి చూపించారు రచయిత శ్రీసుభాగారు. దేశంలో అన్నిరంగాలలోను హద్దు, అదుపు లేకుండా పెరుగుతున్న అవినీతిమీద రచయితలు దృష్టి సారించి తమ కలాలకు పదునుపెట్టి సమరం సాగించాల్సిన ఆవశ్యకతను శ్రీసుభాగారు పతనం నవల ద్వారా చాటిచెప్పారు. ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసే ఇలాంటి రచనలు చేయటం, ప్రజలకు కనువిప్పు కలిగించటం, నేటి రచయితల తక్షణ కర్తవ్యం! అటువంటి ఆదర్శవంతమైన రచనకు పూనుకున్న శ్రీసుభాగారు అభినందనీయులు.

"మనం సంపాదించుకున్న స్వతంత్రం దేశభక్తుల్ని వెనక్కునెట్టి పదవులకోసం పాకులాడే వాళ్లని, ఇంటిదొంగల్ని, తయారు చేసుకునేందుకు మాత్రమే ఉపయోగపడింది. మనం ఈ వ్యవస్థని ఎక్కడో అక్కడినుండి నరుక్కురాకపోతే మనకు మనుషులకు బదులు పందికొక్కులే మిగులుతాయి" అని విజయప్రకాష్ అంటాడు. ఆ పాత్రచిత్రణ బాగుంది.

"విజయప్రకాష్! నీ ఆశయంగొప్పది. నీలాంటివాడు రాష్ట్రానికి ఒకరుండాలి" అని తిలక్ ప్రశంసించటం అర్థవంతంగా వుంది.

"మన పుట్టుక వెనక యేదో పరమార్థం వుందని నమ్మినపుడు మనం మంచినే పెంచి పోషించాలి. ఎదుటి మనిషి అక్రమాలు, అన్యాయాలూ చేస్తున్నాడని బాధపడేముందు మనం వాటి దరిదాపులకు వెళ్లకుండా ఉండగలగాలి!" అని ఝాన్సీ అంటే-

"అందరూ నేనొక్కణ్ణే అవినీతిపరుణ్ణని అనుకుంటున్నారు. కాని చాలామంది యిళ్లలో ఈ భాగోతం నడుస్తూనే వుంది" అంటూ ఏ.సి.బి. వలలో చిక్కిన (అ)సత్య

మూర్తి అక్షరాలా సత్యమే చెప్పాడు.

కథలో హాస్య శృంగార రసాలు సముచితంగా పరిమితంగా వున్నాయి.

"ఎంతటి ఎ.సి.బి. ఉద్యోగస్థుడైనా తన ఆనందంకోసం భార్యకు రకరకాల లంచాలు యివ్వవలసిందే! భార్యాభర్తలన్న వాళ్ళు పగలు కొలీగ్స్‌గా, రాత్రుళ్లు తోడుదొంగలుగా అవతారాలు ఎత్తితేనే వాళ్ళు ఆదర్శ దంపతులవుతారు తెలుసా?" అన్న భైరవి సరస సంభాషణ హాస్య, శృంగార రసాల్ని జతకలిపి పాఠకుల్ని రంజింపజేసింది.

"మన రాజకీయ నాయకులూ, ఉన్నత పదవుల్లో ఉద్యోగాలు చేసేవాళ్ళూ, కలిసి విదేశాల్లో దాచుకున్న డబ్బు నలభైయెనిమిది వేలకోట్లు. ఇది యాభైయేండ్లుగా మన ప్రభుత్వాలు విదేశాలనుంచి రుణంగా తీసుకున్న డబ్బుతో సమానం! ఇది వినటానికి దారుణంగా వున్నా పచ్చినిజం!"

ఇంత స్పష్టంగా దేశంలోని అవినీతిని ఎత్తి చూపిన రచయిత శ్రీసుభాగారిని ఎంతని అభినందించను? ఏమని పొగడను?

అవినీతిమీద రచయితలందరూ ఇక ముందు సమరభేరిమ్రోగించాలని ఆశించుదాం!

– సూర్యదేవర వెంకటేశ్వరరావు
హైద్రాబాదు 500 044.

## ఇరుకుదారి

*(అయిదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

జూలై 2002 చతురలోని శ్రీసుభా రచన పతనం సరియైన సమయంలో వచ్చిన మంచి నవల. నైతిక విలువల ఆవశ్యకతను, అవసరాన్ని అవి లేని వ్యక్తిని చివరకు ఆత్మీయులు, స్నేహితులు ఎలా అసహ్యించుకొంటారో తెలియజేయడంలో రచయిత కృతకృత్యులయ్యారు. నిజాయితీపరులు, ఆదర్శవాదులైన తల్లిదండ్రులు, అత్తమామలు భార్య ఎంత హెచ్చరించినా వినక తన ఉచ్చు తనే బిగించుకొంటాడు సత్యమూర్తి. అలాంటివారిని తయారుచేస్తున్నదీ సమాజమే. తనచుట్టూ అక్రమార్జన ద్వారా సుఖాలు పొందుతున్న అవినీతిపరులైన ఉద్యోగులని చూసిన వ్యక్తి సైకిలు గూడా లేని తాను రాజకీయాల్లోకి వచ్చాక ఎ.సి.కార్లు, బంగళాలు, స్విస్‌బ్యాంకులో బేలన్సులూ, బినామీ పేర్లతో భూములు సంపాదించి సుఖపడాలనుకుంటాడు. సత్యమూర్తి బొత్తిగా ఉద్యోగస్థుడు. అతను రాజకీయాల్లో ఉండి అలా చేస్తే ఎవరూ ఏమీ చేయలేరు. ఎందుకంటే కోట్ల రూపాయలు బాత్‌రూముల్లో దొరికినా కుంభకోణాలు చేసి ఫైవ్‌స్టార్లు కట్టినా, టేపుల్లో బయటపడినా వాళ్ళు మిస్టర్ క్లీన్‌లుగా బైటకొస్తారు. అవినీతికి దారి మొదట విశాలంగా ఉంటుంది. పోనుపోను ఇరుకై ఊపిరాడనివ్వదు. వాల్మీకి కథలా చెడున్ను పంచుకుందుకు కట్టుకున్న భార్య కలిసిరాదు. కనీసం సానుభూతిచూపదు. అందుకే మనిషి తనకుతానుగా కొన్ని పరిధులు ఏర్పాటుచేసుకొని ఎందరెన్ని విమర్శించినా న్యాయమైన, చట్టబద్ధమైన, ధర్మయుతమైన జీవితాన్ని గడపాలనే చక్కని సందేశాన్నిచ్చిన పతనం నవల పాఠకులను ఆలోచింపజేస్తుంది. సమాజ స్పృహతో రాసిన శ్రీసుభాగారు అభినందనీయులు.

–నరెడ్ల అచ్యుతరామం
అల్లిపూడి 533 400.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328.Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Chennai: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933. Khammam: 55661; Ongole: 56777; Nizamabad: 45661; Mahabubnagar:77438; Mumbai: 022- 4703700; Chennai: 044- 2314980; Bangalore: 080- 3503498

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!




ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు...
మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెలోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కేజీ, 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.







**priya**

**Pickles**
ఏ పచ్చడంటే
ఆ పచ్చడి సంసి

ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్, (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482